# ఆంధ్రసచిత్ర వారపత్రిక

గొప్పోళ్ల బతుకులు (కథ)
అరిగే రామా రావు



8-7-'59

25 నయాపైసలు

ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY



"లంబాడీల నృత్యం"

చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ.



కృష్ణ - రాధ

ఫొటో : షవల కృష్ణకుమార్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతి 25 న.పై

Founder: K. NAGESWARA RAO

ఆషాఢ శుద్ధ ద్వితీయ బుధవారం

సంపుటము 53
సంచిక 40
8-7-59

# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
రాజశ్రీ వారి మూడవచిత్రంలో ఎం. ఎస్. రాజం.
— ఫోటో: సోమయాజులు.


| | | |
|---|---|---|
| రాజధానికబుర్లు— | — | 3 |
| గొప్పోళ్ల బతుకులు—అరిగే రామారావు | — | 6 |
| దొంగలు—ఆమంచర్ల గోపాలరావు | — | 13 |
| పరిసరాలు—మల్లాది సత్యనారాయణ | — | 16 |
| రెండుపదులు—రామకృష్ణ | — | 20 |
| అన్వేషణ—పోతుకూచి సాంబశివరావు | — | 25 |
| మీ రెవరో మీకు తెలుసా? | — | 28 |
| ఆరుద్ర గళ్లనుడికట్టు— | — | 31 |
| నక్షత్ర ఫలితాలు—బి. నరసింగరావు | — | 32 |
| బాలసాహితి— | — | 35 |
| వివాహం కథ (సీరియల్) పి. దక్షిణామూర్తి | — | 37 |
| బాలలసంఘం— | — | 39 |
| వనితాలోకం—పిల్లలమర్రి భ్రమరాంబ | — | 43 |
| పారపాఠ్యాలు—ఎం. కనకదుర్గ | — | 44 |
| వనితావాణి— | — | 47 |
| సినిమా— | — | 50 |
| పుస్తకసమీక్ష— | — | 56 |


## మధ్య పేజీలలో ప్రత్యేకాకర్షణ.





# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## ఉస్మానియా ఉదంతాలు

మనుష్యులు కలిసి జీవించాలని నిశ్చయించుకున్న తర్వాత, సాముదాయిక కార్యనిర్వహణకోసం సంస్థ లేర్పడక తప్పదు. సంస్థల నిర్వహణకు నియమాలు, నిబంధనలు కల్పించుకోక తప్పదు. సాముదాయిక ప్రయోజనాలు సిద్ధించడంకోసం వ్యక్తులపై కట్టుబాట్లూ తప్పదు. ఈ ప్రయోజనాలు సిద్ధించినప్పుడే సంస్థల, నియమాల, నిబంధనల ఉనికి సమర్థనీయమౌతుంది.

సంస్థల నియమాలను నిబంధనలను నిర్వహించడానికి అధికారులుంటారు. ఈ అధికారులు కూడా మనవారేకదా? సంఘంలో పలుకుబడిగల వ్యక్తుల, వర్గాల పలుకుబడి ఈ అధికారులపై ప్రసరింపబడుతూఉంటుంది. ఇది సాధ్యంకాకుండా చేయడం పత్రికల బాధ్యత. ఒకటి సంఘంయొక్క నియమాల వల్ల వ్యక్తుల హక్కులకు భంగం వాటిల్లకూడదు. రెండు. వ్యక్తుల (సంకుచిత) ప్రయోజనాలకొరకు సంఘంయొక్క నియమాలు సడలింపబడకూడదు.

ఈ రెండు విషయాలను మనసులో కొని ఈ భాగం 'రాజధానికబుర్లు'లో—

కన్ను మూసుకొని గాఢంగా నిద్రిస్తూన్న నగరపాలక సంఘాన్ని గురించి, ముందు వెనుకలు చూడకుండా కొంచెం అటూ ఇటూగా నడుస్తూన్న ఉస్మానియా విశ్వవిద్యాలయం గురించి, రాజధానిలో ప్రమాదాలు నివారించడంకోసం నగర పోలీసుశాఖ నియమించిన 'ముందు చూపు రహదార్ల'నుగురించి, సున్నాలు, ఎనిమిదులు చుట్టుకుంటూ ప్రదక్షిణంలో పరమానందాన్ని పొందుతూన్న రవాణా సంస్థనుగురించి-కూడా ప్రస్తావిస్తాను.

చివరది మొదట.

* * *

### ప్రదక్షిణలో పరమానందం

“నేనే రాణీనైతే-” అంటూ ఎలక్షన్ మేనిఫెస్టో ప్రకటించింది 'చండిక'లో శ్రీమతి పసుపులేటి కన్నాంబ. చాకలిపేరిగాడు మరో ఆకు ఎక్కువ చదివాడు. “పేరిగాడు రాజంట! పేరెల్లి రాణంట!” అంటూ ఎగిరాడు. ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ నడిచే తీరు చూస్తే చాకలి పేరిగాడు గుర్తుకొస్తాడు సులభంగా.

ప్రతాపరుద్రుడు బందీగా ఉన్న రోజుల్లో, యుగంధరమంత్రికి పిచ్చెత్తే ముందు ప్రారంభించి, పిచ్చి కుదిరేవరకు పేరిగాడిదే ఏకచ్ఛత్రాధిపత్యం ఆంధ్రప్రదేశంలో.

నిజామ్ స్టేట్ రైల్వేలో భాగంగా ఉండేది ఆర్. టి. డి. ఒకప్పుడు. రైలు సేవలలో దిగే ప్రయాణికుల సౌకర్యార్థం నడుపబడిన శాఖ ఇది. నగరంలో ఆర్. టి. డి. బస్సులు నడిచేవిగాని 'ప్రజల ఉపయోగం కోసం నడుస్తున్నాం'అన్న సంగతి గమనించి నడిచేవి. అప్పట్లో రాణిగంజి నుంచి కోఠీకి టికెట్ రెండున్నర అణాలు హాలీ. అంటే సుమారు రెండణాలు. ఇప్పుడు మూడున్నర అణాలు. పెరిగిపోయిన ప్రయాణికుల సౌకర్యాలు ఏమీ కెరక్క



సంస్కృతీ సమ్మేళనం (గూడూరు) పంచమ వార్షికోత్సవ సందర్భంలో నాటక పోటీ జరిగింది. ప్రథమ బహుమతిపొందిన నాటకం అభ్యుదయ కళాసమితి (మంగళగిరి) వారి 'లంకె బిందెలు' గర్తరునికి బహుమతినిస్తున్న శ్రీ ఈడ్పుగంటి సురేంద్రనాథ్ బెనర్జీ.

# ★ రాజధాని కబుర్లు ★

పోగా, టికెట్ ధర నూటికి డెభ్భైఐదుపాళ్ళు పెరిగింది.

అప్పట్లో నగరంలో ఆర్. టి. డి. బస్సులే కాక "ప్రైవేటు బస్సులు" కూడా నడుస్తూండేవి. ఆర్. టి. డి. చేతులు మారి, హైదరాబాదు ప్రభుత్వం అధీనంలోకి వచ్చింది. ఈ సంస్థను ప్రజోపయోగ సంస్థగా కాక, వాణిజ్య సంస్థగా నడపాలనే అభిప్రాయం నాయకులకు కలిగింది. ఆర్. టి. డి. నిరంకుశ పాలన కూడా అప్పుడే ప్రారంభమైంది. ప్రజల ఇక్కట్లు అప్పుడే ప్రారంభం అయ్యాయి. (1) బస్సు రేటు మైలుకి 10.7 నయా పైసలు. మరెక్కడా ఈ రేటు లేదు. (2) ఆర్. టి. డి. తప్పిస్తే వేరే బస్సులు లేవు. అందువల్ల విధిగా వాడితే ఆర్. టి. డి. బస్సులోనే పోవాలి. (3) బస్సులు తగినన్ని లేవు; ఉన్నా, రావు; వచ్చినా, బస్సులో స్థానాలు ఉండవు.

బస్సు రేటు తగ్గించామంటూ రవాణా సంస్థ అధికారికంగా ప్రకటించింది. ఇది సత్యం కాదని, కొన్ని రూట్లలో రేటు హెచ్చు చేయబడ్డాయని రుజువు చేయడానికి అంకెలు నావద్ద ఉన్నాయి. వచ్చేవారాల్లో మనవి చేసుకుంటాను.

మిగిలిన చోట్ల బస్సులు తక్కువ రేట్లతో నడవ గల్గినప్పుడు ఇక్కడ హెచ్చుగా రేట్లు ఎందుకు అసలు జరగాలి? లాభం కోసమా? నష్టమే వచ్చిందన్నారు ముఖ్యమంత్రి శాసనసభలో రెండేళ్ల క్రితం. ఎందువల్ల? ఉద్యోగులకు జీతాలు ఎక్కువ ఇస్తున్నారట! కావచ్చు. కాని—రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు ఆర్. టి. డి. లో ఇరవై నలుగురు గెజెటెడ్ ఆఫీసర్లున్నారు. బస్సుల్లో సగం పోయాయి, మైసూర్ రాష్ట్రానికి పోయాయి. ఆస్తిలో సగం మాత్రమే మిగిలింది మనకి. కాని—24 గురులో ఇద్దరు ఆఫీసర్లు మాత్రం బయటకు పోయారు. ఇరవై ఇద్దరు గెజెటెడ్ ఆఫీసర్లకి జీతాలిస్తోంది ఆర్. టి. సి. రవాణా రేటు తగ్గించమంటే, ఎలా తగ్గిస్తుంది ఆర్. టి. సి.!

## సున్నాలు - ఎనిమిదులు

పునర్నిర్మించిన కుంభకర్ణుడు ఒకకన్నులో సగం తెరిచాడని, 'బడేబావుడీ—కాచిగూడా చౌరస్తా' బాటపై గోతులు త్రవ్వి ఉంచాడని రెండువారాల క్రితం వ్రాశాను. పరిస్థితి యథాతథంగానే వుంది. మరి ఆ దార్లో నడిచే '7-బి', '7-సి' బస్సులు ఎలా నడుస్తున్నాయి? వినండి.

మొదటి రెండురోజులు - వచ్చే పోయే బస్సులన్నీ తిలక్ మెమోరియల్ హాల్ ప్రక్కనుండి తిరిగాయి. మరికొన్ని రోజులు వచ్చే బస్సులా దారినే వచ్చాయి కాని పోయేవి కాచిగూడా స్టేషన్, చాదర్ ఘాట్ వంతెన, ఈసామియా బజార్ల మీదుగా పోయాయి. రెండుమూడు మైళ్ళు ఎక్కువ. తరువాత కొన్ని రోజులు-వచ్చేవి పోయేవి అన్నీ ఈ దూరందారినే నడిచాయి. తరువాత మరికొన్ని రోజులు-అన్ని బస్సులూ కుత్బీగూడా మీదుగా నడిచాయి. ఇప్పుడు, ఇది రాసేటప్పుడు—అఫ్జల్ గంజ్ నుంచి వచ్చే బస్సులు కుత్బీగూడామీదుగా నడుస్తున్నాయి; వెళ్ళేవి తిలక్ మెమోరియల్ హాల్ మీదుగా పోతున్నాయి.

ఈ చివరి ఏర్పాటు చేయాలని ఏ అధికారికి తటిందో తెలియదు. దీనివల్ల బస్సులన్నీ సుల్తాన్ బజార్ చుట్టూ ప్రదక్షిణాలు చేయవలసి వస్తోంది. ఒక్కొక్క ప్రయాణానికి రెండుఫర్లాంగులదూరం వ్యర్థంగా పెట్రోలు ఖర్చు చేయవలసి వస్తోంది. వచ్చే బస్సులను ఇటూ, వెళ్ళేబస్సులను అటూ తరలిస్తే యీ ప్రయాణం అనవసరం.

కొన్ని వేలు ఖరీదు చేసే అధికారుల అసమర్థతకు ప్రయాణీకులు ఎందుకు డబ్బిచ్చుకోవాలో అర్థంకాదు.

## 'ముందు చూపు రహదార్లు'

### ప్రమాదాలు నివారించడానికి

ముందుచూపు రహదార్లు—'వన్ వే ట్రాఫిక్ రోడ్సు' నియమించింది పోలీసుశాఖ నగరంలో. రిక్షావాళ్లు కూడా ఇంగ్లీషు నేర్చుకున్న తర్వాత వాళ్లుకూడా నియమాలు పాటిస్తారనడంలో సందేహంలేదు. అనాలోచితంగా జరిగిన కొన్ని ఏర్పాట్లవల్ల ప్రజలకు కలిగే ఇబ్బందులు ఇక్కడ పేర్కొంటాను.

గత నవంబరు 19-వ తేదీని ప్రభుత్వోద్యోగి ఒకరు సైకిలుపై మోజంజాహీ మార్కెట్ నుంచి జాంబాగ్ రోడ్డు ప్రవేశించడం జరిగింది. అందులో తప్పులేదు. అక్కడవున్న భారతలక్ష్మీబ్యాంకులో పని చూసుకొని ఆయన వెనక్కి తిరిగాడు. తత్ఫలితంగా- ఆయన, సైకిలు పోలీస్ స్టేషన్ చేరుకున్నారు. మర్నాడు నగర మేజస్ట్రేటు ఆయనకి జుల్మానా విధించారు.

## న్యూఢిల్లీ లేఖ

ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి శ్రీ శ్రీకృష్ణ యూరోపియన్ దేశాల పర్యటనకై బయలుదేరి వెళ్ళారు. ఆయన తిరిగి వచ్చిన తరువాత "న్యూఢిల్లీ లేఖ" యథాప్రకారం ప్రచురింపబడుతుంది.

నగరంలో కొన్ని బాటలకు ప్రవేశించే ముందు- 'కూడదు' అని తెలిపే బోర్డులు ఉంటాయి. కాని ఆ బాటకే అటు 'ఇది ముందుచూపు రహదారి' అని తెలిపే బోర్డు ఉండదు. మరి క్రొత్తవారికి ఈ విషయం ఏ విధంగా తెలియడం? ఇదే విషయం ఆనాటి నిందితుడు నగర మేజస్ట్రేటు దృష్టికి తెచ్చారు. ఆయన ప్రభుత్వ పక్ష న్యాయవాదికి ఈ విషయం తెల్పడం జరిగింది. ఇంతవరకు అటువంటి బోర్డులు నగరంలో రాలేదు.

ఈ ఏర్పాట్లు ఎన్నడూ ప్రజలకు అనవసరమైన ఇబ్బంది కలిగించేటట్లు ఉండకూడదు. మోజంజాహీ మార్కెట్టు వెనుకనున్న 'ముందుచూపు రహదారి' దిశను మార్చడంవల్ల సైకిళ్ళకు రిక్షాలకు ఎంతో ప్రయాస తగ్గుతుంది. ఇదేవిధంగా బొగ్గులకుంటనుంచి ట్రూప్ బజార్ కి వచ్చేదారి. ఇటువంటివి అన్నీ నగరరక్షకభట శాఖ పునః పరిశీలన చేయాలి. రిక్షావాళ్ళంతా ఇంగ్లీషు నేర్చుకొనేవరకు తెలుగులోను, ఉర్దూలోనూ బోర్డులు వ్రాయిస్తే బాగుంటుంది.

## పరీక్షలు - [illegible]

పరీక్షల్లో ఫెయిలయిన అభ్యర్థులు పరీక్షకుల తల(ల)పై అక్షింతలు వేయడం మామూలే. కృతార్థులైన వారు ప్రయోజకత్వం అంతా తమదేనని గర్వపడ్డం సహజమే. విశ్వవిద్యాలయం నియమించిన పరీక్షకులు తమ ధర్మం తాము నిర్వహించినంతకాలం, నిందలవల్ల, పొగడ్తలవల్ల ఫలితం ఉండదు.

మన పరీక్షావిధానం చాలా లోపభూయిష్ఠమైందని విద్యావేత్తలు అంటూంటారు. మార్క్ ట్వెయిన్ కథలో కమ్మరి పనిచేసేవాడు చేతిగడియారం బాగుచేసినట్లు, కత్తి, అంపం, పట్టుకొని బాగుచేస్తామంటూ వస్తారు దేశంలో 'పాప్యులర్' విద్యామంత్రులు. సక్రమంగా నడిచినప్పుడే, విధానం లోపభూయిష్ఠమైనప్పుడు, నియమాలను అతిక్రమించి, అభ్యర్థులు, పరీక్షకులు ప్రవర్తిస్తే, పరిస్థితి ఎంత ప్రమాదకరంగా ఉండో

ఊహించుకోండి.

నేకాలంలో వదంతులు విపరీతంగా వ్యాపిస్తున్నాయి. పరీక్షలైన కొద్దిరోజులకే చిరునామాలు సేకరించి పరీక్షకుల వెంటబడతారు అభ్యర్థులు, అభ్యర్థుల తల్లిదండ్రులు. ఈవిషయం మనకి తెలుసు. అన్ని విశ్వవిద్యాలయాలలోనూ పరిస్థితులు ఈవిధంగా వేడున్నాయి. ఉస్మానియాలో పరిస్థితి మరీ విషమించిపోయినట్లు భావించడానికి కారణాలున్నాయి.

కొన్ని సంవత్సరాలుగా తెలుగు మాటలు రెండు ఉచ్చరించడానికి చేతకాని కొందరు విద్యార్థులు—ముఖ్యంగా విద్యార్థినులు—తెలుగులో ఎం. ఏ. ఫస్టు, సెకండు క్లాసులలో కృతార్థత సంపాదించుకోవడం జరుగుతూ వచ్చింది. ఈ విషయంలో గత సంవత్సరం కొన్ని విచారణలు జరిగాయి. కొన్ని చర్యలు తీసుకోబడ్డాయి. ఈ సంవత్సరం ఫలితాలు చూస్తే, విచారణలు వ్యర్థమయ్యాయేమో ననిపిస్తూంది. తెలుగు ఎం. ఏ. లో ఈ సంవత్సరం ఆరు ఫస్టు క్లాసులు. మూడు సెకండు క్లాసులు, పన్నెండో పదమూడో థర్డు క్లాసులు వచ్చాయి. ఈ ఫలితాలు విపరీతంగా ఉన్నాయని విశ్వవిద్యాలయానికి సంబంధించిన కొందరు పెద్దలే అంగీకరిస్తున్నారు.

ఈ పన్నెండుగురు పదముగ్గురిలో పలుగురు అభ్యర్థులకు నూటికి 49 మార్కులు వరకు వచ్చాయని తెలుస్తూంది. ఉస్మానియాలోనే ఇంగ్లీషు ఎం. ఏ. పరీక్షకు మోడరేషన్ ఏర్పాటు ఉంది. ఒకే విశ్వవిద్యాలయంలోనే ఒక పరీక్షకు ఒక ఏర్పాటు మరొక పరీక్షకు మరొక ఏర్పాటు ఉండడంలో ఔచిత్యం కనపడదు. శ్రీ డి. సదాశివరెడ్డి ఈ సంవత్సరం పరీక్షా ఫలితాలనుగురించి విచారణ జరిపించాలి. అంతే కాదు. విచారణ ఫలితాలను ప్రకటించాలి.

ఉపాధ్యక్షుడు శ్రీ సదాశివరెడ్డి, తాత్కాలికంగా రిజిస్ట్రారు పదవి నిర్వహిస్తూన్న డా. ఎస్. పీ.—వీరిరువురి సమర్థతకీ సౌశీల్యానికీ ఇదివరలో ఈ కలంతోనే నివాళులు అర్పించాను. వారిరువురూ పూనుకొని ప్రక్షాళనం చేస్తేగాని ఉస్మానియా విద్యార్థులకు భవిష్యత్తు లేదు.

ఆ పరిశీలన వీరు చేసేటప్పుడు—(1) ఒకానొక ఎం. ఏ. భాషా పరీక్షలో (తెలుగు కాదు) పరీక్షకులిద్దరికీ ఏభై మార్కులు తేడా వచ్చిందన్న వదంతి పరిశీలించాలి. సత్యమైతే, పరీక్షకుల అర్హతలను పునః పరిశీలించాలి. (2) మరొక ఎం. ఏ. భాషా పరీక్షలో (తెలుగు కాదు) అన్ని పరీక్షల అన్ని జవాబులు చూడక పరీక్షకుని వద్దకు వెళ్ళవలసి వచ్చిందన్న వదంతిని పరిశీలించాలి. సత్యమైతే, పరీక్షకుల అర్హతలను పునః పరిశీలించాలి. (3) వేరొక ఎం. ఏ. భాషా పరీక్షలో (తెలుగు కాదు) ఒక అభ్యర్థికి ఇరవై నాలుగు, ఐదు మార్కులు కలిపి థర్డు క్లాసు నుంచి ఫస్టు క్లాసుకు పంపించింది మోడరేషన్ బోర్డు అన్న వదంతిని పరిశీలించాలి. ఇది జరిగి రెండు సంవత్సరాల పూర్వం—శ్రీ డి. ఎస్. రెడ్డి రాక పూర్వం—జరిగింది. (4) రెండు మూడు సంవత్సరాల క్రితం ఏకనమిక్సు ఎం. ఏ. పరీక్షలో ఐదు పుటలు వరుసగా 'శ్రీరామ' నామస్మరణం చేసిన విద్యార్థికి పరీక్షకుడు నూటకి యాభై రెండు మార్కులు ఇచ్చాడన్న వదంతిని పరిశీలించాలి. ఈ విషయం అప్పటి అధికారుల దృష్టికి తెచ్చిన 'స్క్రూటినైజరు' మందలింపబడ్డాడన్న వదంతికూడా పరిశీలించాలి.

ఇవన్నీ వదంతులు. ఇవికాక ఇంకా వదంతులున్నాయి. కాని నిప్పులేకుండా పొగ రాదుగదా ?

## కీ. శే. దైతా గోపాలం

పేరుగన్న రంగస్థల నటుడు శ్రీ దైతా గోపాలం మృతికి సంతాపం తెలుపుతూ, రాజధానిలో కళాకారుల సమావేశం ఒకటి తీర్మానించింది. 'సురభి' భవనంలో జరిగిన ఈ సమావేశానికి 'పద్మశ్రీ' స్థానం అధ్యక్షత వహించారు.

శ్రీయుతులు మల్లాది వెంకటకృష్ణశర్మ, ఎమ్. ఎస్. రామాచారి ప్రసంగిస్తూ కీర్తిశేషునికి నివాళు లర్పించారు. తెలుగు నాటకరంగాన్నిగురించి గోపాలం గారికి తెలియని విషయాలు ఉండేవి కావని, 'ఆంధ్రపత్రిక'లో తాము రచించిన వ్యాస పరంపరకు అవసరమైన వివరాలను శ్రీ గోపాలం ఇచ్చారని శ్రీ మల్లాది వెల్లడించారు. శ్రీ దైతా 'సిద్ధపురుషుడు' అన్నారు పద్మశ్రీ. వ్యక్తిగా, నటుడిగా, రచయితగా శ్రీ దైతా గుణవిశేషాలను ప్రశంసిస్తూ పద్మశ్రీ ప్రసంగించారు.

ఈ సందర్భంలోనే వెల్లడించారు శ్రీ స్థానం – కాంచనమాల, నాగేశ్వరరావు, రఘురామయ్యవంటి నటీనటులకు ప్రథమంగా శిక్షణ నిచ్చింది గోపాలం గారే నని :

## కుంభకర్ణుడి పునర్జన్మ-(6)

గతవారం మనం నల్లకుంట పాతవంతెనవద్ద నిలబడి కబుర్లు చెప్పుకున్నాం. ఇక్కడ రాకపోకలెక్కువ. ప్రమాదాలు కలుగవచ్చు. పైగా-ప్రక్కనున్న మురికినీటి చెరువు వద్దనుంచి దుర్గంధాలు వ్యాపిస్తున్నాయి. ఇక్కడ నిలువలేం. తిరుగా, తిన్నగా ముందుకు పోదామా ?

ఒద్దు! చాలా పురాతనమైంది ఆ 'బాట'. అది అశోకుడు బాటలు వేయించినప్పుడు వేయించాడని హిందువులు వాదిస్తూంటారు. 'ఆ బాట అంతపాతది కాదు; ఔరంగజేబు కాలంలో పడింది అది' అని మహమ్మదీయులు వాదిస్తూంటారు. ఈ వాదనలు అంతఃకలహాలకు దారితీసేవే! కాని – బాట పరిస్థితినిబట్టి కుంభకర్ణుడి అసలుజన్మలో అది వేయబడిందని పురాతత్వ శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అక్కడ ఒక్కొక్క రాయి ఒక్కొక్క చరిత్ర చెబుతుంది. బాటనిండా అటువంటి రాళ్ళే!

పక్కనున్న బ్లాక్సులో ఉన్న బాధకాలు కొందరో వివరిస్తున్నారు. రాళ్ళ తరువాత కార్ల కేర్లని వడిగినా చరిత్ర తెలుస్తుంది మీకు.

ఎత్తుపల్లాలు, కుప్పలు కుప్పలుగా రాళ్ళు, ఇసుకతిన్నెలు, ఒకపూట వర్షం కురిస్తే మట్టి, బురద. వద్దు! అటు పోవద్దు! పోకుండా—అభినవ కుంభకర్ణుడిని నిద్ర లేపడానికి ఇది ఆరోవారం ప్రయత్నం అని, అతని ప్రచారశాఖ గాఢంగా ఇంకా నిద్రపోతూందని, అందువల్ల ఇంతవరకు పత్రికా ప్రకటనకు కూడా పూనుకోలేదని చెప్పుకుంటూ ఈ బస్సు స్టాండువద్ద నిలబడదాం కొంతకాలం. 

## రద్దీ

రామూ రోడ్డు దాటాలని చాలా సేపట్నించీ కాసుకు కూర్చున్నాడు. ఎంతసేపు చూసినా అటు పోయే కార్లు, ఇటు పోయే కార్లూ, మహా రద్దీగా వుంది. ఇంతలో అవతలవేపున వాడి స్నేహితుడు సుబ్బారావు కనిపించాడు.

"ఏరోయ్ సుబ్బారావ్! అటెల్లా వెళ్లావ్?" అని కేకేశాడు రామూ.

"నేనిక్కడే పుట్టాను" అన్నాడు సుబ్బారావు.

కాలు దృష్టి స్టేషనులోపల్నుంచి సామాను లారీలోకి చేరవేస్తున్న ఒక ఆసామి మీద పడింది. 'తెలిసిన పాత మొగం లాగావుంది- ఎవరీమనిషి' అని బుర్రగోక్కుంటూ బీడీదమ్ము గట్టిగా లాగాడు. అయినా వాకబు చేసి చూద్దామని దగ్గరకుపోయి కిందా మీదా పరకాయించి చూశాడు. తెల్లటి గ్లాస్కో పంచె. పెద్దాపురం సిల్కు లాల్చీ, చేతివేళ్ళకు ధగధగ మెరుస్తున్న రాళ్ళవుంగరాలు, మెళ్ళో బంగారపు గొలుసు, కళ్ళకు అద్దాలు, చేతిలో తోలుసంచి, కాళ్ళకు బాటాజోడు- పెద్ద సెట్టిమంతుడులాగా వున్నాడు, కూలీలమీద కేకలేస్తూ, తనపక్కన నిల్చుని తనవంకే ఏకదీక్షగా చూస్తూన్న పానకాలును-"ఏయ్- ఎవరునీవు?" అని గద్దించాడు. వింతగా చూస్తూన్న పానకాలు వెంటనే సమాధానం ఇయ్యలేదు. జీబురుగడ్డం, మోకాళ్ళపైకి పంచె, మాసికలతో మాసిపోయిన పొట్టిచేతులచొక్కా-ఈ ఆకారమంతా చూడబోతే విడివడ్డ దొంగలాగ వున్నాడని ఆ పెద్దమనిషి-కొద్దిగా జంకుతూనే-"నిన్నేరా ఎవరంటే మాటాడవే? ఏమిటా వెర్రిచూపు? అసలు నీ కిక్కడేంపని?" - బొంగురుగా, కంగారుగా అన్నాడు.

పానకాలు ఫకాలున నవ్వి, "అరే-నీవయ్యా గవరయ్యా? నేనింకెవరో అనుకున్నా-ఏంటి వేషం? అరె నీయిల్లు బంగారంగానూ-ఎంత మారిపోయావు?" అన్నాడు.

పానకాలు అన్నట్లు యీ గవరయ్య ఇల్లు బంగారమైతే ప్రమాదం. ఎందుకంటే రెండుమూడు లక్షలకే యీ గవరయ్యకు పట్టటానికి పగ్గాలు లేవు ఇక ఇల్లు బంగారమైతేనా- చెప్పక్కరలా!

గవరయ్య వ్యాపారపుబుర్రలోకి పాత జ్ఞాపకాలు ఒకదానితర్వాత ఒకటి జమలో పడ్డాయి. ఎవరీమనిషి అన్నది తేలీ తేలనట్లుగా వుంది.

"నన్ను గుర్తుపట్టలేదా గవరయ్యా?" అంటూ పానకాలు నవ్వాడు. ఆనవ్వు- ఆప్యాయతతో, అమాయకత్వంతో నిండి- నిర్మలంగావుంది ఈసారి గవరయ్య గుర్తు వచ్చిందన్నట్లుగా నవ్వాడు. 'ఓహో, నీవా?' అన్న పలుకరింపుతో, 'అయితే నీ గొడవేంటి?' అన్న నిర్లక్ష్యభావంతో కొత్త వాసనకు అలవాటు; మిగిలినదంతా డాబూ కలిపిన - కల్తీ నెయ్యిలాగా వుంది ఈ నవ్వు!

"నీవా పానకాలు! ఏంటి సంగతులు - నేరుగా అక్కడ్నుంచేనా రాటం?" - లారీకి ఎక్కుతున్న సరుకువంక చూస్తూ, 'నీవెంతలే' అన్న భావంతో కలసిన దర్జాతో అడిగాడు.

ఈ పలకరింపులో తొంగిచూచే వెక్కిరింపుకు పానకాలు మనస్సు చివుక్కుమంది. ఈ చివుక్కుమనటం మరి చురచుర లాడకుండా వుంటానికి -"మన పాలెం ఎంత మారిపోయింది! మనుషులు కూడా మారారు-" అన్నాడు. ఈ మాట గవరయ్యకు బాగా తగులుతుందనుకున్నాడు, అమాయకుడు పానకాలు.

ఈ మాట విని గవరయ్య పానకాలు మొగం వంక చూసి, "ఇప్పుడిది పాలెం కాదు - రామానగర్! మారిందంటే మాత్రం- మారకుండా ఎప్పుడూ ఒకే మాదిరిగా వుంటుందా?" అని లారీలో ఎక్కి కూర్చున్నాడు. లారీ బర్ మంటూ స్టార్టయింది. "వస్తా. ఇకనైనా కుదురుగా వుండు-" అని అన్న గవరయ్య మాటలు లారీ లేపిన దుమ్ముతో కలిశాయి. లారీలేపిన దుమ్ము పానకాల మొగాన కొట్టింది. ఆ మాటలు పానకాలు గుండెలను తట్టాయి. మొగాన కొట్టిన దుమ్మును పైగుడ్డతో తుడుచుకున్నాడు. కాని, గుండెలమీద తగిలిన మాటలను దేనితో తుడుచుకుంటాడు?

పూర్వం ఈ గవరయ్య చెంగావిరంగు పంచెకట్టి, నీరుకావి బనీను తొడిగి, అరచేతి వెడల్పున పంగనామాలు పెట్టి, కిర్రు చెప్పులను కిర్రుకిర్రు మనిపిస్తూ, "ఎవరి కష్టాలిద్దాం? ఎవరికొంప కూలుద్దాం" అంటూ వూరంతా తిరిగేవాడు. ఎందరి నెత్తిన చేతులు పెట్టాడో! ఎంతమంది కొంపలు నిలువునా కూల్చాడో!- ఈనాడింత ఇదిగా వున్నాడు. ఈగవరయ్యకొక ముసలి అక్క వుండేది. దానికి విషంపెట్టి చంపి దాని ఆస్తిఅంతా వేసుకున్నాడు. "ఛీ! నీబతుకెవ్వరికి తెలియదుగనా?" అంటూ కాండ్రించి వుమ్మేశాడు పానకాలు.

బీడీ ముట్టిద్దామని బీడీ కోసం జేబులో చేయి పెట్టాడు. బీడీలు అయిపోయాయి. ఏదైనా కొట్టువుంటుందేమోనని అటు ఇటు చూశాడు. స్టేషను కటకటాలదగ్గర ఒక బడ్డీకొట్టు కనిపించింది. ఒకకట్ట యస్సుబీడీలుకొని, ఒక బీడీముట్టించాడు. పొగ తాపీగావదులుతూ వూరువంక చూశాడు. ఇదివరకు స్టేషనునుంచి కోశెడుదూరంలో వుండే వూరు—ఇప్పుడు లెక్కకుమించిన ఇళ్ళతో కిక్కిరిసి- రెండు అంగలదూరంలో వున్నట్లుగావుంది.

కాసేపు ఆగినతర్వాత పానకాలు కొట్టువానివంక చూచి, "ఏంటి పాలెం విశేషాలు?"—ఇంకా పాతపాలెమే అన్న ధోరణిలో-అడిగాడు, ఆ కొట్టువాడు ఒకటి రెండు క్షణాలు రెప్పార్పకుండా పానకాలు వంక చూచి, అఖరికి గుర్తువచ్చినట్లు మొగం పెట్టి-"నీవా పానకాలు మావా?" అన్నాడు "నీవట్రా సుబ్బడూ-" అంటూ పానకాలు ఎగిరిగంతేశాడు. ఎన్నాళ్ళైపోయిందో చూచుకుని-ఇద్దరూ అంతులేని ఆనందంతో వుక్కిరిబిక్కిరైపోయారు

"ఇదేంటిరా సుబ్బడూ-ఈ కొట్టు పెట్టావు? నీకల్లుపాకం ఏంచేశావు?" అని పానకాలు అడిగాడు.



# ★ గొప్పోళ్ళ బతుకులు ★

సుబ్బడు విచారంగా, "ఇంకేం కల్లు యాపారం మాఁవా! సొతంత్రం వచ్చిందం టగా-అప్పట్నించి కల్లు నిషిద్ధంఅయింది. బతుకు తెరువుకు ఏదోఒకటి చేయాలిగా-ఈ కొట్టుపెట్టి ఇట్టనే ఈడ్చుకొస్తున్నా... ఏంటోమాఁవా రోజులిట్టా వచ్చాయి," అన్నాడు.

ఇంతలో ఒకరిక్షావాడువచ్చి, "ఒక జోన్సుపొయ్యి" అంటూ అర్ధరూపాయి బిళ్ళను నిర్లక్ష్యంగా విసిరేశాడు. సుబ్బడు సిగరెట్టుపెట్టెల వెనకనుండి ఒక పెద్దసీసా తీసి, గాజుగ్లాసులో కొద్దిగా వేసి, సోడా కొట్టి దాంట్లోపోశాడు. ఆ రిక్షావాడు గడ గడా తాగి మూతితుడుచుకున్నాడు. ఒక కట్ట బీడీలు తీసుకొని, ఒక బీడీవెలిగించి ఏవో లల్లాయి పదాలు పాడుకుంటూపోయాడు. పానకాలుకు ఇదంతా ఆశ్చర్యంగావుంది. "అదు తాగిందేంటిరా?" అని సుబ్బడ్ని అడిగాడు.

గాజుగ్లాసు కడుగుతూ, "అదా మాఁవా-జింజర్ బీర్ అని - అదోక మందులాంటిది. కల్లుపాకలు, సారాయిదుకాణాలు లేవుగా? అందుకని చాలమంది దీన్ని పుచ్చుకుంటుం టారు. విడున్నాడు చూశావు-వాడు రోజుకు మూడుసార్లేసుకుంటాడు. ఇది తాగందే బండితొక్కలేడు - సీసామీద మనకొక రెండు మూడు రూపాయలు మిగులు తాయిలే!" అన్నాడు.

"ఏడిసినట్టేవుంది. అఁ - అన్నట్టు - నీవు పెళ్ళి పెడాకులు చేసుకోలేదా?" - పానకాలు బీడీపారేస్తూ అడిగాడు.

ఈ ప్రశ్నకు సుబ్బడు గతుక్కుమన్నాడు. ఎందుకంటే సుబ్బడికి పెళ్లి అవ్వటం అయింది. పెళ్ళాం లేచిపోటంకూడ అయింది. వాడోక రంభిలాంటిదాన్ని చేసుకున్నాడు. అంత అందగత్తె వీడిదగ్గర నిలుస్తుందా? దానికి సినిమాలపిచ్చి జాస్తి. పాలెంలో కొత్తగా సినిమాహాలు కట్టారు. ప్రతిరోజూ సినిమాకెళుతుండేది. ఒక సినిమా ఏజంటు దీన్ని లేవదీసుకుని మదరాసు తీసికెళ్ళి సినిమాల్లో జేరిపించాడు. ఇప్పుడది చిన్న చిన్న వేషాలు వేస్తూ మదరాసులోనే వుంది. అందుకనే సుబ్బడు సమాధానంచెప్ప లేదు. 'అట్టా వూళ్ళోకి వెళ్ళొస్తారా' అంటూ పానకాలు లేచాడు. సోడా తాగమని సుబ్బడు సోడా కొట్టిచ్చాడు.

పానకాలు "ఏం సోడాలురా?" అంటూ ఒక గుక్కెడుతాగి, "ఛీ! ఏందిరా మందు వాసనేస్తుంది?" అని తుపుక్కున వుమ్మేశాడు.

"తాగినా మన దొరగారి కోనేరు నీళ్ళు తాగాలి-కొబ్బరి పానకాలుకదరా! ఆజైల్లో ఆవుప్పుకశాలు తాగితాగి నానాలుక బండ బారిపోయిందిరా-అఁ-అన్నట్టు సుబ్బడు-కోనేరు బాగుందిరా?"

'ఇంకేం కోనేరు మాఁవా? దాన్ని పూడ్చేసి పిల్లల కాలేజిబడి కట్టారుగా-"

పానకాలు ముక్కున వేలేసుకుని విస్తుపోయాడు.

"నాకు తెలియకడుగుతా పానకాలు మాఁవా-నీవు నేరుగా జైల్నుంచెనారాటం? నీకెంత అన్యాయం జరిగింది మాఁవా-ఆ చిన్నదొర పున్నెం కట్టుకున్నాడు. ఆడు మట్టుకేం బాగుపడ్డాడులే? నీకు తెలియదు గాని-ఆడిపని అయిపోయిందిలే!-మంగమ్మ ఎంత మంచిది?..."

సుబ్బడిమాట పూర్తికాకుండానే "వత్తారా" అంటూ పానకాలు చరచర నడుచుకుంటూ వూళ్ళోకి బయలుదేరాడు. నడుస్తున్న పానకాలు బుర్రలో ఆలోచనలు పరుగులెత్తుతున్నాయి.

నడిచీ నడిచి పానకాలు కాళ్లు పట్టుకుపోయాయి. ఎంత తిరిగినా తిరగవల్సింది తరగలేదు. ఊరంతా నడమంతరంగా పెరిగిపోయింది. అసలు ఆనాటిపోలికలే ఎక్కడా లేవు. తెలిసినవాళ్ళు అక్కడొకడు, ఇక్కడొకడు కనిపించారు. అప్యాయత లోపించిన కపటపు చిరునవ్వులతో పలుకరించి-"వస్తాం. పనివుం"దంటూ జారుకున్నారు. వీళ్లంతా ఒకప్పుడు చెడిబతికినవాళ్ళే! నడమంతరపు సిరి వచ్చిపడేసరికి గర్వంతో విర్రవీగిపోతున్నారు. వాళ్లు మాట్లాడే తీరును చూచి-వీళ్ళంతా తన్ను దూరంగా విసిరేసినట్లు, మాలో వుంటానికి పనికిరావని కసిరికొట్టినట్లు - బాధపడ్డాడు పానకాలు.

ఇదివరకు కోనేరు వుండేచోట కెళ్ళాడు. సుబ్బడు చెప్పినట్టు అక్కడసలు కోనేరు నామరూపాలే లేవు. అక్కడొక కాలేజి వుంది. "చక్కటి గంగను పూడ్చుకున్నారు. వీళ్ళకేం రోగం?" అని విస్తుపోయాడు. అక్కడ్నుంచి వేణుగోపాలస్వామి గుడి వైపు వెళ్ళాడు. ఆగుడి స్థితి చూచేసరికి పానకాలు గుండె తరుక్కుపోయింది. దిక్కూ మొక్కూ లేక పాడుపడింది. గుడి చుట్టూ చెట్లూచేమలు పెద్ద అడవిలాగా పెరిగి, గర్భగుడిలోకి దేముడి దర్శనం కోసం ప్రవేశించటానికి ప్రయత్నిస్తున్నాయి. పెద్ద దొరగారి రోజుల్లో దాని వైభవం తల్చుకుని కండ్లు తుడుచుకున్నాడు. "నీవు వీళ్ళెవరికి పనికిరాలేదా తండ్రీ!" అనుకుంటూ చేతులెత్తి నమస్కరించి వెనక్కు తిరిగాడు. షావుకారు గవరయ్య పాత పెంకుటిల్లు వుండవల్సిన చోట మూడంతస్తుల మేడ ఠీవిగా నిల్చుని 'నాకేమిటి'? అన్నట్లు వూరువంక చూస్తోంది. 'అంగుకన్న మాట ఆడికంత అదిరిపాటు' అనుకున్నాడు. బ్రాహ్మల వీధికి కొంత పోలికలు అందాయి. దివాణంలో పురాణం చెప్పే పుజారి పున్నయ్యను చూచిపోదామని ఆ వీధిలోకి వెళ్ళబోయాడు. కాని, ఆ వీధి మొగలోనే మున్సిపాలిటీ వాళ్ళ మాంసం మార్కెట్టు చూచి అడుగు వెనక్కు వేశాడు. 'ఇంకెక్కడి బ్రాహ్మణ వీధి? ఇంకెక్కడి పూజారి పున్నయ్య?-' అనుకుంటూ పక్కకు తిరిగాడు. పక్కకు తిరిగిన పానకాలు డొక్కల్లో బల్లెంపెట్టి పొడిచినట్లు, కడుపులో చేతులుపెట్టి దేవినట్లు బాధపడ్డాడు. ఇంతకూ పానకాలును అంత బాధపెట్టిందేమిటి? దూరంగా కనిపిస్తున్న ఒక పాత మేడ, ఆ పాత మేడ పాత గోడల వెనుక జరిగిన ఒక పాతకథ యొక్క పాత జ్ఞాపకాలు! ఆ పాత మేడను చూడగానే పానకాలు రక్తాన్ని కవ్వంలో చిలికి కలవరపెట్టినట్లయింది; అప్రయత్నంగా పిడికిలి బిగుసుకుపోయింది. గుండెలోని పగ కంటిచూపుల్లో కలికొచ్చింది. కాళ్ళు రెండు మూడు అడుగులు ముందుకేశాయి. కాని, మనస్సు వెనక్కు లాగింది. ఇంతలో తన పేరుపెట్టి పిలుస్తున్న గొంతువినబడి వెనక్కు తిరిగాడు. రోడ్డు కవతల నుర్రిచెట్టుక్రిందవున్న ఒక పాక ముందు నిల్చుని ఎవరో తన్ను చేయివూపి పిలుస్తున్నారు. "అఁ—గుర్తుకొచ్చింది... వీడు మారలేదన్నమాట! మారలేదు కాబట్టే అంత మమకారంగా పిలుస్తున్నాడు. ఆ రోజుల్లో పగలస్తమానం విడికోలిమిలో

!



యూరప్, అమెరికాలలో వివిధ వస్తువులకు ఉపయోగిస్తున్న అందమైన డిజైన్లను ఇటీవల మద్రాసులో ప్రదర్శించారు. ఈ ప్రదర్శనను భారత ప్రభుత్వం కోరికపై న్యూయార్క్ మ్యూజియం ఆఫ్ మోడరన్ ఆర్ట్ వారు ఏర్పాటు చేశారు. కొన్ని డిజైనులను పై ఫొటోలో చూడవచ్చును.

పులి-మేక ఆట అనే వాళ్ళు"—ఇలా అనుకుంటూ పానకాలు కొలిమి వైపు నడిచాడు.

కమ్మరి వీరాయి ఆమాట ఈమాట మాటాడుతూ పానకాలును కదలనివ్వలేదు. వాడిని వదిలించుకుని వచ్చేసరికి పగటి వెలుగులు జారిపోతున్నాయి. మానవజాతిలోని స్వార్థంలాగా సంజచీకట్లు నలుదిశల వ్యాపిస్తూ ప్రకృతిని చీకటిమయం చేస్తున్నాయి. పానకాలు బీడిదమ్ము గట్టిగా లాగుతూ వడివడిగా నడుస్తున్నాడు. ఊరు వెనక పడింది. పానకాలు దొంగల చెరువుకు వచ్చేసరికి క్షీణచంద్రుడు బద్ధకంగా పైకి లేస్తూ గ్రుడ్డి వెలుగులను విరజిమ్మాడు. విరజిమ్మబడిన గుడ్డివెలుగులు ముదిరి, చెదిరి-ధారలుకట్టి క్రిందకు ప్రవహిస్తున్నాయి. దొంగలచెరువు ఎండలకు ఎండిపోయింది. ఆగుంటలో కొన్ని నీళ్ళు, ఈగుంటలో కొన్ని నీళ్ళు వున్నాయి. ఈగుంటల్లో తెల్లని వెన్నెల నీడలు ప్రతిఫలిస్తూ దొంగలచెరువు పగిలిన అద్దం ముక్కల్లాగా వుంది. పూర్వం దొంగలు చుట్టుపక్కల ఊళ్ళు దోచుకుని వచ్చి, ఈచెరువుకాడ భాగాలు పంచుకునేవాళ్ళట. అందుకనే ఈచెరువుకా పేరువచ్చింది

పానకాలు ఆ చెరువుగట్టునవున్న ఒక జువ్విచెట్టు నీడల్లో నిల్చుని చుట్టూ పరికించి చూశాడు. చెరువుకు దక్షిణాన పెద్ద కోటతోపు, ఉత్తరాన పెద్ద బంగరుబయలు. పెద్ద దొరగారి తాత ముత్తాతల కాలంనుంచి ఈ బంగరుబయల్లో గొఱ్ఱె పోటేళ్ళ పందేలు, కోడిపుంజుల పందేలు జరుగుతుండేవి. ఇక్కడ పందేలు జరుగుతుంటే పాలెం అంతా ఇక్కడే వుండేది. పూర్వపుయోధుల కార్యపరాక్రమ వీరవిజృంభణకు అంతిమ కాలం సంప్రాప్తమైన తొలిదినాలు అవి! పెద్ద దొరగారు పూర్వసంప్రదాయాలకు విలువనిస్తూ అప్పుడప్పుడు ఈపందేలు జరిపించుతుండేవారు. ఇక చిన్న దొర హయాంలో పందెం అన్నమాటే వినిపించేదికాదు. ఎన్ని పోటేళ్ళ నెత్తురు చుక్కలతో, ఎన్ని కోడిపుంజుల పచ్చి రక్తపు చిందులతో తడిసిందో ఆనేల! ఆలాటి తోపులోని చెట్లు ఎన్ని పందేలకు ప్రేక్షకులుగా నిల్చాయో!

పానకాలు పాతజ్ఞాపకాలు తెచ్చిన దిగాలుతనంతో ఆజువ్వచెట్టు మొదట్లో వుసూరుమంటూ కూర్చున్నాడు. ఇక్కడి ప్రకృతిలోని ప్రతిభాగం గతంలో ఇక్కడ జరిగిన ప్రతిసంఘటనకు సాక్షీభూతురాలే! అందాకా ఎందుకు? పానకాలు కూర్చున్న జువ్విచెట్టుకూడా ఒక పాతకథలోని పచ్చి అన్యాయ ఫలితాన్ని కళ్లార తిలకించిన ఒక ప్రేక్షకురాలే! ఆపాతకథ ఎవరిదో కాదు—పానకాలుదే! విడిచుట్టూ అల్లుకున్న కథ—వాడీనాడు ఇట్లా అవటానికి కారణమైనకథ, ఈభావంగానే ఇన్నాళ్లనుంచి గుండెల్లో గూడుకట్టుకున్న విషాదం కట్టలు తెంచుకుంది. పానకాలు బోరున ఏడ్చాడు. ఆ నిశ్శబ్ద నిశీథిలో పానకాలు ఏడుపు విని ఓదార్చేవాళ్లు ఎవరున్నారు? ఆ పాత జువ్విచెట్టు కూడా పాతవిషయాలు జ్ఞాపకం వచ్చి బాధగా, జాలిగాయూలుగుతున్నట్లు ఊగింది.

ఆ పాత కథ...

* * *

పానకాలుభార్య మంగ పుట్టింటిదగ్గర నుంచి పారదోలి వసి కొత్తగా వాని కొచ్చింది. ఇరుగుపొరుగువాళ్లు మంగను చూచి దక్కనిచుక్క అన్నారు. పానకాలు [illegible] "అదృష్టవంతుడు"

# ★ గొప్పోళ్ళ బతుకులు ★

అన్నారు. అవటానికి మంగ పానకాలు మేనత్తకూతురైనా ఈనాటివరకు దాన్ని కన్నెత్తిచూడలేదు. వీడయ్యా బతికున్నప్పుడే పెళ్లి చెల్లింది. అప్పటికి పానకాలుకు బాగా చిన్నతనం. మంగ ఈడేరిన తర్వాత ఇదే చూడటం. "గిత్తగూడలాగా వుంది. ఇంత చూపరి అనుకోలేదే—" అని తనలో తాను మురిసిపోయాడు. ఆరోజే పెళ్లాన్ని పెద్దదొరసాని సుభద్రమ్మగారి దగ్గరకు తీసుకెళ్ళి నమస్కారం చేయించాడు. "మంచి అందగత్తెనే పట్టావురా" అని నవ్వుతూ ఆమె అనేసరికి మొగుడు పెళ్ళాలిద్దరు సిగ్గుతో ఒకరి మొగం ఒకరు చూచుకున్నారు. దొరసానిగారు మంగ అందాన్ని చూచి మురిసిపోయి, జరి అంచు తెల్లని చీర, పూలు పళ్ళు ఇచ్చి - గాజులేయించుకోమని రూపాయి ఇచ్చారు, ఆ రాత్రి దొరసాని యిచ్చిన కొత్తచీర కట్టుకుని, సిగనిండా పూలు పెట్టుకుని మంగ మగడి మంచందగ్గర కొచ్చింది. అప్పటిదాకా గుటకలు మింగుతున్న పానకాలు, "మంగీ—" అంటూ గట్టిగా దగ్గరకు లాక్కున్నాడు. అంతలోనే పాలపొంగుమీద నీళ్ళ చిలకరింపులాగా వీధితలుపు దబదబ మంది. పానకాలు చిరాకుగా తలుపు తీశాడు. "పెద్దదొరకు కిందెట్టు మీదెట్టుగావుంది; తొందరగా రమ్మని" దివాణం నుండి మనిషి వచ్చాడు. "ఇందాక బాగానే వున్నారుగా" అనుకుంటూ వచ్చిన మనిషివెంట బయలుదేరాడు. "తొలిసారే ఈ అడ్డంకి ఏంటికి?" అనుకుంటూ మంగ ముడుచుకుని పడుకుంది.





ఆతర్వాత పెద్దాయన పోవటం, కలకత్తాలో చదువుకుంటున్న చిన్నదొరను పిలిపించటం, దినవారాలు, చుట్టాలు పక్కాలు రాటం— పానకాలుకు రెండు నెల్లవరకు మంగతో మాటామంతి ఆడుకోటానికే వీలు చిక్కలా.

ఈ రెండునెల్లలోనూ దివాణం భోజనం తినటంతో మంగ మరీ నునుపుదేలింది; దాని అందం మరీ విరగపడిపోతోంది. కాపురానికొచ్చి రెండునెలలైనా మొగుడితో మాటమంతీ లేకపోటం, మూడుపూటలా నువారపు అన్నం—మంగకు పిచ్చి పిచ్చిగా వుంది; మనిషి మరీ పగలబడిపోతోంది. ఆ పేటలో ఆడామగా మంగను చూచి కళ్ళుతిప్పుకోలేక పోతున్నారు. పానకాలుకు దివాణం పనే సరిపోతుంది. చిన్నదొర రాజ్యం—అసలే తీరిక వుంటం లేదు.

ఒకరోజు సాయంత్రం చిన్నదొర తుపాకీతీసుకుని — కలకత్తానుండి వచ్చిన కొత్తదివాన్జీ వెంటరాగా—పిట్టలను కొట్టటానికి షికారుకు బయలుదేరారు. అటుతిరిగి, ఇటుతిరిగి చాకిరాలవైపు వచ్చారు. పిట్టలకోసం వెతుకుతున్న చిన్నదొర చూపులు మంగమీద ఆగిపోయాయి. మంగ మిగిలిన చాకితలతో నవ్వుతూ మాట్లాడుతూ, గాలికెగురుతున్న ముంగురులను మాటిమాటికి పైకెగదోసుకుంటూ, ఆరినబట్టలను మడతలు పెడ్తోంది. కొత్తదివాన్జీ 'విలేజిబ్యూటీ' అని నోరెళ్ళబెట్టుకు చూస్తోన్నాడు. చిన్నదొరను చూచి చాకలిపడుచుల్లో గుసగుసలు బయలుదేరాయి. ఆనాటికి పిట్టలవేట చాలించి, చెదిరిన మనస్సుతో—అర్థంలేని ఆలోచనలతో చిన్నదొర దివాణానికి బయలుదేరారు.

దివాణంలో పనుల ఎద్దడి కొద్దిగా తగ్గింది. పానకాలుకు తన మంగతో కాలక్షేపం చేయటానికి కాస్త వీలు చిక్కింది. నాలుగైదు రోజుల్లో మంగనలిగి, వాడిన పూలచెండులాగా మరీ అందంగా తయారైంది. చాకిరేవులో తాను చూచిన మంగ అందం

చిన్నదొర హృదయంలో పన్నీరు చిలికింది. ఆ నేకి ఆలోచనలతోటి సతమతమైపోయాడు. కొత్త దివానీ దొర ఆలోచనలన్నింటిని ఒక కొలిక్కి తీసుకువచ్చి ఆయనచేత "సెబాష్" అనిపించుకున్నాడు. పానకాలును పిలిపించి ఒకరోజు చిన్నదొర "సీతాపురం వెళ్ళి అక్కడి కరణాన్ని అడిగి మనకు రావల్సిన శిస్తుల తాలూకు పైకొన్ని తీసుకురమ్మని" హుకుం జారీచేశారు. మళ్ళీ తిరిగి రావటానికి రెండు మూడు రోజులు పట్టుతుంది. "రెండు మూడు రోజులా?" అని మంగ మొఖం చిట్లించింది. మళ్లీ వుషారుగా "సీతాపురం మా అమ్మగారి వూరేగా! నేనూ వస్తా పద—" అంది. మరి దివాణంలో పనో అంటూ మాటకడ్డం తగిలాడు. చిన్నదొర చూపులను గుర్తుకు తెచ్చుకుంటూ "ఏమో నేను పోవద్దా!" అంది. "నేనూ లేకుండా నీవూ లేకుండా ఎట్లాగే?" విసుగ్గా అన్నాడు పానకాలు. ఇరకాటంలో పడ్డది. అయిష్టంగా నే "సరే తొందరగా రా—" అంది. "పనిఅవగానే ఒక్క నిమిషమున్నా వుంటానా?" అంటూ మంగను ముద్దుపెట్టుకుని బయలుదేరాడు. గుమ్మం దాటుతుంటే ఎడమకన్ను అదిరింది. కొంత తటపటాయించాడు. ఇవన్నీ పెట్టుకుంటే ఎట్లా అని మనస్సు సమాధాన పెట్టుకుని సాగిపోయాడు.

ఆరోజంతా మంగకు ఏ పని మీదా మనస్సు పోలేదు. ఏదో గుబులు గుబులుగా వుంది. 'భావ లేక పోవటంవల్ల' అని మనస్సు సమాధానపరచుకుంది. పొద్దు తిరిగింది. చల్లబడింది. బట్టల మూట తీసుకుని దివాణానికి బయలుదేరబోయి అద్దంలో మొగం చూచుకుంది. జుట్టు రేగిపోయి, మొగమంతా జిడ్డుగావుంది. 'ఇలాగే వెళ్ళితే- అమ్మగారే నన్ను అందగత్తె నన్నారు- ఈ అవతారంతో వెళ్ళితే ఏం బాగుంటది?' కావిడి పెట్టెలోంచి ఆనాడు దొరసానిగారు ఇచ్చిన చీరతీసింది- గంజిపెట్టి పెళపెళలాడుతుంది. నల్లరంగు మీద తెల్లచుక్కల రవిక- పెద్దకొప్పు కూతురిది- తొడిగింది. మంగ ఎంత అన్యమనస్కంగా సింగారించుకున్నా మగవాడి గుండెలకు సూటిగా బాణంలాగా గుచ్చుకుపోయేటంత అందంగా తయారైంది.

మూట బరువుతో వయ్యారంగా ఒకవైపు వంగిపోయి, మెల్లగా అడుగు వేసుకుంటూ- దొరగారి లోగిట్లోని బాదంచెట్లు పంచిన నీడల్లోంచి- వస్తోన్న మంగను డాబామీద నుంచి చూచి చిన్నదొర రసికహృదయం తహతహ లాడింది. మంగ తొందర తొందరగా బట్టలు అప్పచెప్పి, పాతబట్టలు ముడుచుకుంది. ఆడదాసీలు మంగవంక గుచ్చిగుచ్చి చూస్తూన్నారు. వాళ్ళు ఎందుకలా చూస్తున్నారో మంగకు అర్థం కాలా. వాళ్ళు ఏవేవో కొత్తపనులు పురమాయిస్తున్నారు. మంగ చెప్పినవన్నీ చేస్తోంది. దీపాలు తుడిచింది, నూనెపోసి, వెలిగించింది. అమ్మాయిగారి చిన్నకొడుకు ఏడుస్తుంటే కాసేపు తోటలో తిప్పమన్నారు అటుఇటుతిప్పింది. బట్టలప్పగించి ఎంత తొందరగా వడదామనుకుంది? ఎంత ఆలస్యంఐంది? బాదం చెట్ల ఆకుల సందులనుండి తదియచంద్రుడు ఓరకంట చూస్తున్నాడు. సన్నని వెలుగు కిరణమొకటి మంగపాపిట్లో పాకింది. డాబామీద చిన్నదొర కొత్త బ్రాందీసీసా సీలు వూడదీస్తూన్నాడు. చంకలో పిల్లగాడు నిదురపోయాడని అప్పగించింది. ఒక దాసి చిన్న దొరగదిలో లాంతరుపెట్టి, పక్క సర్దమని చెప్పింది. మంగ జంకింది. ఆదాసీది మళ్లీ హెచ్చరించింది. మంగ కంతా కొత్త. ఏపని చేయకపోతే ఎవరికి కోపంవస్తుందో! ఒకచేత్తో లాంతరు, రెండోచేత్తో శాలువ తీసుకుని భయం భయంగా డాబా మెట్లు ఎక్కింది. గుమ్మంలో కెవ్వున కేక వేసింది. చేతిలోని లాంతరు కిందపడి అటుకొట్టుకుని ఇటుకొట్టుకుని ఆరిపోయింది. గుమ్మంలో పుట్టిన చీకటి ధారలుగా, పాయలుగా ప్రవహించి ఆ గదినంతా చీకటిమయంగా చేసింది. ఆ కటిక చీకట్లో కామానికి—శీలానికి, మానరత్నకు—కామభిక్షుకు, మంచికి—చెడుకు, పులికి—మేకకు పెనుగులాట!

సీతాపురంలో కరణం ఇంటికాడనుండి అత్తగారింటికి చీకట్లో నడిచివెళ్తున్న పానకాలు దారికడ్డంగా పడుకున్న పాముమీద కాలేసి, "బాబో" అని అరిచి ముందుకు పారిపోయాడు.

అలసిన ప్రకృతి నిశ్శబ్దంగా నిదురపోతోంది. చిన్నదొర చీకటగదిలో జరిగిన పెనుగులాటలో ఆడది అబలైపోయింది; కొన్ని నిమిషాల్లో పతితగా మారిపోయింది.

స్పృహవచ్చి లేచినమంగ తాను చెడిపోయానని గ్రహించింది. తన శరీరంవంక చూచుకుంది. పరపురుష హస్తస్పర్శచే కళంకమైపోయిన శరీరం! కాముకుడి పశుబలానికి లొంగిపోయిన శరీరం! పరాధీనమైన పాడు శరీరం! వెక్కి వెక్కి ఏడ్చింది. లేవలేక లేచి కోక సర్దుకుంది. మెల్లగా మెట్లుదిగి హాలులోకి వచ్చింది. దివాణమంతా నిదురపోతోంది. బయటికొచ్చింది చీకటిప్రకృతి వింతగావుంది. ఆ వికృతాకృతి జుట్టు విరియబోసుకుని భోరున ఏడుస్తున్న పతితకు ప్రతిరూపుగా వుంది. మంగ చీకట్లో నడిచిపోతోంది. కాళ్ళు సీతాపురం దారివైపు నడిచాయి. ప్రతి అడుగుకు ఆ పతితగుండె ఆక్రోశిస్తోంది. ఏదో చేయాలి! ఎలాగో కసి తీర్చుకోవాలి—ఎలా? ఉద్రేకంతో ఊగిపోతోంది. సంకల్ప వికల్పాలతో మంగ మనస్సు చిందరవందరైంది. దొంగలచెరువు దగ్గరకు రాగానే అడుగులు ఆగిపోయాయి. ముందుకు నడవలేకపోయింది. ఏదో దృఢసంకల్పం ఆ చీకట్లో ఆ పెద్ద జువ్విచెట్టు కింద మంగను నిలేసింది. ఆ సమయంలో మంగ రక్తనాళాల్లో పవిత్ర భారతనారీమణుల కోవకు చెందిన రక్తం ప్రవహిస్తోంది. పవిత్రశీలాన్ని కోల్పోయిన ప్రతి మానిని చేసే పనే చేసింది. జువ్వి కొమ్మకు చీర చెంగుకట్టి వురిపోసుకుంది. భారత స్త్రీ అనిపించుకుంది.

అత్తగారింట్లో పానకాలు మగతనిద్రలో త్రుళ్ళిపడి లేచాడు. ఏదో పాడు పీడకల కన్నాడు. మనస్సు పరిపరి విధాలుగా పోయింది. ఎవరికీ చెప్పకుండా చీకట్లో బయలుదేరాడు. దొంగలచెరువు కాడికొచ్చే సరికి కటిక చీకటి విరుగుతూ మసక మసకగా వుంది. ఎదురుగుండా జువ్విచెట్టుకు వ్రేలాడుతున్న స్త్రీ శవం—తను కన్న పీడకలకు

# స్నేహితుడు

"రామం,

మనం యిద్దరం విడిపోయి ఇరవై సంవత్సరాలయింది కదూ? స్కూల్ ఫైనల్ ప్యాసయిన తర్వాత ఎవళ్ళదారి వాళ్ళ దయిపోయింది. ఆ రోజుల్లో మనం యిద్దరం ఎంత కలిసి మెలసి తిరిగేవాళ్ళం! అప్పుడు చేసిన అల్లరి, అవన్నీ తలచుకొంటే, యిప్పటికీ ఏదో అవ్యక్తానందం కలుగుతుంది. మనం యిప్పుడు ఎంతగానో మారిపోయి ఉంటాం కదూ! కలుసుకొన్నా గుర్తుపట్టుకోలేము కూడా. నేనిప్పుడు మద్రాసులో ఒక కంపెనీకి మేనేజరుగా పనిచేస్తున్నా. నువ్వు రాజమండ్రిలో, కాలేజీ లెక్చరరుగా పనిచేస్తున్నావని, ఓ వారం రోజుల క్రితం ఒకరి ద్వారా ఆ చూకీ దొరికింది. నేనిక్కడ పధ్నాలుగో తారీఖున మెయిలులో బయలుదేరి, ఏదో కంపెనీ వ్యవహారం మీద కలకత్తా వెడుతున్నా. మెయిలు పదిహేనో తేదీ ఉదయం పది గంటల ప్రాంతాన రాజమండ్రి చేరుతుం దనుకొంటా. నువ్వు స్టేషనుకువచ్చి నన్ను కలుసుకో. నేను ఓ గులాబీ పువ్వు కోటు కాలరుకి గుచ్చుకొని, చేత్తో న్యూస్ పేపరు పట్టుకొని కంపార్ట్మెంట్ గుమ్మంలో నిల్చుంటా. నన్ను పువ్వుతో గుర్తించి పలకరించవచ్చు. తప్పకుండా వస్తావు కదూ?

నీ స్నేహితుడు,
నారాయణ."

ఆ ఉత్తరం చదవగానే ఒక్కసారిగా ఏదో ఆనందం నన్నావహించింది. తప్పకుండా నారాయణని కల్సుకోవాలి. అయితే, పదిహేనవ తారీఖు ఉదయం నాలుగ్గంటలకి, ప్రిన్సిపాల్ గారబ్బాయి పెళ్ళికి నిడదవోలులో హాజరవ్వాలి. ఎలాగా అని ఆలోచిస్తోంటే, "అంత ఆలోచన ఎందుకండీ? నిడదవోలులో పెళ్ళవగానే మీరూ మెయిలెక్కి వచ్చేయండి. రాజమండ్రీలో మీ స్నేహితుణ్ణి కలుసుకోవచ్చు," అని సలహాయిచ్చింది శ్రీమతి.

* * *

ముహూర్తమవగానే ప్రిన్సిపాల్ గారివద్ద సెలవు తీసుకొని, నిడదవోలులో మెయిలెక్కా. సెకండ్ క్లాసయినా కంపార్ట్మెంట్ చాలా క్రిక్కిరిసి ఉంది. తోపులాటలో ఒకని మీద తూలిపడ్డాను. వెంటనే నిలదొక్కుకొని "సారీ, క్షమించండి" అన్నాను. కాని నా ఖద్దరుపంచె, వాలకం చూసి కాబోలు కస్సుమంటూ లేచాడు. "బ్రూట్! కళ్ళు కనబడ్డం లేదా? మీదపడి పైగా వెధవ క్షమాపణలు కూడాను. అడ్డమైన వాళ్ళూ సెకండ్ క్లాసులో ఎక్కడమే!" అన్నాడు కోపంగా. చిట్టంత మనిషిని, నన్నలా అంటూంటే, తోటి ప్రయాణీకులు చూస్తూ ఊరుకొన్నారు. నా కా క్షణంలో అనిపించింది, "నిజంగా నారాయణే నా పక్కన ఉంటే, ఈ పెద్దమనిషి నేం చేసేవాడో?" నని. నేనూ కోపం పట్టలేకపోయాను. సాచిపెట్టి ఒక్కటిచ్చుకొన్నా. దాంతో రగడ మొదలైంది. మమ్మల్నిద్దర్నీ విడదీయడానికి అయిదు నిముషాలు పట్టింది మిగిలిన ప్రయాణీకులకి.

నలుగురిలోనూ నవ్వులపాలయ్యానన్న బాధతో నా మనస్సంతా వికలమైపోయింది. గోదావరి స్టేషనులో చాలమంది దిగిపోయారు. నాతో దెబ్బలాడినవాడు క్రాపు సరిచేసుకొని, సూట్‌కేసు తెరచి కోటు తొడుక్కొన్నాడు. కోటు కాలరులో వాడిపోయిన గులాబీపువ్వు! హోల్డాల్లోంచి న్యూస్ పేపరు తీసి చేత్తో పట్టుకొన్నాడు. నా మతి పోయింది. ఆ క్షణంలో వెయ్యి సమ్మెటదెబ్బలు ఒక్కసారిగా తగిలినట్లనిపించింది. ఏం చెయ్యాలో తోచలేదు. నారాయణని కలుసుకొని, ఆప్యాయంగా, కులాసాగా కబుర్లు చెప్దామని ఉరకలు వేసిన నా మనస్సు, ఒక్కసారిగా అణగారిపోయింది. అవును, నారాయణని కల్సుకొన్నా. స్నేహితుడిగా కాదు! కజ్జా పెట్టుకొని, కక్ష పెంచుకున్న ఓ ప్రయాణీకునిగా. ఇలా మథనపడుతుండగా రాజమండ్రీలో మెయిలాగింది. రైల్లోంచి దిగి, భారంగా అడుగులు వేస్తూ గేటు దాటాను. కంపార్ట్మెంటు గుమ్మంలో నిల్చుని దిక్కులు చూస్తూన్న నారాయణని చూసి, బాధగా ఒక్క నిట్టూర్పు విడిచి రిక్షా ఎక్కాను. అయితే ఈసారెప్పుడయినా నారాయణ నన్ను వెతుక్కుంటూ, యింటికొచ్చి నన్ను కలుసుకొంటే, పరిస్థితి ఎలా పరిణామం చెందుతుందో నా కిప్పటికీ అవగాహన కాని విషయాల్లో ఒకటి.

"హరణ్"

# గొప్పోళ్ళ బతుకులు

ప్రతి స్వరూపం, మసక చీకట్లో పోల్చుకున్నాడు. గుండె పగిలేటట్లు పెద్దగ అరిచాడు. మంగ శవంమీద పడి ఏడ్చి ఏడ్చి అలసిపోయాడు. ఇక ఏడ్వలేక తన్ను తాను సముదాయించుకున్నాడు. మంగ శవాన్ని భుజాన వేసుకుని పాలెం వచ్చి—నడివీధిలో పడేశాడు. పాలెం అంతా గుమిగూడింది. ఆనోట ఆనోట మంగచావు వెనకాలవున్న అసలు రహస్యం బయటపడింది. కాని, ఎవరేం చేయగలరు? గొప్పవాళ్ళతోటి వ్యవహారం. వాళ్ళ వుప్పూ, పులుసుతో పెరిగిన పానకాలు శరీరం కూడా అన్యాయాన్ని సహించిందే గాని, ప్రతిఘటించలేకపోయింది. మంగ కాలి—మసి—మసై మట్టిలో కలసిపోయింది; మంగ పేరు అందరి నోళ్లల్లో నిలిచిపోయింది.

పానకాలు ఆ రాత్రంతా కుములుతూ, కుంగుతూ గడిపాడు. తెల్లారేపాటికి ఇంటి ముందు పోలీసులు. ఏం చెయ్యలేని పానకాలు ఏదో చేస్తాడని భయపడిన చిన్నదొర పన్నిన పథకం ఫలితం ఈ పోలీసుల సాక్షాత్కారం! ఇల్లు సోదా చేయబడింది. రెండు వేల రూపాయలు బయటపడ్డాయి. "అది సీతాపురంనుండి వసూలు చేసుకువచ్చిన శిస్తుల తాలూకుసొమ్ము" అన్నాడు పానకాలు. "కాదు అర్ధరాత్రి దివాణం ఖజానానుండి దొంగిలించినసొమ్ము" అన్నారు పోలీసులు. చేతులకు బేడీలు! పానకాలు చెప్పేది ఎవరూ వినిపించుకోలేదు. దివాణం ఖజానా నుండి రెండువేల రూపాయలు అపహరించినందుకు, అడ్డగించబోయిన చిన్నదొరను చంప ప్రయత్నించినందుకు కోర్టువారు పానకాలుకు ఏడు సంవత్సరాల కఠినశిక్ష విధించారు. కాదు—చిన్నదొర లంచంగా గుప్పినడబ్బు కోర్టువారిచేత ఆ శిక్షను విధింపచేసింది. పానకాలు ఈ ఏడు సంవత్సరాలు జైల్లో మగ్గాడు—కుంగాడు.

* * *

పానకాలు బరువుగా నిట్టూర్చాడు. 'అవును, ఈ సంగతులన్నీ నాకు జ్ఞాపకం వున్నాయి' అన్నట్లుగా తల వూపింది జువ్విచెట్టు. 'ఈ నాడు నా మంగ నాకు లేకుండా పోవటానికి, నేనీ స్థితిలో వుంటానికి కారకుడెవ్వడు? ఆ చిన్నదొర—విశ్వాసఘాతకుడు! మంగకు చేసిన అన్యాయాన్ని కూడు గుడ్డా యిచ్చే ప్రభువని నేను సహించి వూరుకున్నా, వాడూరుకోలేదు. చేయని నేరాన్ని నాపై రుద్ది నన్ను జైలుపాలు చేశాడు. నిజంగా ఆ నాడు నాకే పాపం తెలియదు. అమాయకుడ్ని నన్ను దొంగ

(55-వ పేజీ చూడండి)



# దొంగలు



ఆమంచర్ల గోపాలరావు

దొంగలకూ నీతి నియమాలు ఉండేవి. కిందటి తరం దొంగల, దొంగతనాల తీరు తెన్నులను చర్చించిన (జూన్ 24వ తేదీ సంచిక) రచయిత ఈ రెండవ వ్యాసంలో పూర్వం దొంగలు తమ కుల విద్యను ఎంత పకడ్బందీగా నేర్చుకునే వారో వివరించారు.

మునుపటి రోజుల్లో దొంగతనమే కుల వృత్తిగా పెట్టుకున్న వారు, తమ కుర్రలకా కులవిద్యను నేర్పి కండు మీరిన గజదొంగలుగా తయారుచేసే పద్ధతులను గుర్చి చెబుతానని కిందటి వ్యాసమందు అన్నను. ఆ పద్ధతులన్నీ నేడు ఆ కులాల్లో నశించిపోయినా, ఈ నాటికీ అన్ని దేశాల్లోనూ మిలిటరీలో గూఢచారుల్ని (secret service) తయారుచేసేటప్పుడు, ఆ పద్ధతులలో కొన్నింటినయినా అవలంబించక తప్పదు.

కుర్రవాడికి అయిదారు సంవత్సరాలు వచ్చేసరికి విద్యాభ్యాసం మొదలవుతుంది. మొదటి రెండు మూడు సంవత్సరాలు, రోజూ ఆ కుర్రవాణ్ణి తన్ని హింసలు పెడతారు. ఈ తన్నడం, హింసపెట్టడం ఆదిలో కొద్దిగానే మొదలయి, రోజు రోజుకూ హెచ్చవుతూ, రెండేళ్ళు గడిచేసరికి చాలా భయంకరం అవుతుంది. కాని ఆ హింసల్లో కుర్రని ఎముకలకుగాని, ఇతర దేహభాగములకుగాని పెద్ద హాని అంటూ జరగదు. కాని హింస మాత్రం అతి బాధాకరంగా ఉంటుంది. తప్పదు. ఈ హింసలు పెట్టుతున్నంతసేపూ ఆ కుర్రడు ఏడవకూడదు. ముఖంలో సయితం బాధను ఎంత మాత్రం తెలియజేయకూడదు. ఎంతసేపూ "నాకు తెలియదు" అని మాత్రమే అతడంటూండాలి. ఈ సాధన ఆనాడు దొంగలకు అత్యావశ్యకము. ఎందుకంటే దొంగల గుంపులో ఒకొక్కప్పుడు ఏ ఒక దొంగో దొరికిపోవడం జరుగుతుంది. అప్పుడు అతని సహచరుల పేర్లు అతనిచేత చెప్పించటానికి అనేక హింసలు పెట్టేవారు. కాని ఈ రీతిగా తయారయిన దొంగచేత, ఎంత చిత్రహింస పెట్టినాసరే పోలీసులు ఒక్క మాటయినా చెప్పించలేక పోయేవారు.

చిన్నప్పటి ఈ సాధన వాడు దొంగలకు అట్టి దిటవు ఇచ్చేది.

నా చిన్నతనంలో పోలీసులు కష్టపడి పట్టుకున్న ఒక దొంగ విషయం నాకింకా జ్ఞాపకమున్నది. ఆ దొంగకూడా సాంప్రదాయికంగా కులవిద్య అభ్యసించినవాడే. ఆ దొంగ సహచరుల వివరములు కనుక్కొనడానికి, పోలీసులు అతన్ని ప్రశ్నించి, అనేక రకాలుగా హింసించారు కూడా. అతడు ఒక్క విషయమైనా బయట పెట్టలేదు. అతని శరీరంమీద అతికోమల ప్రదేశాలపై కొన్ని గంటల పర్యంతం సూదులతో పొడిచి హింసించారు. ఆ దొంగ ముఖంమీద చిరునవ్వుతప్ప మరేమీ లేదు. "నాకు ఏమీ తెలియదు" అనే వాక్యమే తప్ప, అతని నోటివెంట మరో శబ్దమే వెలువడలేదు. ఆ దొంగ దిటవు నాటి పోలీసులకే ఆశ్చర్యము కలిగించింది. రెండవనాటికే ఆ దొంగ "గొప్పతనం" ఊరంతా ప్రాకింది. ఇంతేగాక మరునాడు కచేరీలో అతని సహచరులనుగూర్చి ప్రశ్నింపగా, అతడు మళ్ళీ నాకేమి తెలియదన్నాడు. అతనిని ఖైదు చేశారు. ఎంత ప్రయత్నించినా అతని సహచరుల జాడలు ఎవ్వరూ కనుక్కోలేక



# ★ దొంగలు ★

పోయారు.

ఏడు ఎనిమిదిసంవత్సరముల వయస్సు నుంచి విద్యాభ్యాసములో రెండవభాగం మొదలవుతుంది. ఈభాగం ఒకవిధంగా ప్రథమాధ్యాయముకన్నా కఠినమైనది అని చెప్పవచ్చు. ఎందుకంటే అప్పుడు కుర్రనికి సంపూర్ణ నిమగ్నత అవసరమవుతుంది. కుర్రని తెలివితేటల ననుసరించి ఈ విద్యాభాగము దాదాపు పది పన్నెండు సంవత్సరములు పట్టవచ్చును. ఈ కాలమందు అన్నివిధము లయిన సాము గరిడీలందు ఆ కుర్రడు తయారవుతాడు. రోజూ కసరత్తు చేయడమే గాక, పరిగెత్తటం, ఎగరటం, దూకటం, ఈదటం మొదలయిన వన్నీ క్షుణ్ణంగా అత డభ్యసించాలి. ఈరీతిగా దేహాన్ని వలసిన రీతిగా వంచుతూ, దృఢం చేసుకుంటూ, కుస్తీ, ఇతర బాహుయుద్ధములు, వీటితోపాటు కర్ర, కత్తి, బాకు, బల్లెము, వడిసెల, మొదలయిన వాడుకలో ఉన్న ఆనాటి సర్వాయుధముల సాములన్నీ ఇత డభ్యాసం చేస్తాడు. ఈ విద్యలన్నిటిలోను చాలా దొంగదెబ్బలున్నాయి. ప్రత్యేకించి ధర్మయుద్ధములలో దొంగదెబ్బలు నిషిద్ధములు. అందుచేత సామాన్యముగా ఈవిద్యలు అభ్యసించేవారు ఈ దొంగదెబ్బలను నేర్చుకోరు. కాని దొంగతనమే కులవృత్తి అయిన దొంగలు, ఈ దొంగ దెబ్బలన్నీ పూర్తిగా అభ్యసించటమే గాక, ఆ దెబ్బలనుంచి తప్పించుకొనేవిధము లన్నింటినీ పూర్తిగా అభ్యసిస్తారు. ఇందువలన లాభమేమిటంటే అట్లా తయారయిన దొంగ, సాయుధుడైన మేటి పైల్వానును సైతము, తాను నిరాయుధుడై తప్పటికి జయించి, తప్పించుకొని ఒక్క తృటిలో పారిపోగలడు. ఒక్కొక్కప్పుడు దొంగలజట్టు నలుగురైదుగురికి మించక పోయినా ఒక గ్రామగ్రామమును ఎదిరించి, కలబరపెట్టి తప్పించుకొని పారిపోవటంకూడ జరుగుతూండేది.

ఈ కసరత్తు, సాము గరిడీలతోపాటు, వారు అనేక చిత్రగమనములకుకూడ అలవాటుపడాలి. పామునడక, కప్పనడక, ఈరీతిగా ఆ గమనములకు పేరుగలవు. పొట్ట నేల కానించి, తల రొమ్ము తకనే, మెలకువతో, నిశ్శబ్దంగా, ముంజేతులమీద, కాళ్ళ మొనలమీద నడవడం పామునడక అనేవారు. అలా తరిఫీదయిన దొంగ ఈ రీతిగా, అతినిశ్శబ్దముగా, కొన్ని వందల గజములు ప్రాకిపోగలిగేవాడు. మోకాళ్ళు వంచి గొంతుకూర్చొని ప్రయాణము చేయటం కప్పనడక అనేవారు. ఈ రీతిగా కూడా కొన్ని వందల గజములు ఆ దొంగలు నడువగలిగేవారు.

ఇవన్నీ నేర్చుకొన్న పిమ్మట ప్రతిదొంగ అనేక పక్షుల స్వరములను, జంతువుల అరుపులను అభ్యసించి పలుకుటకూడా నేర్చుకో వలసివుండేది. ఈ శబ్దము లన్నీ వారి కొక సాంకేతికభాష. వారు దొంగలు ఈ శబ్దములను వినియోగించు విషయముకూడ అతిచిత్రమయినది. కన్నము వేయుటానికిపోయిన దొంగలు అక్కడక్కడ నిలిచి, అక్కడి సంగతి సందర్భములనెల్ల వివరముగా ఈ శబ్దములతో ఒకరికొకరు తెలుపుకొంటూ సంఘటితులై తమపని తాము చేసుకుపోయేవారు.

పూర్వము రాత్రులందు ఇళ్ళవద్ద, ఇట్టి శబ్దములు హఠాత్తుగా వినవచ్చినప్పుడు, తెలిసినవారు జాగరూకులయ్యేవారు. తెలియనివారు తెల్లవారేసరికి తమ ఇల్లు గుల్లఅయిన సంగతి తెలుసుకొని వాపోయేవారు.

ఈ సాంకేతికభాష నేగాక, ఒక గుప్త భాషసైతము వా రభ్యసించేవారు. పదిమందిలో వా రీగుప్త భాష మాట్లాడుతూ, పైవారికి తెలియకుండా తమ కృత్రి విషయాలు ధారాళముగా చర్చించుకొనేవారు.

వీటన్నిటితోపాటు, ప్రకృతిలోని అనేక విషయాలను గుర్తించటం వారు నేర్చుకోవాలి. నిద్రపోతున్న వ్యక్తి పురుషుడా, స్త్రీయా అని చటుక్కున గుర్తుపట్టెయ్యాలి. ఇంతేగాక శబ్దము ననుసరించి తమ పైకు వస్తున్న వారి సంఖ్య ఎంత? ఇలాంటి విషయాలన్నీ వారు తెలుసుకోగలగాలి. ఇవేగాక, కొంత వైద్యముకూడా వారు నేర్చుకోవాలి. మూలికలను గుర్తుపట్టటం, వాటి ఉపయోగము, కొంత శస్త్రచికిత్స ప్రతివాడు గా నేర్చుకోవాలి. రాత్రులందు తిరిగేటప్పుడు పాములు, తేళ్ళు మొదలైన విషజంతువులు దొంగను కాట్లు వేయవచ్చు. దొంగతనము చేసేటప్పుడు అనేక రకములైన దెబ్బలు తగుల వచ్చు. ఒక్కొక్కప్పుడు ఏదో స్వల్ప

లోగబాగ కూడ కలగవచ్చు. వీటన్నిటికి కావలసిన మూలికలను, ఇతర సూక్ష్మ వైద్య పద్ధతులను ఆ నాడు దొంగలందరు ఎరిగి ఉండేవారు. అది నిస్సందేహము.

నా చిన్నతనంలో మాకు తెలిసిన దొంగ ఒకడుండేవాడు. మా యింటి చుట్టూ నాడనేక పాములుండేవి. ఆ దొంగ మా మీద కనికరంతో అడవి నుంచి ఒక మూలిక మాకు తెచ్చి యిచ్చాడు. పాము కాట్లకు, తేళ్ళ కాట్లకు దానిని మేము అనేకమార్లు విని యోగించి, నాడు అనేక మందికి నయము చేశాము. కాని ఆ దొంగ ఆ మూలిక పేరు చెప్పకనే చనిపోయాడు. ఇవన్నీ నాడు వారు అతిరహస్యముగనే ఉంచేవారు. ఇప్పుడు సైతము అట్టి కులములవారెవర యినా కుల విద్యలను గట్టిగా అభ్యసించిన వారుంటే ఆ వైద్యరహస్యములను ఏరీతిగా నయినా కనుక్కొని, శోధనచేస్తే దేశమున కెంతయినా ఉపకారము జరగ గలదు.

ఇవన్నీ నేర్చుకొని తయారయేసరికి ఆవిద్యార్థికి దాదాపు ఇరవై సంవత్సరములు వస్తాయి. అప్పుడు అతడు నిజముగా సాటి లేని మేటియే అనుటకు ఏ సందేహమూ లేదు. అప్పటినుంచీ వానిని రాత్రులందు జట్టుతో పాటు తీసుకొనిపోవటం మొదలు పెడతారు. కొంతకాలము, తన పెద్దలు కన్నము వేసి దొంగతనము చేస్తున్నప్పుడు అతడు కాపలాకాస్తూ అనేక విషయములను గ్రహిస్తాడు. అటు తర్వాత గోడలకు కన్నము వేయటం అతడు నేర్చుకోవాలి. ప్రప్రథమున ఇండ్లకు బయట ఉండే ప్రహరీగోడల కాతడు కన్నము వేయాలి. ఈ కన్నము వేసేటప్పుడు ఏ మాత్రం శబ్దము కలగకూడదు. రాలుతున్న మట్టిని సైతము ఒడిలోకి పట్టుకొని భద్రముగా నేలమీదికి విడవాలిసిందే. ఇంతేగాక ఇంటికి కన్నము వేసేటప్పుడుండ వలసిన జాగ్రత్త అంతా అతడు ప్రకటించాలి. అటు తర్వాతనే అతడు పెద్దలు నిర్ణయించిన యింటికి కన్నము వేయాలి. ఇట్లా కొన్ని ఇండ్లకతడు తగురీతిని కన్నము వేసినతర్వాత, ఒక మంచిరోజున, శుభముహూర్తమందు పెద్దలు నిర్ణయించిన ఇంటికి కన్నము వేసి, ఇంటిలోకి ప్రవేశించి, తాను నేర్చిన కులపద్ధతుల ననుసరిస్తూనే దొంగతనము చేయాలి.

ఆ నాటికి అతని విద్య పూర్తిఅయింది. ఇక అతడు కూడ అందరితో సమానమయిన దొంగయే ఇక ఎంతమాత్రమూ విద్యార్థి కాడు.

ఇట్లా పూర్తిగా విద్యాభ్యాసము ముగిసే సరికి ఆ దొంగకు దాదాపు ఇరువదిరెండు, ఇరువదిమూడు సంవత్సరములు నిండుతాయి. సామాన్యముగా ఇట్లా తయారయిన దొంగ ఆ జట్టులతోనే కలసి తన వృత్తిని సాగిస్తూ ఉంటాడు. కాని ఒక్కొక్కప్పుడు, ఒక్కొక్కడు అసమాన ప్రతిభగలిగినవాడై, జట్టును విడిచి, తానే ఒంటరిగా తనవృత్తిని సాగిస్తూ ఉంటాడు. ఇట్లా ప్రజ్ఞావంతులయి, ఒంటరిగా దొంగతనములుచేసి "తరించిన" దొంగల ననుసరించే, రేచుక్క, పగటి చుక్కల పేరిట, అనేక కథలు అనాదినుంచి మన దేశమందు ప్రబలాయి. ఆ కథలన్నీ నిజంగా కట్టుకథ లనుటకు వీలులేదు. కొన్ని కల్పితములు కావచ్చును. కాని నిజంగా అట్టి దొంగలు పూర్వము మన దేశమందుండేవా రనేది నిస్సందేహము.

ఇది మూడు నాలుగు తరాలనాటిమాట. కాశ్మీర దేశంలో ఒక గజదొంగ ఉండేవాడు. అతన్ని పట్టుకోవటం అసాధ్యమయింది. అందరూ అప్పుడు రాజుతో మొరపెట్టుకోగా, రాజతనిని దర్బారుకు పిలిపించాడు. దర్బారులో మాటమీదమాటవచ్చి, ఆనాడు రాత్రికే, రాజుగారు తొడుక్కొని పడుకునే లాగును దొంగిలిస్తానని ఆ దొంగ పందెము వేశాడు. ఆ లాగును దొంగిలించి మరునాడు దర్బారులో చూపకపోతే అతనికి శిరచ్ఛేద మవుతుందని రాజు పలికాడు. దాంతో ఆ దొంగపని సరిఅని అందరూ తృప్తిపడ్డారు.

కాని వాడు నిజముగా గడితేరిన గజ దొంగ. సాయంత్రమే ఒక ఎర్రచీముల పుట్టకు వెళ్ళి, ఒక సన్నని గొట్టమును ఆ చీమలతో నింపాడు. గొట్టమును రెండువైపులా మైనముతో బిగించాడు. నడిరాత్రికి, రాజుగారి నగరిలో ప్రవేశించి, రాజుగారి లాగుకోసం ఎలాగోలాగు రాజుగారి పడకగది ప్రవేశించాడు. నిద్రపోతున్న రాజు కాళ్ళదగ్గర చేరి, గొట్టమును బిగించిన మైనమును వదల్చి, తిన్నగా రాజుగారి లాగులోనికి ఆ చీమలను ఊది, పక్క, మంచముక్రిందనే దాగుకొన్నాడు. రాజు చీమలబాధ భరించలేక, ఆ లాగునువిప్పి, మరొకటి తొడుగుకొని మరల నిద్రించాడు. అప్పుడు రాజుగారికి ఏ అనుమానమూ కలగలేదు

మరునాడు నిండుసభలో, ఆ లాగుతోనే దొంగ ప్రత్యక్షమయ్యాడు. వాడు దొంగిలించినపద్ధతి రాజుగారినేగాక, సభికులందరికీ ఆశ్చర్యముగొలిపింది. రాజుగారు హర్షించి, అతని ప్రజ్ఞ మెచ్చుకొని, అతనికి ఒక గ్రామము ఇచ్చారు. వెంటనే ఆ దొంగ అందరికీ నమస్కరించి, ఆ గ్రామమును తన భార్య, పిల్లల కిచ్చి సన్యాసము స్వీకరించాడు. నిజంగా ఆ కులాలవాండ్లు ఆనాడు చెప్పుకొంటున్నట్లు కులవృత్తి ననుసరించే ఆదొంగ మోక్షము పొందాడని మనమనుకో వచ్చును

ఇట్టి ఒంటరి గజదొంగలు సామాన్యము గాదు. నాడు కన్నము వేసి ఇండ్లను దోచుకునే దొంగలందరూ జట్లు జట్లుగానే పనిచేసే వారు. ఈ జట్ల పద్ధతులు కొంతవరకూ మరో సారి చెబుతాను.



# పరిసరాలు .. అవసరాలు

నాకు పొట్టకోసం కాకపోయినా కట్టుకున్న పెళ్ళాంకోసం, కన్న బిడ్డకోసం, పగలల్లా ఆ ఆఫీసులో ఆ నాలుగు గోడల మధ్య-యేళ్ళ తరబడి యెంతో మందిని మోస్తున్న ఆ ఒంటి కుర్చీలో కూలబడి వచ్చేపోయే అధికార్లకు సలాములు చేసి, సమాధానాలు చెబుతూ, ఆ కాగితాల్లో మునిగిపోయి బుర్ర వేడెక్కి ఆ మహాతల్లి గోడ గడియారం అయిదుగంటలు కొట్టడం అనే మహాప్రసాదంతో ఒక్క నిట్టూర్పు విడిచి ఆ నాలుగు గోడలమధ్య నుండి జైలు లోంచి విముక్తుడయిన వాడికి మల్లే బయట పడి కాళ్ళీడ్చుకుంటూ యింటికి వస్తున్నా.

ఆలోచనలతో సతమత మవుతూ ఘటాన్ని యింటికి చేరవేశా. గుమ్మంలో అడుగు పెట్టానో లేదో ఆరేళ్ళ సుపుత్రుడు రఘు కాళ్ళకు చుట్టుకొని నాన్నగారూ! వాళ్ళ అబ్బాయి సైకిలులాంటి సైకిలు నాకు కూడా కొనరూ' అన్నాడు. నా కాశ్చర్యం కలిగింది. ఇంతవరకు నన్నెప్పుడూ యే కోరికా కోరలేదు మా హెడ్ క్లర్కు లక్ష్మీపతి గారింట్లోకి అద్దెకు వచ్చి నాలుగు రోజులయింది. 'వాళ్ళ అబ్బాయి కున్న సైకిలు చూచి అప్పుడే పేచీ మొదలు పెట్టాడు. ఆయనకేం యెన్ని సైకిళ్ళైనా కొంటాడు. ఇవ్వాళ శ్రీపతిగారి గుమాస్తా నీలకంఠం ఇస్తానన్న వంద రూపాయలు తీసుకుంటే నేనూ కొందును సైకిలు.

లంచం పట్టేవాళ్ళ లిస్టులో చేరి, అభ్యుదయకవుల కలానికి ఆహారంగా మారటానికి తిట్లు తినడానికి యిష్టం లేకపోయింది. హేళనగా వెకిలి నవ్వునవ్వే తోటి గుమాస్తా యెత్తిపొడుపు మాటలు ఒక ప్రక్క, దారిద్ర్యబాధతో సతమత మవుతూ కూడా పచ్చ కాగితం చూచేసరికి లక్ష్మిని కాలదన్నుతున్నానని భావం ఒక ప్రక్క బాధిస్తున్నా అప్పుడప్పుడేవో భావాలు వెలికురికి వెర్రిమొర్రికథలు రాసిన వ్యాపకంచేత కవుల కలం పోట్లలో ఉండేబాధే నాకు యెక్కువ కనిపించి పచ్చ కాగితాన్ని కూడా తృణీకరించా. అప్పుడు నీలకంఠం నావంక చూచిన చూపు యిప్పుడు కాదు గదా యెప్పటికీ నా జ్ఞాపకం ఉంటుంది. నన్నొక వెర్రివాడి క్రింద బ్రతుకు తెరువు తెలియని బడుద్ధాయి క్రింద, కాలప్రవాహంలో తోటి మానవులతో యీదలేక వెనుకబడే అసమర్థుడి క్రింద చూచాడు. అయినా నా మనస్సు ఒప్పుకోలేదు ఇప్పుడు కుర్రాడు సైకిలు కొనమనేసరికి అంతా ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది.

## వల్లాది సత్యనారాయణ

'అట్లాగే కొంటాలే బాబూ సైకిలు' అన్నా.

'ఎప్పుడు కొంటారు?'

'రేపు జీతంవచ్చాక'

'ఎప్పుడొస్తుంది జీతం'

'ఇంకా యిరవై రోజులకి'

'అమ్మో బాబోయి ఇరవై రోజులకా?'

'అవును. యేం?'

'అప్పటికి అయిపోతాయేమో బాబూ, సైకిళ్ళు.'

'అయిపోవు కావలసినన్ని ఉంటాయి.

'అప్పుడు కొనకపోతేనా' అని జాగ్రత్త అన్నట్టుగా వేలుచూపించి తల్లిదగ్గరకు తుర్రుమన్నాడు.

ప్రొద్దుటినుంచి ఆ సైకిలు చూచిపేచీ అంటూ మా ఆవిడ కొంతం గూడా ఆశగా నావంక చూచింది.

'నా అసమర్థత మా ఆవిడకు తెలియదు గనుకనా అనుకుని, నేనేమీ సమాధానం చెప్పలేదు. ఇంతలో మా ఆవిడ గబగబ పెట్టెలోంచి ఒక చీర పట్టుకువచ్చి చూపి 'నారం గుమాస్తాగారిభార్య యింగాక చీరలు బేరం చేస్తూంటే వెళ్లాను. "ఏం? మీరు కూడా తీసుకుంటారా యేమిటి" అంది. "ఇప్పుడు డబ్బులేదండి" అన్నాను. "పోనీలెండి మీవారి జీతంవచ్చాక యిద్దురుగాని. అందాక నేనిస్తా"నని డబ్బు ఆవిడే యిచ్చేసింది' అంది.

ఎంత దీని ఖరీదు' అన్నాను.

'ఇరవై నాలుగు రూపాయలు.'

నా గుండె ఆగిపోతుందా అనుకున్నాను. ఇదివరకెప్పుడూ మా ఆవిడ యింత చొరవ చేసి చీరకొనడం యెరుగను. బజారునుంచి నేను తెచ్చిన దేవో కట్టుకోవడమేగాని ఇది కావాలి అది కావాలి అని అడిగి యెరుగను. దీని కంతకూ కారణం 'సహవాసజా దోష గుణాభవన్తి' అనుకున్నా. ఇందుకే కాబోలు లక్ష్మీపతి గారింట్లో వాటాలోనికి అద్దెకు వెడుతున్నాననగానే నా స్నేహితుడు రామం 'బ్రదర్! జాగా యెటెగి జైకో' అని వీపు మీద తట్టాడు. ఆ మాటల అర్థం నాకప్పుడు తెలియలేదు గాని యిప్పుడు తెలుస్తోంది. వచ్చే జీతానికి 24 రూపాయల బిల్లు అప్పుడే రెడీ అయి కూర్చుందన్నమాట. కొంచెం బాధగానే ఉంది. చిన్నప్పుడు మా అన్న "అస్తమానూ మోసేవాడికి తెలుస్తుంది కావిడి బరువు"అనేవాడు. జ్ఞాపకం వచ్చింది.

మాట్లాడకపోయేసరికి యేమనుకుందో కొంతం నెమ్మదిగా 'బొత్తిగా రెండే గుడ్డలున్నాయి. 'ఎలాగా అవసరమే కదా' అని తీసుకున్నా, పోనీ మీకు యిష్టంలేకపోతే ఆవిడకే యిచ్చేస్తాను. ఇదికూడా ఆవిడే తీసుకుంటానంది' అంది.

ఆ మాట నాకు మరీ బాధగా తోచింది. ఆ మాత్రం చీరకూడా కొనలేని అసమర్థుడుగా ఆవిడదృష్టిలో నన్ను సృష్టించడానికా చీరపట్టుకు వెళ్ళి యిచ్చేస్తాననడం. ఇదంతా చదువు సంస్కారం లేని నాభార్యతో చెబితేమాత్రం యేం అర్థమవుతుందని, అంతవరకు నాభార్య బుర్రమాత్రం ఆలోచించగలదా అనుకుని, 'పోనీలే, తీసుకున్నావుగా మళ్ళీ యిచ్చెయ్యడం యెందుకు? ఉంచు' అన్నా మాట్లాడకుండా పెట్లో పెట్టుకుంది చీర.

మరునాడుసాయంత్రం ఆఫీసునుంచి వచ్చేసరికి ఆప్యాయంగా మా ఆవిడ పకోడీలు ఒకప్లేట్లో పెట్టి పట్టుకు వచ్చింది.

'ఇవెక్కడివి?' అన్నాను.

'వండా'నంది.

'మరి మంచినూనె అయిపోయిందన్నావుగా.'

'అవును అయిపోయింది. గుమాస్తాగారి

భార్య వండుతోంది పకోడీలు. వాళ్లురోజూ ఏదో టిఫిను చేసుకుంటూ ఉంటారుట. నాకు కూడా వండాలని బుద్ధి పుట్టింది. ఇంతలో అవిడే అంది. "ఏవమ్మా మీ ఆయన ఆఫీసునుంచి వచ్చేసరికి కాస్త ఏదేనా టిఫిను చేయకూడదమ్మా" అంది. "మంచి సూచనే అయిపోయిందండీ" అన్నాను. "అదేమిటండీ, మా యింట్లో పట్టుకు వెళ్ళకూడదా బగులు, మళ్ళీ తెచ్చుకున్నాక యిద్దురుగాని" అని యిచ్చింది. నాకూ పకోడీలు వండాలని బుద్ధి పుట్టింది. వండాను' అంది.

నోరూరింది. తినడం ప్రారంభించాను తింటున్నా నన్నమాటే గాని బుర్రలో అనేక ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. ఉన్నదానితోనే కాలక్షేపం చేస్తూ ప్రక్కయింటికి బగులు వెళ్ళడానికి బాధపడే నాభార్యను, మానాభిమానాలు వదిలేసి రెండు చేతులా సంపాదించే గుమాస్తాగారి భార్యతో నాలుగురోజులు సహవాసం చేసేసరికి ఎంతమార్పు వచ్చిందా అనుకున్నా. కరకరలాడుతూ బాగానే వున్నాయి. పకోడీలు. మా అవిడ నా ప్రక్కనిచేరింది.

'నేనొకటి అడుగుతాను. మీకు కోపం రాదుగదా,' అంది.

'ఏమిటది?'

'ఏమీ లేదు. నిన్న ఆఫీసులో యెవరో యేదో పనిచేసిపెట్టమని వందరూపాయలు పట్టుకువచ్చి యివ్వబోతే మీరు పుచ్చుకోలేదటగా.'

'ఎవరు చెప్పారు?'

'గుమాస్తాగారు వాళ్ళ ఆవిడతో చెప్పారుట అవిడ నాతో చెప్పింది నిజమేనా?'

'నిజమే.'

ఏమనుకుందో మళ్ళీ మాట్లాడలేదు. మా ఆవిడ ఉద్దేశం కనిపెట్టలేకపోయాను. కొన్నేపు నిశ్శబ్దంగా పకోడీలు తింటున్నా. ఆఖరుకి మళ్ళీ మొదలు పెట్టింది.

'వాళ్ళ ఆయనకు నెలకి కనీసం రెండు మూడు వందలైనా, యీ బాపతుగా వస్తాయుట,' అంది.

'ఊహూ' అని ఊరుకున్నా

మళ్ళీ కొన్నేపు నిశ్శబ్దం.

' "పనికేం మిట్ఠమాన్యాలు యేలిపోయారా? చేతికొచ్చింది పోగొట్టుకుంటారా? మనం ఒక్కళ్ళం మడికట్టుకు కూర్చుంటే అయిందా? మహామహా పెద్దవాళ్ళే కక్కుర్తి పడుతూంటేను," అంది గుమాస్తాగారి భార్య' అని మళ్ళీ ఒక చిన్న లెక్చరు యిచ్చింది మా అవిడ జంకుతూ జంకుతూనే.

నా భార్య యీ మాటలు చెబుతూంటే సింగారించుకుని సినిమాకు టాక్సీలో వెళ్ళే తోటిగుమాస్తా శ్రీధరరావు అతనిభార్య నా మనోదృష్టిలో గోచరించక పోలేదు అయితే మా అవిడ విషయంలో నాకెంతో ఆశ్చర్యం కలిగింది. ఎంతలో యెంతమార్పు వచ్చిందా అనుకున్నా. నేనీ ఉద్యోగంకోసం తిరిగేటప్పుడు వందరూపాయలు లంచం యివ్వవలసి వచ్చినప్పుడు 'లంచం యెట్లా పుచ్చుకుంటారో! ఒకళ్ళని పీడించి లంచం పుచ్చుకుంటుకు మనసెట్లా వస్తుందో, ఈ లంచం పుచ్చుకున్న డబ్బు న్యాయంగా వాళ్ళకు దక్కుతుందంటారా?' అంటూ చేతిగాజులు తీసి యిచ్చి 'అమ్మి వాళ్ళకివ్వండి. మనకు యెట్లాగో ఒకలాగు ఉద్యోగందొరకడం ప్రధానం కాని ఒక్కటిమాత్రం నిజం. కన్నీళ్ళతో యిచ్చే యీ గాజులు అమ్మిన డబ్బు మాత్రం వాళ్ళని సర్వనాశనం చెయ్యకపోతుందా' అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది ఆనాడు కాంతం. ఆకాంతం యీనాడు చేతికందిన వందరూపాయలు వదులుకున్నానని బాధపడుతోంది. ఏవనాలో, యెట్లా మా ఆవిడని తృప్తిపరచాలో నాకు అర్థం కాలేదు.

కొన్నేపు మాట్లాడలేదు. దృష్టి పకోడీల మీదే ఉంది. మా అవిడ దృష్టి నానోటి నుంచి ఏం సమాధానం వస్తుందా అని ఉంది. నేను కనిపెట్టకపోలేదు అయినా నేనేమీ సమాధానం యివ్వలేదు

'ఆనాడు మన అవసరంకొద్దీ చేతి గాజులు అమ్ముకుని వందరూపాయలు మనం యివ్వలేదూ. వాడెవడో మహాచక్కగా పుచ్చుకున్నాడు. అల్లాగే వాడెవడికో మన అవసరం కలిగి వందరూపాయలు పట్టుకొచ్చాడు. పుచ్చుకోవడంలో తప్పేముందంటాను పోనీ సంగతి తెలిస్తే పైఅధికారులు యేమైనా అంటారేమో అనుకుంటుకి అప్పుడు మనం యిచ్చిన వందరూపాయలు పుచ్చుకున్నవాణ్ణి యేమైనా చేశారు గనుకనా. యిప్పుడు లంచం పుచ్చుకోవడం అలవాటయిపోయిందని, లేకపోతే వాళ్ళిచ్చే జీతాలు యేమూలకని గుమాస్తాగారి భార్యచెప్పింది. వాళ్ళు ఆ బాపతుగా సంపాదించిందిపెట్టి కట్టించిందేనట యీ యిల్లు అని మళ్ళీ ఒక చిన్న లెక్చరు.

ఇప్పట్లో యేంచెప్పినా యేం లాభం లేదని మాట్లాడకుండానే లేచాను. తర్వాత ఆ ప్రసంగం రాలేదు.

మరునాడు సాయంత్రం నేను ఆఫీసునుంచి వచ్చేసరికి మాఆవిడ టిప్‌టాప్‌గా ముస్తాబయింది. ఏమిటి హడావుడి?' అన్నాను.

'ఏమీ లేదండి గుమాస్తా గారి భార్య సినిమాకి వెడుతోంది. "మీరుకూడా వస్తారా?" అంది. ఏమనను? "అక్కడికి 'డబ్బు లేదండీ'" అన్నాను "నేనిస్తాలెండి మీ ఆయన జీతాలు వచ్చాక యిద్దురుగాని" అంది ఆవిడ. ఇంక బాగుండదని వెడదామని బయలుదేరాను. మిమ్మల్ని అడిగి మీరు వెళ్ళమంటే వెడదామని' అంది.

'బయలుదేరాక రావడం బాగుంటుందా. సరే వెళ్ళిరా' అన్నాను. రఘుని తీసికొని మా ఆవిడ గుమాస్తా గారి భార్యతో సినిమాకు వెళ్ళింది.

నేను భోజనంచేసి పరున్నాను ఆలోచనలమీద ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. జాగా యెరిగి బైలో అని నా మిత్రుడు చెప్పిన మాటలు పదేపదే చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి పరిసరాల ప్రభావంలో అధికమయ్యే అవసరాలు మనో నేత్రం ముందు నాట్యం చేస్తున్నాయి

చిన్నప్పుడు చదువుకున్న ఒక కథ జ్ఞాపకం వచ్చింది. ఒక ప్రవాహంలో బంగారుకుండ, మట్టికుండ ప్రయాణం చేస్తు

# ★ పరిసరాలు - అవసరాలు ★

న్నాయట. ముందు మట్టికుండ వెనకాల బంగారుకుండ వెడుతున్నాయట. బంగారు కుండ మట్టికుండతో 'మనిద్దరం కలిసి ప్రయాణం చేద్దాం నువ్వు నా దగ్గరకు వచ్చినా సరే లేక నేను నీదగ్గరకు వచ్చేటట్టు నీవు నిలిచినా సరే అందట. అప్పుడు మట్టికుండ 'వద్దుబాబూ! నేను నీ దగ్గఱకు వచ్చినా నాకే నష్టం. నువ్వు నాదగ్గఱకు వచ్చినా నాకేనష్టం. మనం యిట్లా దూర దూరంగా ఉండడమే మంచిది,' అని చెప్పిందట. అట్లాగ మనతో సమానపరిస్థితులు కలిగిన వారిచెంత ఉండడం మంచిది గానీ, మన కన్న యెక్కువ ఆర్థికపరిస్థితులు కలిగినవారి చెంత ఉండడం మంచిదిగాదని అర్థం చేసుకున్నాను. పరిసరాలు తెచ్చే మార్పుకు ఆశ్చర్యపడుతూనే ఉన్నాను.

ఇంతలో మా ఆవిడ వచ్చింది. వస్తూనే 'అబ్బబ్బ' ప్రపంచమంతా లంచం, లంచం, లంచం, పావలా ఒకడికి లంచం యిస్తేనే గాని మాకు రెండు టిక్కట్లు దొరకలేదు. వెంటనే అనేసింది గుమాస్తాగారి భార్య "చూశారా ప్రపంచం యెట్లాఉందో, మీ ఆయనగారు వందరూపాయలు అనాయాసంగా వస్తూంటే వదులుకున్నారు. లంచంతో నిండిపోయింది మా ప్రపంచం అంతా అంది,"' అని మళ్ళీ సినీమానుంచి రాగానే ఒక చిన్న లెక్చరు యిచ్చింది.

అప్పుడు నేనేమీ మాట్లాడలేదు.

మరునాడు ఆఫీసుకు బయలుదేరుతూంటే 'నేనొకమాట చెబుతాను కోపగించుకోకుండా ఉంటారా' అంది.

'ఏమిటది?'

'ఏమి లేదు. రఘు సైకిలుకోసం పేచీ పెట్టేస్తున్నాడు. పొద్దుట వాళ్ళ అబ్బాయీ మన రఘూ ఆ సైకిలుకోసం దెబ్బలాట. అంతట్లో గుమాస్తా గారి భార్యవచ్చి 'రఘూ! "మీ నాన్నగారిని సైకిలు కొనమను" అంది. అంచేత ఆ వంద రూపాయలు మళ్ళీ అతను గనుక పట్టుకువస్తే వద్దనకండి. తీసుకుని రఘుకి సైకిలు కొనండి వాళ్ళ అబ్బాయిలాగ మన అబ్బాయికూడా సైకిలు త్రొక్కుతూంటే చూడాలని ఉందండీ.'

'అట్లాగేలే' అనేసి వెళ్ళిపోయాను.

సాయంత్రం యథాప్రకారం ఆఫీసు నుంచి వచ్చేసరికి మా ఆవిడ యెదురుగావచ్చి 'ఏంచేశారు నే చెప్పినమాట' అంది.

'అంతా రైటు చేశాను' అన్నాను.

'మరి సైకిలు కొనుక్కు వచ్చెయ్యక పోయారేం?'

'ఇంక రఘు సైకిలుకోసం పేచీయే పెట్టడు.'

'అంటే?'

'అంటేనా! ఇదివరకు మనం ఉంటే యిల్లు, ఎవరిది? ఆ బోర్డుస్కూలు మాస్టారిది. మళ్ళీ ఆ యింట్లోకే వస్తామన్నాను. పాపం ఆ మాస్టారు "తప్పకుండా రండి" అన్నారు. అందుచేత యీరాత్రే మంచిది. ఈరోజు వరకు అద్దె యెంతయిందో లెక్క చూచి వీరికిచ్చేసి యీ యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోతే రఘు యింక సైకిలు కోసం పేచీయే పెట్టడు. ఆ మాస్టారు పిల్లలకు యిట్లాంటి సైకిళ్ళు కొనలేదుగా. అందుచేత మన రఘు వాళ్ళ పిల్లలతో దెబ్బలాడడు కూడాను.' అన్నాను.

నిర్ఘాంతపోయి 'ఆ' అంది మా ఆవిడ.

'అవును 'కాంతం' పొద్దుటనుంచి చూస్తున్నాను. నువ్వు చెప్పినట్లు ప్రపంచం అంతా లంచంతో నిండిపోయింది లంచానికి తావులేని చోటు యేదా అని ఆలోచిస్తే నిన్నవరకు ఆ బోర్డుస్కూలు మాస్టారే లంచానికి తావులేని మనిషి. వారియిల్లే లంచానికి తావులేని ప్రదేశం అని తోచింది' అన్నాను.

మళ్ళీ మాట్లాడలేక పోయింది మా ఆవిడ. నేను చెప్పిందే న్యాయం అన్నట్లుగా హెడ్‌క్లర్కు గారింట్లో గోడగడియారం ఆరుగంటలు కొట్టింది. ఆ వెనకనే మా యింటిప్రక్క నున్న ఆలయంలో గంటలు మ్రోగిస్తున్నారు యెవరో.



# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌వాడి

ప్రొద్దున్న ఉండే తాజాదనమును

రోజంతా పొందండి




స్నానముచేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును రాసుకొంటే రోజంతా తాజాగా మరియు హాయిగా ఉండగలరు!

శ్రేష్ఠమైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఎంతో మృదువుగా ఉంటుంది మరియు చెమటను పీలుస్తుంది. దీనిని రాసుకొని తాజాదనపు హాయిని రోజంతా అనుభవించండి!

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

P. 7730



# రెండు దుడులు

రామకృష్ణ

"మధూ! స్నేహితుడిగా నాకో సహాయం చేసిపెట్టాలి" అన్నాడు వేణు మధు కోక సిగరెట్ అందిచ్చి.

"నేనెప్పుడు కాదన్నాను. చెప్పు అదేదో?"

"డబ్బుకి చాలా యిబ్బందిగా ఉంది. నాన్న, యింటికివెళ్లినప్పుడల్లా నీతులు బోధిస్తూ సినిమాలు చూస్తున్నందుకు, సిగరెట్లు తాగుతున్నందుకూ చివాట్లుపెట్టి 'జాగ్రత్తగా వాడుకో' అంటూ ముప్ఫయ్యో నలభయ్యో చేతిలో పెట్టి కళ్లు మూసుకుంటాడు పడకకుర్చీలో వాలి... అవసరానికి ఇరవై రూపాయలు కావాలి."

మధు జాలిపడ్డాడు, అతడు చెప్పే మాటలు, చేసే చేష్టలూ చూస్తుంటే నవ్వు వస్తుంది. చంటిపిల్లాడు నయం, వేణుకన్నా.

"అలాగే తీసుకో. కాని అవసరం యేమిటో చెప్పి మరీ తీసుకెళ్లు."

వేణు యీసారి కొత్త హుషారుగా "నీకు తెలియని దేముంది! మామూలు భాగోతమే. నేను చూస్తే వట్టి ఖర్చుమనిషిని. ఇంటినుండి తెచ్చుకున్నది కాస్తా హరించుకుపోయాక నెలాఖరుకు యివ్వాల్సిన 'రూమ్ రెంట్' మాట జ్ఞాపకానికి వస్తుంది. నాల్గో జాలనుంచి తెగ్గనతో యిస్తోంది యింటావిడ. విధవముండకు వెర్రి బలంట; కొడుతుందేమో అనికూడ ఒకోసారి భయపడుతుంటాను. వెన్కటి నెల అరు రూపాయలూ యీ నెలదీ కలిపి యివ్వకపోతే రూము కాళీ చెయ్యాల్సివస్తుందని ఖండితంగా చెప్పేసిం దివాళ. రొప్పుతూ రోజుకుంటూ యిక్కడికి వొచ్చిపడ్డాను" సిగరెట్ క్రిందపడేసి బూటుతో నలిపేశాడు.

"అయితే మీ యింటి మామ్మగార్ని చూడవలసిందే!" అని నవ్వుకుంటూ వెళ్లి పెట్టె తెరిచాడు.

"బాబోయ్! ఇక్కడికి నేను వేగలేక వస్తున్నాను. నిన్నుకూడ ఆ నరకం అనుభవింప చేయాలా? వద్దుబాబూ వద్దు."

"సరేలే, నన్నిలాగే ఉండనియ్యి" అంటూ మధు అతడిచేతిలో రెండు పది కాయితాలుంచాడు.

వేణు విపరీతోత్సాహంలో ఉక్కిరిబిక్కిరిఅయి "థాంక్స్" అనగల్గాడు.

మధు ఒకందుకు మాత్రం బాధపడుతుంటాడు — వేణు అతడితండ్రి విషయాలు చాలసార్లు చెప్పాడు. ఆయనకూడ బ్రతుకున్న రోజుల్లో తలకుమించిన ఖర్చు పెట్టినవాడే! సహవాస దోషం వల్ల తాగుడుకుకూడ అలవాటు పడ్డ మనిషేనట. మరి యీ సంగతులు అందరూ కనీసం తమ చిన్నతనాన్నైనా స్మృతిలోకి తెచ్చుకుని తమ పిల్లల అవసరార్థం యెంత కావాలో ఆలోచించి ఆ మాత్రమయినా యెందుకివ్వరో అని! బాధ్యత తెలుసుకోగల వ్యక్తిని నీతులతో బెదిరించి బాధపెట్ట పనిలేదే!

వేణు ఆనందంగానే అడుగులు ముందుకు వేస్తున్నాడు. కమల యింటి పరిస్థితుల చూచి కన్నీరు కార్చాడు, కరగిపోయాడు జాలిగుండె కలవాడుకన్న. కమలకు తలి





లేరు తండ్రి ఉన్నా లేనివాడే! ఎందుకనంటే ఒక ప్రమాదం కారణంగా గుడ్డివాడైపోయాడు. ఇక చెల్లెలు ఒకర్తె ఉంది. ఆమెను స్కూలులో చదువు ఇల్లు సర్వనిధాలా కూలిపోటానికి సిద్ధంగా ఉంది. గోడలలోని ఇటుకలు తగ్గడాకు వస్తున్నాయ్. కమలకు రఘుకొక్కడే అన్నయినా తమ్ముడయినా! అతను స్కూల్ ఫైనల్ వరకూ చదివి పెళ్ళిచేసుకుని రాజమండ్రీలో కాపురం పెట్టాడు. నెలకో పాతిక వస్తయ్ అక్కడినుంచి అక్కడికే బ్రహ్మాండం!

వేణుకి కనులతో తెలవనితేంపుగా పరిచయం ఏర్పడింది.. తను ఆగోజాన బజారులో తిరిగి రూముకి వచ్చేస్తున్నాడు. అప్పటికే ఏడవుతూంది. ఎవరవచ్చేదనూ వాన్యం. ఎంగుకనో విద్యుద్దీపాలు గుడ్డికాంతిని వెళ్ళగక్కుతున్నవి. ఎదురుగా ఒక కారు రేష్‌గా వస్తూంది. అది తన్ను సమీపించే సరికి సైకిలు మీద పోతున్న వ్యక్తి బిత్తరపడిపోయి సైకిలుతో సహా తనమీద పడ్డాడు. తను అది తిసపుగా యింకొద్ది ప్రక్కగా పోతున్న యువతిపై వాలాడు. ఆమెకూడా జారిపడిపోయేదే కాని ఎలాగో నిలబడగల్గింది. కారు వెళ్ళనే వెళ్ళిపోయింది. ఆ వ్యక్తి సైకిలు తీసుకుని కనీసధర్మానికి క్షమాపణ అయినా చెప్పుకోకుండా దొంగలాగ సైకిలెక్కి మరింతస్పీడుతో పలాయనం

# ★ రెండు పదులు ★

జపించాడు. వేణుకు కాలు జణికింది. లేవ నేరక పోయాడు. ప్రయత్నం మీద లేచి మళ్ళా కూర్చుండి పోయాడు.

"అరె! లేవలేక పోతున్నారేం?" ప్రశ్నించిందా యువతి.

"కొద్దిగా కాలు..." అంటూ లేచాడు. అతడు పడిపోకుండా ఆమె సహాయపడింది. కాలు విదిల్చాడు. సరిఅయింది. కాని మోకాలు కొట్టుకుపోయి రక్తం వస్తోంది. ఆ ప్రదేశంలో బాధపెడుతుంది "అబ్బ!" అన్నాడు అప్రయత్నంగానే, ఆమె పరిశీలనగా చూచింది. జాలిపడింది.

"బాధ పెడుతూందా మోకాలు?"

"అబ్బే! అంతగా లేదు రూము కెళ్ళాక అదే సద్దుకుంటుంది"

"అలా కాదు. ఈ ప్రక్క వీధిలోనే మాయిల్లు. కట్టు కట్టుకుని వెళ్ళొచ్చు. అభ్యంతరం లేదుకదా?"

"పోనిపదండి."

ఆమె ఒకవిధంగా దారి చూపిస్తూ నెమ్మదిగా రమ్మని హెచ్చరిస్తూ తనింటికి తీసుకెళ్ళింది. వీధి సావడిలో దీపంముందు చాపపై కూర్చుని ఆమె చెల్లెలు చదువుకుంటూంది, కునికిపాట్లుకూడ పడుతున్నాయ్. తన్ను చూసీ చూడనట్లు ఊరుకుంది.

వంటింటి లోపలికి వెళ్ళాక ఆమె వాల్చిన పీటమీద చతికిలబడ్డాడు. గుడ్డను తడిపితెచ్చి "కట్టుకోండి. కాస్త చల్లనిస్తుంది" అని మళ్ళా వీధిసావడిలోకి వెళ్ళింది.

ఆమె ఆదరణకు తనుపూర్తిగా ఉబ్బిపోయాడు. సినిమాలలో యెన్నో విషయాలు జరిగేవి. వాటిని అసంభవమనే తెరతో కప్పివైచి అప్పటికిమాత్రం ఆనందానుభూతులపొంది వచ్చేసేవాడు. కాని యివాల్టి యీ సంఘటనానంతరం దానినే కోవలోకి కేటాయించాలో అంతుచిక్కటం లేదు.

తను యాంత్రికంగా ఆమెచేసే పనులను చూస్తూ కూర్చున్నాడు; ఒక ఆకువేసి అందులో రెండుపూరీలు ఉంచింది. ఎదురుగావచ్చి "పంచదార లేదు. బెల్లంకోరి వెయ్యమంటారా?" అడిగింది.

"ఏదీ అక్కరలేదు. వట్టివే తినెయ్యగలను."

"అహఁ అలావీల్లేదు. తినక ఆగండి"

తను ఆగిపోయాడు ఆజ్ఞాబద్ధుడై.

కత్తిపీటతెచ్చి యెదురుగా వేసి బెల్లం పొడిచేయటాన్కి పూనుకుని "యాదృచ్ఛికంగా తటస్థపడ్డ యీ సంఘటనవల్ల యిలా రాగల్గారు. జరిగిన యీ విషయాన్ని పునశ్చరణ చేసుకుంటుంటే నవ్వేవస్తూంది. ఇందులో ఫలానావారిది తప్పని యెన్నటాన్కి కూడా వీలులేకుండా పోతుంది.... అటూయిటూ చూస్తున్నారేవిటే? మా యిల్లూ ఒక యిల్లేనా? రోజుకో పెంకు చొప్పున రాలిపోతుంది. నేత సేయిద్దాం అనుకుంటే మాటలా, అందులోనూ మాలాటివారికి! కనీసం పచ్చకాగితం ఖర్చుపెట్టవలసిందే. అంతస్తోమత ఉంటే యింకనేం. ఎవడో కవిచెప్పినట్లు సూర్యచంద్రులు మమ్మల్ని సర్వకాలసర్వావస్థలయందు కనిపెట్టుకునే ఉంటారంటే అత్యుక్తి కాదేమో!" అంటూ ఆగింది. ఆ బెల్లపుపొడి అతడి ఆకులో వేసింది.

వేణు ఆమె వాక్చాతుర్యానికి ముగ్ధుడయ్యాడు. బెల్లానికద్దుకుని పూరీముక్క తింటూ "మీ పేరు?" అడిగాడు.

"కమల" అంది.

"చెప్తూ చెప్తూ ఆపుచేసేశారేం, చెప్పండి"

"నా గొడవ యెప్పుడూ ఉండేదే. మీరు తినటం మానకండి...ఇంకోటి కావాలన్నా వెయ్యలేను ముందే చెప్తున్నా" అంటూ కిలకిలా నవ్వింది.

వేణుకి వళ్ళు మండింది "నేనసలు మిమ్మల్ని పెట్టమని బ్రతిమాలానా? మీరే తెచ్చిపెట్టారు. పోనీ తినకపోతే బాధపడతారని తింటున్నాను. నాకు నిజంగా యివే యెక్కడంలేదు" ఆకు ముందుకు తోసాడు.

ఆమె తిరిగి ఆకుని అతడి ముందుకు నెట్టుతూ "తినేసేయండా ఒకటేను. ఏదో నవ్వులాటకే అన్నాననుకోండి; అంత మాత్రానికే యింతకోపం తెచ్చుకుంటే యెలా?" అంటూ సముదాయించింది.

తనతో తరాయి స్త్రీ తరాచి కాలకు వేణుకి సిగ్గేసింది. త్వరగా తినేసి లేచాడు.

మరోసారి ఆమె యింటికి వెళ్ళినప్పుడు పట్టుదలపట్టి ఆమె యింటి పరిస్థితులన్నీ చెప్పించుకున్నాడు. అవన్నీ ఆమె సాఫీగానే చెప్పింది. తనుమాత్రం గాబరాపడ్డ మాట వాస్తవం.

మధు ముఖ్యోద్దేశ్యం చదువే అయినా వాళ్ళ తల్లిదండ్రులు అతనికి పుష్కలంగా డబ్బు యిస్తారు. అతడితో తిరిగిన తిరుగుళ్లే చెప్తాయ్ ఆ విషయాన్ని. రూముదగ్గర బయలుదేరి బజారుకు వెళ్ళేటప్పటికే బడలిక వచ్చేసిందంటాడు. ఇంక ఆ బజారులో తిరిగిన కొద్దిక్షణాలూ అరగంటకు సార్లయినా కాఫీ తాగెయ్యాలి. వీటికి సాయం వారానికోసారి మాట్నీ ఫిల్ము యెలాటిదైనా సరే చూసేస్తాడు. ఇక అన్నిటినీ దాటి తలమించిన డ్రస్సులను వేయడం తను చూస్తున్నదే! అతడి దగ్గర తప్పకుండా డబ్బు ఉంటుందనే ఉద్దేశ్యంతోటే మధు రూముకి వెళ్ళాడు. కాని అబద్ధం ఆడినందుకు మనస్సు యిప్పటికీ పీకుతూనే ఉంది. తనకంతకన్న గత్యంతరం లేదుమరి. మామ్మగారు అద్దె యిమ్మని అడుగుతున్నమాట నిజమే. అంతకన్న కమలకీడబ్బుయిస్తే యెంతో ఉపయోగపడుతుంది. ఈసారి యింటినుంచి యింకొద్ది యెక్కువగా డబ్బు తెచ్చుకుంటే సరి. అన్ని గొడవలూ వదిలిపోతాయి.

ఇలా ఆలోచించుకుంటూ కమలయింటికి వచ్చాడు. కమల సావట్లో కూర్చుని బియ్యములో బెడ్డలు యేరుకుంటూంది.

"కమలా!"

తలెత్తి "ఉష్" మాట్లాడద్దు అన్నట్లుగా చేతితో సంజ్ఞ చేసి మూలనున్న చాప తీసుకుని పెరట్లోకి దారితీసింది. బూట్లు అక్కడ విడిచి ఆమె ననుసరించాడు.

పెరటి వాకట్లో చాప వేసి కూర్చోమంది. నేరేడుచెట్టు నీడలో వేసిందాచాప. ఆ చెట్టు గాలిప్రభావంవల్ల ఊగుతూంది. ఆ గాలి ఆకులలో చలనం కలిగింప చేసి మెల్లగా వారిని తాకి పరవశులను చేస్తూంది. చిన్న యిటుక తెచ్చుకుని అతడికభిముఖంగా వేసి దానిమీద కూర్చుని "నాన్న తెలివిగానే ఉన్నారు. అందుకే నిన్ను అట్టే పోదిపెట్ట నివ్వలేదు ఆయన సలే అనుమానం మనిషి. నే చేసే ప్రతిపనినీ చెల్లిముఖంగా విని తనలోతను గొణుక్కుంటాడు. అబ్బబ్బ! వీరిద్దరితోటి వేగలేక చావవుతూందనుకో... ఇంక యింట్లో పనే కాకుండా యీ ట్యూషన్లు ఒకటి. ఇప్పుడే వదుల్చుకొచ్చాను పనిని" ఆగింది.

"ట్యూషన్లా!... ఎంతదాక చదివావ్?"

"చదువులాగే ఉందిరాత! వీణను మా అన్నయ్య పట్టుపట్టి నేర్పించాడు. ఓరెండేళ్ళు వెలిగించాక మాగురువుగారే యిప్పించాడు పిల్లలగారింట చెప్పమని"

"ఎంతమందికి చెప్పాలిట?"

"ఎంతోమంది లేమన్నారు! ఇద్దరే యిద్దరు. ఒకత్తెకు పన్నెండేళ్ళు, రెండో

దాన్కి పదేళ్ళు. ఇద్దరూ ఆ ప్లీడరు రామనాథంగారి కూతుళ్ళే"

"ఎంతిస్తారేమిటి?"

"ఇరవై రూపాయలు నెలకి"

వేణు కొద్దిసేపలాగే కూర్చుని చివరకామె దిక్కు చూసి "నాకుకూడా నేర్పుతావా? నేనూ యిరవై యిస్తాను" అన్నాడు

"ఆఁ. నీకు నేర్పటానికేం! నువ్వుమాత్రం ముందు వీణకొనాలి. తర్వాత రోజూ రోజూ దీనికోసం రెండుగంటలు పాడుచేసుకోవాలి. ఈపితలాటంలో పడావంటే చదువు కొస్త సున్న" కిలాకిలా నవ్వేసింది.

ఈనవ్వుతో తనకి రెండోసారి పరిచయం. ఆనవ్వుకు తన నవనాడుల్లో పట్లు తప్పుతాయ్. అప్పటి ఆమోములోని ఆకాంతి నాస్వాదించటాన్కి తనకొక్కడికే అర్హత ఉందనుకుంటాడు

"పోనీగాని నాకు వీణనేర్పనూ వద్దు, నాచదువు పాడుకానూవద్దు. ఒక్కపాట పాడవ?"

"ఇప్పుడుకాదు మరోసారి పాడతాలే"

"కమలా! నిన్నే నే" అనే కేకకు అదిరిపడి "వస్తున్నా నాన్నా!" అనిగట్టిగా అని "ఉండు మానాన్నకేంకావాలో చూసి వస్తా" అంటూ లోపలకు వెళ్ళింది.

వేణుకి ఆమె సన్నిధిలో యెంతో సంతోషం. తండ్రి కసాయి ప్రవర్తనకూ, తల్లి పాడుమనస్తత్వానికీ మధ్య నలిగి యెంత సతమతమవుతోంది! సర్వాంగ సౌష్ఠవంశోభితమైన ఆమె సౌందర్యం యిలాగే యీ పనులతోటి యీ సేవలతోటి కృశించి పోవలసిందేనేమో! అనుకునేటప్పటికి అతనికి యేడుపువచ్చినంతపని అయింది. కమల పూర్తిగా అమాయకురాలని ఆతొలినాడే ఊహించుకున్నాడు మాయామర్మాల నెరుగని మందభాగ్య. ఆమె జీవిత పథం చక్కదిద్దగల సామర్థ్యం తనలో ఉందా? ఈ ప్రశ్నకు ప్రప్రథమంగా తన తండ్రి ప్రత్యక్షమయినంతపని చేశాడు. అవేమాటలు! అవే నీతులు! బలవంతంగా నైనాసరే తనకోర్కెలను తనలోనే దిగమింగుకోవలసిందే. ఆయన కసుగులూ మదుగులూ వత్తుతూ ఆయన ఆజ్ఞను అక్షరాలా ఆచరణలో పెట్టి ఆనందింపచేయవలసిందే! తను బి. ఏ. అంటూ చదువుతున్నాడుకదా అని తను స్వతంత్రశక్తితో ఏపనైనా చేయగలడా? కమల తనతండ్రి ఆదరం యెలా సంపాదించుకోలేక పోతుందో తనూ అంతేగా!

కమల గుసగుసలాడుతూ వచ్చి "చుట్టలు మానేయకూడదూ? ఊహుఁ అవి మానేస్తే యెలా? అగ్గిపెట్టె క్రిందపడేసుకున్నాడు. అది అందివ్వాల్సింది నేను నేనొకత్తె సున్నానుగా అన్నిటికీను! ఇంతకన్న ఎముకలతో సహా కొరుక్కుతినేస్తే వదిలిపోతుంది." అంటూ భారంగా శ్వాసవదిలి యిసుకమీద చతికిలబడింది.

"అలవాటు మనకది. ఆయనకా పసుగ్యాన్కి చుట్ట కాల్చుకోపోతే యెంతో బాధగా ఉంటుంది, పళ్ళు సలుపుతాయ్. అందుకనే నిన్న యీ కొంతవరకూ శ్రమ పెట్టాడు. చూడు! నేనూ అల్లాటప్పాగా చెప్పటం లేదు. అనుభవంమీదే చెప్తున్నాను." అంటూ సిగరెట్ వెలిగించాడు. "అన్నట్లు నీకీపొగపడకపోతే చెప్పేసేయ్ నిర్మొహమాటంగా. మానేస్తాను."

"అక్కర్లేదులే; అనుభవించు ఆ ఆనందాన్నేదో. నేనుకారణంగా నీపళ్ళు సలిపించటం నాకు మాత్రం బావుంటుందా?"

వేణు లోపలే నవ్వుకున్నాడు. అరక్షణం అతిక్రమించాక "అయితే నేను వీణ తర్వాత కొనుక్కుంటాగాని ముందు యీనెల అడ్వాన్సు యిచ్చెయ్యనా?"

కమల అధరాలను అల్లల్లాడించి "యిలాతే మరి" అంది.

పాంటు జేబులోంచి పర్సుతీసి రెండు పదికాయితాలు ఆమె చేతిలో ఉంచాడు.

"నెలకిస్తానన్నంత యిచ్చేసావే?" అంది కొంటెగా చూస్తూ.

"అవునుమరి. మళ్ళా యివ్వగలనో లేదో. డబ్బున్నప్పుడిచ్చేస్తే సరిపోతుందని."

కమల ఒకనిముషం తలవంచుకుని కూర్చుంది. అప్పటిలో యేమాలోచించుకుందోయేమో "నీ స్వభావం నాకు తెలుసు వేణూ; కాని నేనిప్పుడీడబ్బు తీసుకోదలుచుకోలేదు. మరోలా మనసులో పెట్టుకుంటే మాత్రం సహించేదిలేదు" అన్నది శాంతంగా.

వేణు అసలే అభిమానంగల మనిషి. ప్రతీ చిన్నవిషయంలోనూ అతడికా అభిమానం అడ్డుతగలటం సహజమయిపోయింది. కమల యీ మాటలకు ఏడుపు వచ్చేసింది కూడా.

"అరె! తీసుకోనన్నంతకే అంతలాగ అయిపోతే నేనేం అనుకోవాలి చెప్పు. ఛ! ఆడదానిలా యేడుపుకూడానా?" తన చీరచెరగుతో అతడి కన్నీటిని వత్తింది.

వేణు వల్లమాలిన అభిమానంతో కాస్త గాద్గదికంగానే "నేనెంత ఆప్తతో ఇచ్చానో ఆలోచించిఉంటే యింతగమ్మున నాకోర్కెను తిరస్కరించవు దీనికోసం యెంత కష్టపడ్డానో తెలుసా?" కంఠధ్వనిని మార్దవపరచుకుని బహుజాలిగా "మొన్న నీపరిస్థితి విన్నాక నాకెంతో బాధ అనిపించింది. నాకు తోచినసహాయం చెయ్య బుద్ధివేసింది. మానాన్న విషయం నీకిదివరకే చెప్పాను. మిత్రుడైన మధును చేరి యీ రెండునోట్లూ తీసుకున్నాను. అతని కేపోలెక్కా? కాని నాకుమాత్రం అది గొప్పగానే తోచింది. అతనైతే గొప్పవాడు. గొప్పకోసం కలవారు కొన్నికొన్ని పనులు చేస్తుంటారులే! తీసుకో మేతడవు యిక్కడకొచ్చాను... కమలా! నన్ను నమ్మినవాళ్ళదగ్గర, నేను నా సర్వస్వంగా భావించుకున్నవాళ్ళ యెదుట యేవిషయం దాచలేనంటే నమ్ము. నిన్నలాగే నేను నమ్మాను. నాలోఉన్న లోపమే అను మరేమను. నీముందుమాత్రం నే నేవిషయాన్నీ కప్పిపుచ్చలేను. దాచుదామన్నా దాగదుకూడా" అన్నాడు.

కమల కనిమిత్తంగానే కన్నీరు స్రవించింది. వేణు చూడకుండా దానిని కప్పిపుచ్చుకుంది. "నిన్నుమాత్రం బాధపెట్టడం నాకిష్టంకనక నా?... కాని ఎవరీ మధు? ఎక్కడ ఉంటున్నాడు?"

చెప్పాడు వేణు!

"అక్కా! నాన్న పిలుస్తున్నాడే" అన్న పిలుపుకు సింహాన్ని చూచిన కురంగంమాదిరిగా బెదిరిపోయింది కమల!

వేణు కమల నాస్థితిలో అర్థం చేసుకున్నాడు. కమలవెళ్ళిపోయిందక్కడినుంచి. ఆమెవద్ద సెలవు తీసుకోటానికైనా ప్రయత్నించక వెళ్ళిపోయాడు తొందరగా అక్కడినుంచి!

ఒకవారంరోజులకూ వేణుకోసం చూచి కమలకు కళ్ళు ఎరుపెక్కిపోయాయి జపాపుష్పాల్లాగ. వేణు ఎందుకు రావటం మానేశాడో బుర్ర బద్దలుకొట్టుకున్నా అర్థంకావటంలేదు. అస్తమానం అతడి రూపచిత్రీకరణతోటే సరిపోతూందికమలకు. పగటికలలెన్నో ఆమెను కలత తేర్చటానికి ప్రయత్నించి పరామర్శించి పోతున్నవి. అవస్థాభేదాలే తప్ప యేదో సమయంలో యేదోరూపంలో వేణు ప్రత్యక్షమవుతూనే ఉన్నాడు. ఒకసారి కోపంగానూ, మరోసారి శాంతంగానూ, ఇంకోసారి సంతోషంతోనూ, తక్షణమే పుట్టెడు విచారంతోనూ...ఇలా కన్పిస్తూవచ్చాడు. అస్తమానం అతడిగురించే ఆలోచనేమో ఒక్కొక్కప్పుడు అతడి ఆకారం యెలాటిదోకూడా ఊహకు తట్టటంలేదు!...వేణు యీ రాకపోటానికి కారణ

# ★ రెండు పదులు

తిలు చెల్లి లక్ష్మి, తండ్రే అని అనుకునేటప్పటికి వారిపై వళ్ళు తెలియని కోపం వచ్చింది.

అంతే యిక సమయాసమయ పరిజ్ఞానాన్ని కోల్పోయి తన పరాకుతో వారిని చికాకు పర్చేది. విసుగును వహించి వశం చేసుకుంది. సంస్కార విహీనాలుగా తయారయి ఆమె శీలాలు చిక్కుపడిపోయాయి. వేళకు యిన్ని మెతుకులు వాళ్ళకు వండి పారేస్తుంది. తనకి అన్నం ముందు కూర్చున్నా అట్టే సయించటం లేదుకూడ. ఎంగిలి పడాననిపించుకుని చేతులు తడిచేసుకుంటుంది. వేణుతో ది విరహం ప్రతిరోజూ విషం మింగిస్తూందామెచేత. వేదన పడుతుంటారు విషమ సమయాల్లో. కాని తన తపన లాటి దెవ్వరూ పొంద లేదేమో! ఆలోచనలలో ఆవేశం; ఆ వేదన ఒకొక్కప్పుడు ఆ వేశాన్ని దారితీస్తుంది, మరోకప్పుడు బాధ్యతలను తాత్కాలికంగా మరుగుపర్చి మర్చిపోనిస్తుంది. అలాటిదే యిప్పటి కమల అవస్థకూడ. వీణ నేర్పుతానని ఒప్పుకున్నప్పుడు మానేస్తూ తన అర్థం గాని ఆవేదనలను కారణంగా నిరూపించు దామంటే ఊరుకుంటారా? ఊరుకున్నా ఒకసారి రెండుసార్లు. కాని యిప్పుడు కమల పళ్ళినవాడు చెప్పటం అదినా సరైన స్థితిలో ఉంటే లేనివాడు లేనేలేదు. ఒకటి రెండుసార్లు ప్లీడరుగారు విసుక్కోడం కూడ ఆమె యెరుగున్నదే. దాని కామె బాధ్యురాలా? ఇలాగే జరుగుతే ఆ కాస్త ఆ సంపాదన పోతుందని ఆమెకు తెలుసు. అన్నీ తెలుసు. కాని యేం లాభం! దేవుడు చేసేది కొంత, మనం చేసుకునేది రెట్టింత!

కమల యివాళ కూడ ఆలోచిస్తూనే కూర్చుంది. స్కూల్ నుంచివచ్చిన లక్ష్మిని చూచి వెళ్ళి వంట వడిగా కానిచ్చింది. వీధిసావిట్లో కూర్చుని రాసుకుంటూన్న లక్ష్మి నుద్దేశించి "దీపాలు వెలిగించు లక్ష్మీ! వంట అయిపోయింది. భోజనం చేద్దువుగాని" అంది యెంతో ఆప్యాయత ఉట్టిపడేట్లా.

లక్ష్మి భోజనానికి కూర్చుంది.



"నీ అక్కకు ఒకపని చేసిపెట్టవూ?"

"అలాగే. చెప్పదేమిటో"?

మధు ఉంటూన్న వీధిని చెప్పి, వేణు చెప్పిన విధంగా యింటి ఆనవాలు కూడ చెప్పి "ఆ యింట్లో నే ఉంటాడాయన. పనుందని యిక్కడికి తీసుకు వస్కారా. రానంటే మా అక్క తీసుకురమ్మందని చెప్పు ఎవరో అనుక్కుని తప్పకుండా వస్తాడు. ఏం?"

లక్ష్మి మజ్జిగలోకి అన్నాన్ని లాక్కుంటూ "ఒకవేళ నీపేరడిగితే చెప్పాలా?" ప్రశ్నించింది.

కమల మందహాసంతో "చెప్పే చెప్పు. చెప్పినంతమాత్రాన అర్థం చేసుకోలేడు. అర్థం చేసుకోటానికి నన్నెరుగును కన్కానా?" అన్నది.

"నువ్వు ఆయన్నెరగనంటావ్. ఆయన నిన్నసలే ఎరగడు మరి"

"తర్వాత నీకే తెలుస్తుందిలే తమాషా!"

లక్ష్మి బయలు దేరుతూ "మరి వెడుతున్నానేవ్?" అంటూ కేకేసింది. కమల లక్ష్మిని సమీపించి "రానన్నా పట్టి తీసుకురావాలి సుమా...అన్నట్లు యిల్లు జ్ఞాపకం ఉందా?"

"ఓఁ" అంటూ లక్ష్మి పరిగెత్తింది.

మొదటగా మధురాగానే వేణు అతడి నుండి తెచ్చి తనకిచ్చిన డబ్బు ఆయనకిచ్చేయాలి; రెండవది, వేణుగురించి అతగాడి అనుకునే లక్ష్మిని పంపించింది. తన చెల్లి ముందు తనొక చంటిపిల్లకన్న నీచంగా ప్రవర్తించినందుకు సిగ్గేస్తుంది. తన ఆత్రతను అరికట్టుకునే శక్తిలేదు ఆత్మీయుల అవసరమొస్తే యెంతి అనర్థమైనా చేయిస్తూంది. అందులోనూ కాముకుల విషయంలో చేయకూడనిదనేమాటే ఉండదు అనర్థం కలుగుతే ఆ జన్మాంతం దాని ప్రతిఫలంగా నాశనమవుతారు; అనుకూలంగా జరుగుతే జీవిత పథాలను పువ్వులతో నింపుకుని మధురాతిమధురమైన అనుభూతులను పొంది అమేయానందాన్ని పొందుతారు!

అరగంట గడిచింది. ఇంకా మధుకోసమై పంపిన లక్ష్మి తిరిగి రాలేదు, ఏం చేసిందబ్బా?

కమల విధిగుమ్మంలో నుంచుని వచ్చేపోయే జనాన్ని పరకాయించి చూస్తూంది. ఈ వీధికి నూటికీ కోటికీ ఒక రిక్షా వస్తుంది ఆ తల యిళ్ళకు అల్లుళ్ళు వచ్చేలాగే! అలాటి దానిలో వైపరీత్యం? రిక్షా తమ యింటికేసే వస్తూంది. కొంపతీసి లక్ష్మి ఆయనతో కలిసి అందులో రావటం లేదుకదా!

అనుకున్నట్టుగానే ఆ రిక్షాలోంచి లక్ష్మి. "ఈ ఇంటిదగ్గరే ఆపు అబ్బాయ్!" అంటోంది

కమలగుండె అలారం గ్రమోతను జపియిస్తూ వేగంగా కొట్టుకుంటూంది! మధు రిక్షాలోంచి దిగాడు. ఎవరు తనను పిలిపించారో తెలుసుకో తహ తహ పడుతున్నాడు!

"అదుగో మా అక్క గుమ్మం లోనే నిల్చుంది"

విధిగుమ్మం లైటు పెద్దదిగా చెయ్యబడి ప్రకాశిస్తూంది. మధు ఒకొక్క మెట్టే యెక్కుతున్నాడు. ఆఖరు మెట్టు యెక్కగా తలవంచుకునే ఉన్నవాడు అప్పుడు యెదురుగా ఉన్న యువతిని చూచి నిశ్చేష్టుడయ్యాడు!...అతడు చూస్తుండగానే ఆమె సొమ్మసిల్లిపోతూ నిల్చున్నపళంగా పడిపోయింది.

"అక్కా!" లక్ష్మి అరిచింది తెంతే తెలిపోయి.

"ఏమిటే ఆ అరుపు! ఏం జరిగింది?" గుడ్డాయన లోపలనుంచి కేకేసారు.

"ఏం జరగలేదని చెప్పు లక్ష్మీ!...ముందు నువ్వో గ్లాసులో నీళ్ళు తే" అన్నాడు మధు లక్ష్మి నుద్దేశించి.

మధు శైత్యోపచారాలతో కమలకు తెలివి వచ్చి కూర్చుంది. మధు యెదురుగా ఉండటం చూచి లేచినిల్చుంది... ప్లీడరు కొడుకు! వీరా నా వేణు స్నేహితులు! ఇంట్లో చెల్లెళ్ళ రభసయెక్కువని వేరెకూము తీసుకున్నట్లు తెలుసు;- వేణు మధు గొప్ప వాడని చెప్పాడు అప్పుడప్పుడు, ప్లీడరుగారిక్కడ డబ్బు కోకొల్లలు, మరి ఆయన కొడుకో యువరాజు! వారానికొకసారి అందులోనూ ఆదివారంనాడు మట్టుపుమాపుగా యింటికి వచ్చేవాడు. అతడి చెల్లెళ్ళకి తను యథాప్రకారంగా వీణ నేర్పటానికెళ్ళేది. తమకంతో నిండిన చూపులతో తనకేసి తదేకంగా చూచేవాడు పనున్నా లేకపోయినా ఆగంటా అక్కడే కూచునేవాడు.

"క్షమిస్తారనుకుంటా; నేనేమీ భూతాన్నీ, పిశాచాన్నీ కాను. మీరు నన్ను గురించి చిత్రించుకున్నంత అవమానముడిని కూడ కానని మనవి చేయాల్సి వస్తూంది.. ... నన్నెందుకు పిలిపించారో చెప్పే."

కమల అతడి మాటలకు నఖశిఖపర్యంతం కంపించిపోయి "నే ననకున్నది మీగురించేగా. ఇంకో మధు. మన్నించండి, మీకు చెప్పేదదేలేదు" అని వంటింటివైపు వెళ్ళిపోయింది

"ఎవరా నాయనా! ఇలారా." కమల తండ్రి కేకేసాడు. మధు అంతవరకూ అచేతనుడిగా ఉన్నవాడు ఆ కేకకు తెప్పరిల్లి కమలతండ్రి ఉన్న గదిలోకి వెళ్ళాడు గడ్డం కింద చేతిని ఉంచుకుని. కమలతండ్రి అతడు వచ్చినట్లు అర్థంచేసుకుని "అలా మంచం

(40-వ పేజీ చూడండి)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

## 3

తాజ్ మహాల్ హోటల్లో భోజనం చేసి, కడుపునిండిన ఆనందంలో దినమంతా పడిన శ్రమ మరిచి, వీధిలోకి వచ్చాడు, శివరాం. కిళ్ళీ కొట్టు దగ్గర కొంచెం నిలబడి మద్రాసు సాదా కిళ్ళీ ఒకటి బిగించాడు. స్వతంత్ర జీవనం సాగిస్తున్న శివరాం సిగరెట్టు ముట్టించాడు నిస్సంకోచంగా, నిర్భయంగా. ఒంటరి బ్రతుకులో, స్థిరత్వము ఏర్పడి కొంత స్వేచ్ఛ కలిగినప్పుడు, మనస్సులో ఉన్న కోరికలు అణచుకోవడం పొరపాటని అనిపించింది. స్వేచ్ఛాజీవితంలో కోరికలను తీర్చుకోవటం ద్వారా కలిగే మానసిక చైతన్యం, సంతృప్తి నియమిత సూత్రాలు పాటిస్తూ జీవితం మధ్య హద్దులు సృష్టించుకుని, బ్రతికేవారికి ఎన్నడూ లభ్యం కాదని యీమధ్య తన జీవితంలో కలుగుతున్న మార్పులు నిర్ధారణ చేస్తున్నాయనే విశ్వాసం శివరాంకు కలిగింది.

జీవితంలోని విషాదానికి సుఖాలకు వ్యక్తి మానసికంగా కల్పించుకునే దృక్పథమే కారణం. ఆర్థిక బాధలు తన జీవితంలో యింకా ఉన్నా, ఒక పూటైనా సంతృప్తిగా భోంచేసి, సరదాగా గడపాలని తాజ్ మహాల్ లోకి వచ్చాడు శివరాం.

తాజ్ వీధి ద్వారం పైన కట్టిన ఇంగ్లీషు అక్షరాల పెద్దబోర్డు, విద్యుద్దీపాల కాంతిలో ప్రకాశవంతంగా బాటసారులను ఆకర్షిస్తోంది. నడిచే జనం హోటల్లోని క్రొత్తరకం రుచికర భోజనాన్ని ఒక్కసారి ఊహించుకుంటూ, పైసలు లేని జేబులు ఒకసారి తడుముకుని నడిచిపోతున్నారు. రోడ్డు మీద యిరువైపుల వరుసగా నిలుచున్న విద్యుద్దీపాలు దూరంపోగా చిన్న చిన్న చుక్కల్లా కనిపిస్తూ ఆకాశతారలతో పందెం కట్టి నిలబడినట్లున్నాయి. హోటలు ఎదురుగా, శాఖలు వ్యాపించి నిలుచుని సోయగంగా ఊగుతున్న రావిచెట్టు గాలి ప్రసారం చేస్తూ, హోటల్లో భోజనం చేసి వచ్చిన వారికి వింజామరలు పట్టినట్లు కనిపించింది.

'రుచికరమైన మంచి ఆహారమిచ్చే హోటళ్ళు ఉంటే సంసార లంపటాలు మాని ఒంటరి బ్రతుకులు హాయిగా గడుపుకోవచ్చు,' అనుకుంటూ తాంబూల సుగంధ ద్రవ్యపరిమళంలో మత్తెక్కిన సంతృప్తితో శివరాం నవ్వుకున్నాడు. నగరానికి వచ్చిన తన జీవితంలో కలిగిన అనుభూతులు, అనుభవాలు అతనికే ఆలోచిస్తాంటే ఆశ్చర్యం కలిగించాయి. క్రొత్త ప్రదేశంలో క్రొత్త జీవితం దిద్దుకోవాలంటే, పొట్ట సుఖంగా నింపుకోగలిగే జీవనోపాధి చూసుకుని స్థిరపడటం, అది ప్రాతిపదికగా చేసుకుని జీవిత లక్ష్యాలను అనుగుణమైన వాతావరణం సృష్టించుకుని సాహసంగా, ధైర్యంగా ముందడుగు వెయ్యటం ముఖ్యం. మొదటిదానిలో ఒకవిధంగా కృతార్థుడై, జీవితగమనంలో ఒక ప్రాతిపదిక ఏర్పడినందుకు కొంత సంతృప్తి శివరాంకు కలిగింది. ప్రతీమానవుడు జీవనోపాధి ఏదోవిధంగా కొంత శ్రమపడి సంపాదించుకుంటాడు. లక్ష్య నిర్ణయం చేసుకుని జీవితాన్ని తీర్చి దిద్దుకుంటూ, సాహసిక జీవితం గడపటమే వింత విద్య. ఈ వింతవిద్య సాధించాలనే పట్టుదల శివరాంలో ప్రబలమయింది.

అనేక జీవితచరిత్రలు పరిశీలిస్తే వ్యక్తులు సామాన్య జీవితంనుంచి ఎన్నో దశలు ధైర్యంగా దాటి ప్రపంచాన్ని ఆకర్షించే ఔన్నత్యం పొందగలిగిన ఉదాహరణలు శివరాం దృష్టిలో మెదిలాయి. మనిషి మానసిక శక్తికి ఏమీ అడ్డురాలేదనే విషయం, మునుపటి జీవితాన్ని పూర్తిగా మార్చి ఏవో ఘనకార్యాలు చేయాలనే ఆకాంక్షను అతనిలో ప్రేరేపించింది. అందుకు సాధనాలు అన్వేషించాలనుకున్నాడు శివరాం.

శారద శివరాం ఆలోచనల్లో కదలింది... ...ఆమె ఎక్కడుందో?... ఒక నెల క్రితం రాజారావుతో చార్మినార్ వెనుక ప్రాంతాలకు వెళ్ళినప్పుడు కనిపించిన అమ్మాయి సరిగా శారదలాగే ఉంది .... కాని పేరు వేరు... అయినా పరపురుషుణ్ణి ప్రేమించి లేచిపోయిన శారదకు తనమీద మక్కువ ఉందని గాని, ఇకముందు కనిపిస్తుందని గాని కనిపించినా ఇద్దరూ ఆనందంగా పలకరించుకుని, కలిసి బ్రతికే అవకాశం ఉంటుందని గాని, శివరాం ఆశించలేకపోయాడు. ఒక్క జ్ఞాపకం... ఆమె మీద ప్రబలమైన ప్రేమ జీవితంలో మధురంగా గడిచిన ఒక సంవత్సరం... మరుపురానివై పోయాయి. అది ఒక దశ... ...శివరాం ఒక నిట్టూర్పు విడిచాడు.

రాత్రి తొమ్మిదిగంటలయింది. టీస్స్ట్రీటు దాటి వల్లభ్భాయిని సందులోకి మళ్ళాడు శివరాం. ఆఖరయిపోయిన సిగరెట్టుముక్కను ఆలోచనల వేగంలో విసిరివేశాడు. పైకి చూశాడు. చంద్రుడు లేని ఆకాశం తారల తళుకులతో వయ్యారంగా వంగి చూస్తోంది శివరాం వైపు.

తలుపు కొట్టాడు శివరాం. పొడిగా, బొద్దుగా చామనఛాయగా తెల్లటి చీర కట్టుకుని, జడలో మల్లెపూలు తురుముకుని చేతిలో పాన చెంబుకుని యింటి వారి కోడలు తలుపు తీసింది నవ్వుతూ. శివరాం తల వంచుకుని ముభావంగా వరండాలోకి నడిచి, ప్రక్కనే తన గది తాళం తీయడానికి ఉపక్రమించాడు. కోమటి కోడలు వీధి తలుపు మళ్ళీ గడియవేసింది.

"తాళం కనిపిస్తోందా, లైటు వేయమంటారా?" కోమటి కోడలు నవ్వుతూ వరండాలోని విద్యుద్దీపాన్ని వెలిగించింది.

'అక్కర లేదు అక్కర్లేదులెండి!' ముక్తసరిగా సహజమైన బిడియంతో గదిలోకి నడిచాడు శివరాం. 'మీరు హోటల్లో తింటుంటారు ఒంటరిగా ఉన్నారు. రోజూ యిలా ఆలస్యంగా యింటికి వస్తుంటే ఆరోగ్యం పాడవదండీ!' సాగదీసింది కోమటి కోడలు. ఆ మెరుపుకు శివరాం నవ్వేశాడు.

శివరాం మూడు నెలల క్రితం ఆ కోమట్ల యింట్లో ఒకగది పదిరూపాయలకు అద్దెకు తీసుకున్నాడు. వరండా వెనుక భాగంలో మరో కుటుంబం కాపురముంటున్నారు. కానీ యీ మధ్యనే గోముల సీమలోని స్వగ్రామానికి వెళ్ళారు, కొన్నాళ్ళు అక్కడే ఉండి వస్తారని. ...యింటిలో మిగిలినవారు కోమటి

# ★ అన్వేషణ ★

కోడలు, భర్త, ఆమె అత్త కాపురముంటున్నారు. ఇంటి యజమాని, ఏదో కంపెనీలో పనిచేస్తున్నాడు. రాత్రి యింటికివచ్చాక ఏవో కబుర్లు చెప్పడం నే అలవాటు ఉండేది శివరాంకు, అతనికీ. వారిద్దరి మధ్య మాటల్లో ఏదో కలగజేసుకుని కోమటికోడలు తన తెలివి కూడా చూపిస్తూ భర్తచేత ప్రోత్సాహం పొందుతూ శివరాంకు కొంత చనువు సంపాదించుకుంది. ఈరోజే ఇంటి యజమాని కనిపించకుండా కోమటి కోడలు ఒకర్తె సింగారించుకుని కనిపించడం శివరాం తలపులను కొంచెం చెదరగొట్టిన మాట వాస్తవం. 'మీవారు యింట్లో లేరా?' యథాలాపంగా వేసిన ప్రశ్నకు కోమటికోడలు చురుకుగా మెరుపు చూపు చూసింది.

"ఏదో పనిమీద బెంగుళూరు వెళ్ళారు. రెండు రోజుల్లో వస్తారు...అత్తయ్య నిద్రపోతోంది! అంటూ కోమటికోడలు వరండాలోని సోఫాలో మేను వాల్చింది చంటపిల్లతో. శివరాం ఇంకా మాట్లాడకుండా గదిలోపలికి వెళ్ళి గుడ్డలు మార్చుకుని, బెడ్డింగు వరండాలో వేసుకున్నాడు పడుకుందామని. కోమటి కోడలు చంటిపిల్లనెత్తుకుని మేడమీదకు వెళ్ళిపోయింది.

కాళ్ళుచేతులు చన్నీళ్ళతో కడుగుకుని పక్క పరుచుకుని విరామంగా శయనిద్దామని మేను వాల్చాడు శివరాం. గదిలో ఉన్న ఒక కథలపుస్తకం తెచ్చుకుని పేజీలు తిరగవేస్తున్నాడు.

"సాయంత్రం మీరు బయటికి వెళ్ళిపోయాక మీకేవో ఉత్తరాలు తెచ్చేడు పోస్టుమేన్!" కోమటికోడలు ఉత్తరాలు అందించింది.

మధ్యాహ్నంవచ్చి ఉత్తరాలు యిచ్చి వెళ్ళే పోస్టుమేన్ సాయంత్రం ఆలస్యంగా వచ్చేడు కాబోలు అనుకుని సమాధాన పరుచుకున్నాడు శివరాం. ఉత్తరాలు విప్పాడు. ఒకటి తాతయ్య. మరొకటి అన్నగారు వ్రాసేరు.

'ఎవరిదగ్గరనుంచి ఉత్తరాలు!" సన్నని స్వరంలో పలుకుతూ సాగదీసుకు నవ్వింది కోమటి కోడలు.

శివరాం ఉత్తరాలుచదవడంలో నిమగ్నుడై సమాధానమివ్వలేదు. బ్రహ్మయ్యగారు మనుమడిక్షేమసమాచారాలు ప్రశ్నిస్తూ ఒకసారి సెలవు చేసుకుని యింటికిరమ్మని, తల్లి అతన్ని చూడాలంటోందని వ్రాశారు. నూటయాభై రూపాయలు ఉద్యోగం లభించినందుకు శివరాంను అభినందిస్తూ, పిల్లల చదువులవల్ల, భార్యకు అనారోగ్యంవల్ల యీ మధ్య యింటిఖర్చులు బాగా పెరిగిపోయాయని, వీలైతే అప్పుడప్పుడు ధనసహాయం చేయవలసిందని కోరుతూ అన్నగారు వెంకటేశ్వర్లు వ్రాశాడు. భార్య కాపరానికి వచ్చాక తనజీతంతో స్వేచ్ఛగా బ్రతకాలని తాతయ్యను వదిలి మరోవూరు బదిలీచేయించుకుని, స్వార్థంగా బ్రతుకుతున్న అన్నగారు తనజీతం చూసి కళ్ళుకుట్టి మెల్లిగా మచ్చికలో అనుభవించాలని చేస్తున్న ప్రయత్నమే ఆ ఉత్తరమని నవ్వుకున్నాడు శివరాం. మనుష్యుల మనస్తత్వాలు జాగ్రత్తగా అవగతం చేసుకున్నా, వారిప్రవర్తన తనకు హానికలిగించనంత వరకు వారిజోలికి పోకూడదనే స్వభావం అతనిది. ఉత్తరాలు మడిచి తలగడక్రింద పెట్టుకున్నాడు శివరాం.

"కాస్త ఫలహారం చేస్తారూ!" కోమటికోడలు వయ్యారంగా నడిచి ఆపిలుముక్కల ప్లేటు శివరాం ఎదురుగా ఉంచింది.

"అబ్బే!...ఇప్పుడేమీవద్దండీ!" శివరాం మొహమాట పడ్డాడు.

"ఫరవాలేదు!... తినండి!" అనునయంగా చెప్పింది కోమటికోడలు...

"ఆయన లేకపోతే ఏమీ తోచదండి... ఇంట్లోవుంటే ఏవోకబుర్లు చెబుతూ అల్లరి చేసేవారు...మీకు అప్పుడే నిద్రవస్తోందా.. పోనీ కేరమ్సు ఆడుకుందామా!" కోమటి కోడలు ఒళ్ళువిరుచుకుని శివరాంవైపు జాలిగా చూసింది.

"అప్పుడే పదిగంట లవుతోంది...నిద్రపోవాలి...అయినా యిప్పుడు ఆటలాడ్డం ఏమిటి?" చిరాకుగా అన్నాడు శివరాం.

ఒకనిమిషం నిశ్శబ్దం.

ప్లేటులోని యాపిలుముక్కలు కాళీ చేశాడు శివరాం.

"పోనీ!...ఆ కథలపుస్తకం చదవండి... కాస్సేపు వింటాను!" కోమటికోడలు శివరాం దగ్గరగా వెళ్ళికూర్చుంది.

జీవితంలో యితరస్త్రీ సాంగత్య మెరుగని శివరాం కోమటికోడలు ప్రవర్తనకు భయంతో చికాకు పడ్డాడు.

'నాకు తలనొప్పిగా ఉందండి...నిద్రపోవాలి!' మాటలు నమిలేడు శివరాం.

"అమృతాంజనం తెచ్చి తలకు వ్రాయమన్నారా?" కోమటికోడలు ఒక్కగంతులో మేడమీదకు రివ్వున వెళ్ళిపోయింది.

శివరాంగుండె దడదడలాడింది. ఆ యింట్లోకి వచ్చాక ఇంటి యజమాని తన్ను చాలా ఆదరణతో చూస్తున్నాడు. తరుచు మలేరియా జ్వరాలతో ఆరోగ్యము బాగుండనప్పుడు ఆయన స్వయంగా తన్ను డాక్టరు దగ్గరికి తీసుకవెళ్ళి మందు యిప్పించేడు. ఇంట్లో పథ్యంగా భోజనం ఏర్పాటు చేశాడు. ఏమి అవసరం వచ్చినా యిట్టే సహాయంచేసే ఔదార్యం చూపించిన ఇంటి యజమానికి ద్రోహం చెయ్యడం నీచమనిపించింది శివరాంకు.

వరండాలో లైటు ఆర్పేసి, దుప్పటి ముసుగుపెట్టి పడుకున్నాడు.

కోమటికోడలు అమృతాంజనంతో వచ్చింది. వరండాలో చీకటి ఆవరించి ఉన్నందుకు కొంచెంజంకి శివరాంను పిలిచింది. శివరాం మాటాడలేదు.

'కోపమా!' సొగసుగా అంటూ ఆమె అమృతాంజనం శివరాం ప్రక్కదగ్గర ఉంచి కథలపుస్తకం తీసుకుని, వరండాలో లైటు వేసుకుని సోఫాలో కూర్చుని పేజీలు తిరగవెయ్యసాగింది. తన ప్రవర్తన అర్థంచేసుకుని శివరాం ప్రక్కమీదనుంచి లేస్తాడని ఆశించింది ఆ యువతి.

"అదంతా నిద్రే కాబోలు!...ఏమండీ!" పకపక నవ్వింది కోమటి కోడలు. శివరాం మౌనంవహించాడు. సన్నివేశం ప్రోత్సాహకరంగా కనిపించనందుకు కోమటి కోడలు మరో ముందడుగు తక్షణంవెయ్యడం భావ్యం కాదనుకుని పుస్తకం పేజీలు తిరగ వెయ్య

సాగింది. ఒక్క అరగంటలో శివరాం గుర్రు వినిపించింది. కోమటి కోడలికి ఉపద్రవమైన కోపం వచ్చింది. కథల పుస్తకం రివ్వున నేల మీదకొట్టి వరండాలో లైటు ఆర్పి మేడ మీదకు పోయింది.

దుప్పటి ముసుగు చీకటిలో ఆలోచనలు బంధించి నిద్రపోయిన శివరాంకు రాత్రి రెండు గంటలకు మెలకువవచ్చింది కోమటి కోడలు సన్నివేశం జ్ఞాపకం వచ్చింది. నవ్వుకున్నాడు శివరాం. మంచి నీళ్ళు త్రాగాలని లేచి కూర్చున్నాడు.

వరండాలో హఠాత్తుగా లైటువెలిగింది. కోమటి కోడలు ప్రత్యక్షమయింది. నలిగిపోయిన చీరతో, చెదిరిన శిరోజాలతో నిద్రలేని కళ్ళతో జడలు నలిగిపోయి గుప్పున సువాసనలు వెదజల్లుతున్న మల్లెపూల గుత్తులతో కోమటి కోడలు వీధితలుపు తీసింది. వీధిలోని శూన్యంలోకి చూస్తూ, "మంచి నీళ్ళు యిమ్మన్నారా?" ప్రశ్నించింది కోమటి కోడలు శివరాంను.

గదిలో కూజాలోని నీళ్ళు త్రాగి మౌనంగా బద్ధకంగా పడుకున్నాడు శివరాం.

ఒక అయిదు నిమిషాలు కోమటి కోడలు వీధిలోని చీకట్లోకి నిశితంగా చూసింది. చంద్రవంక కొంటెగా ఆకాశంలోంచి ఆమెను చూసి నవ్వినట్లనిపించింది. కోమటి కోడలు కోపం ఆపుకోలేక, వీధి తలుపు ధడీలుమని మూసి, రుస రుస లాడుతూ, పాదాలు నేలమీద బరువుగా బాదుకుంటూ మేడమీదకు పోయింది.

శివరాంకు యింక నిద్రపట్టలేదు. కోమటి కోడలికి నైరాశ్యం కలిగించడంలో తానేమీ అన్యాయం చెయ్యనట్లు భావించాడు. జీవితంలో కనిపించే ప్రతీ స్త్రీని, ప్రతీ పురుషుడు ప్రేమించడం కష్టం. ఒకసారి ఒక స్త్రీని ప్రేమించాక పరస్త్రీలపై దృష్టి నిలపడం, ప్రేమను అర్థంచేసుకున్న ఎవరికైనా దుస్సాధ్యం. అయిన తనజీవితంలో శారదతో జరిగిన సంఘటనలు స్త్రీపైనే ఏహ్యభావం కలిగించాయి శివరాంలో. లక్ష్యాలు ఏర్పరుచుకుని, జీవితాన్ని ఆలక్ష్యసాధనకు అంకితం చెయ్యాలంటే, బ్రతుకుదారిలో అధఃపతనానికి ఈడ్చే యీ సామాన్య ఆకర్షణలకు అందకుండా నిగ్రహశక్తి అలవర్చుకోడం మంచిదనుకున్నాడు శివరాం. వీలైతే త్వరలో యీ గదిమార్చి మరోచోట నివసించడం ఉచితమనిపించింది శివరాంకు.

ఆరునెలల నగరజీవితం శివరాం బ్రతుకులో, భావాల్లో విపరీతమైన మార్పు తెచ్చినమాట వాస్తవం. నిద్రరాక పొడి కన్నులుపడిన శివరాంముందు జరిగిన చరిత్ర సినీమాలా కదిలింది...ఆ రోజు స్టేషను విడిచి హోటల్లో ప్రవేశించాడు. మధ్యాహ్నం స్నానభోజనాదులు పూర్తిచేసి, ఒక కునుకు తీసి లేచాడు. చేతిలోఉంటే డబ్బుతో చాలాకాలం హోటల్లో ఉండే స్తోమత తనకు లేదు. ఏదో ఒక ఉద్యోగం ముందు సంపాదించుకోవాలనుకున్నాడు శివరాం.

మాసిపోయిన రైలు ప్రయాణపు దుస్తులు మూలపడేశాడు జేబులోని కాగితంలో ఒక బంధువు చిరునామా ఉంది...తన తల్లి యిచ్చింది యీ నగరానికి వచ్చేముందు... తన పెత్తండ్రి మనుమడు రెజిమెంటల్ బజారులో ఒక ఇంట్లో ఉంటున్నాడు. బంధువుల మనస్తత్వాలు బాగా ఎరిగిన శివరాం, ఆయనవల్ల తనకు ఉపకారం జరుగుతుందనే ఆశ లేకపోయినా, ఒకసారి యిల్లుపట్టుకుని అతన్ని చూడడంలో నష్టం లేదనుకున్నాడు. పరుపుచుట్టలో నలిగిపోయిన ఒక లాగు, చొక్కా తొడుక్కుని బయలుదేరాడు.

నగరంలో క్రొత్త స్థలం కనుక్కోవడంలో తారసిల్లే వ్యక్తులు, తిరిగే సందుగొందులు, ప్రతియింటివైపు క్రొత్తగా చూస్తూ నడవవలసిన అవసరం శివరాంకు కొంత తమాషాగానేఉంది. చివరకు తల్లి చెప్పినబంధువుయిల్లు పట్టుకున్నాడు శివరాం.

వీధి గుమ్మము తెలియక దొడ్డదారిని అడుగుపెట్టాడు శివరాం. కుళాయిదగ్గర దాసీది గిన్నెలు తోముతోంది. పదునిమిదేళ్ళ జవ్వని ఒకతె దొడ్లో తిన్నె మీద ముస్తాబై కూర్చుని అల్లికలు కుడుతోంది. ఒక బట్టతల తాతగారు ఇంట్లోంచి ఏదో అరుస్తున్నారు. దొడ్డి గుమ్మంలో నిలుచున్న శివరాంను చూసి కోపంగా ఇంట్లోంచి పరుగెత్తుకు వచ్చారు బట్టతలతాతగారు, "ఏం కావాలి?" అంటూ. ఆయన ప్రశ్నలో "యీనగరంలో వివిధ రూపాల్లోవచ్చే గుండాగిరీలో నువ్వు కూడా ఒకడవా నాయనా" అన్నట్లు తీవ్రమైన చికాకు కనిపించింది

"నారాయణగారి యిల్లు యిదేనాండి?"

'ఏ నారాయణగారు?...యీ వూళ్ళో లక్షలొంది నారాయణలు ఉన్నారు. నల్లగా పొడుగ్గా ఉంటారు...ఆయనేనా?' ముసిముసి నవ్వులు నవ్వారు, బట్టతలతాతగారు తనకోపంఆకస్మికంగా మార్చుకుని.

"అవునండి!" అన్నాడు శివరాం! తనకు కనిపించబోయె బంధువు రూపము పూర్తిగా ఎరుగకపోయినా.

'మేడమీదకు వెళ్ళండి.!" బట్టతల తాతగారు ఏదో ఖులాసాగా ఒక్కసారి శివరాం వైపు చూశారు.

"సత్తెమ్మా! మీ యింటికి ఎవరోవచ్చారు." గట్టిగా అరిచారు, తాతగారు.

శివరాం మెల్లిగా మేడ ఎక్కాడు. ముందు డాబా చుట్టూ గదులు ఉన్నాయి. ఒక మూలగా ఉన్న కుళాయిదగ్గర, బిందెలోకి నీళ్ళు పడుతున్న సత్తెమ్మ చెంగున గెంతుతూ ముందుకు వచ్చింది.

(81-వ పేజీ చూడండి)

# మీ రెవరో మీ

# మీనమ్మకాలకు గీటు



పరిశ్రమలను జాతీయం చేయాలా, అక్కర్లేదా? యుద్ధంలో ఆటంబాంబులు వేయవచ్చునా, కూడదా? స్త్రీ పురుషులకు సమాన కామస్వాతంత్ర్యం ఉండవచ్చునా, కూడదా? ఇలాంటి రాజకీయ, సాంఘిక, నైతిక సమస్యలెన్నో నిత్యం మనకెదురవుతూ ఉంటాయి. ఒక వ్యక్తి ఆర్థిక స్థాయినిబట్టి, వ్యక్తిత్వాన్నిబట్టి ఆయా సమస్యలపట్ల ఆ వ్యక్తికి నిశ్చితాభిప్రాయా లేర్పడతాయి. ఇలాంటి అనేకాభిప్రాయాలు కలిసి ఒక వ్యక్తి సాంఘిక దృక్పథాన్ని నిర్ణయిస్తాయి. వేరు వేరు సాంఘిక దృక్పథాలకు సిద్ధాంతస్థాయిలో ప్రాతినిధ్యం వహించేందుకు వివిధ రాజకీయపక్షాలు బయలుదేరుతాయి. ఒకే పార్టీకి చెందినవారైనా వివిధ వ్యక్తుల అభిప్రాయాలు పరిశీలిస్తే ఎన్నో తేడాలు కనిపించవచ్చు. కాని భిన్నాభిప్రాయాలన్నిటినీ సంఘటితంచేసి సిద్ధాంతంగా రూపొందించే పని రాజకీయపక్షానిది.

మీరు కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు

ఏ పార్టీవారైనా కావ
ఎన్నికల్లో ఓటు చెయ్యవచ్చు
సిద్ధాంతానికి మీ వ్య
మీకే ఆశ్చర్యం కలిగేట
వచ్చు. ఆ తేడాలు తెలుస
ప్రశ్నలు సహాయం చేస్తా
అయా సాంఘిక స్వభావ
వారు సాధారణంగా ఫలిత
60 ఈ క్రింద ఇస్తు
విద్యాలయంలో
ఉంటున్న హెచ్. జె. ఐ
పుస్తకంలోని ప్రశ్నావళి
తయారుచేయబడింది.
ప్రాయాలతో ఏకీభవించట
వ్యతిరేకించటానికి అవకా
పట్టిక తయారుచేయబడింది
ప్రతి అభిప్రాయమూ
దాని ఎదురుగానే మీ
ఇవ్వండి. దీనికి ఈ క్రిందివ

1. "ప్రజలకోసం దేశం" కాని "దేశంకోసం ప్రజలు" కాదు.

2. కొన్ని జాతులవారు మరికొన్ని జాతులవారికంటే స్వాభావికంగా ఉత్తములు.

3. యుద్ధం మానవస్వభావానికి సహజం.

4. ఒకప్పుడైనా వ్యక్తిగతమైన ఆస్తిపోయి సంపూర్ణమైన సోషలిజం రావాలి.

5. వంశపారంపర్యంగా వచ్చే రోగాలుకాని, లోపాలుకాని కలవారికి సంతానం కలుగకుండా చేయాలి.

6. ప్రపంచ శాంతికోసం మనదేశం సర్వస్వతంత్రాధికారాలను కొంచెం వదులుకోవాలి.

7. ఉత్పత్తి, వ్యాపారము ప్రభుత్వజోక్యం లేకుండా సాగిపోవాలి.

8. విడాకులకు సంబంధించిన చట్టాలను, విడాకులు ఇంకా సులభం అయ్యేట్లుగా మార్చాలి.

9. జీవితంలో పైకి రాలేనివారికి కార్యసాధకుల సానుభూతి, సహాయం అక్కర్లేదు.

10. హింసాచర్యలు జరిపేవారిని కొరడాదెబ్బలతో శిక్షించాలి.

11. ముఖ్యమైన భారీపరిశ్రమలను జాతీయం చేయటంవల్ల అశ్రద్ధ, నిరంకుశత్వం, మాంద్యం, ప్రబలమౌతాయి. అభివృద్ధికి అవకాశంకూడా ఉండదు.

12. వివాహానికిముందే ఒకరికొకరు శారీరకంగా సరిపోతారో లేదో, తెలిసికొనే హక్కు స్త్రీ పురుషులకు ఉన్నది.

13 "తప్పో ఒప్పో మా దేశం" అనే నానుడి సరైనది.

14. సామాన్యులు మతంయొక్క అవసరం లేకుండానే హాయిగా జీవించగలరు.

15. తక్కువజాతులకు చెందినవారనబడేవారిని, వారికంటే ఎక్కువజాతులకు చెందినవారిపైన అధికారంలో వేయటం మంచిదికాదు.

16. తమ కుటుంబాలకు మించిన బాధ్యత వేరెలేదని అందరూ గ్రహించాలి.

17. మరణానంతరం మిగిలే దేమీలేదు.

18. మరణదండన, క్రూరమైనది కనుక దానిని నిషేధించాలి.

19. కొందరు మంచివారున్నా, మొత్తానికి వడ్డీవ్యాపారం చేసే కులాలలో దుర్మార్గులే ఎక్కువనుంది.

20. మొట్టమొదటి "ఆటంబాంబు" వేయటంవల్ల కొన్ని వేలమంది అమాయకులైన ఆడవాళ్లు పిల్లలు చనిపోయారు. అందువల్ల ఇది అధర్మమైనపని. మన సంస్కృతికి, నాగరికతకి కూడా విరుద్ధమైనది.

21. డాక్టర్లు అవసరమని చెప్పినప్పుడు తప్ప సంతాననిరోధ పద్ధతులను నిషేధించాలి.

22 కుదరని జబ్బులు కలవారికి, కావలిస్తే, బాధారహితంగా మృత్యువును స్వీకరించే హక్కు ఉండాలి.

23. రాహుకాలం, శకునాలు మొదలైనవి పాతకాలపు నమ్మకాలు; వాటిని మనం ఏమాత్రం పాటించకూడదు.

24. కార్మికులను ఉపయోగించుకొనటమేకాని ఉత్పత్తికి తోడ్పడినందుకు తగిన ప్రతిఫలాన్ని ఇవ్వదుగనుక, పెట్టుబడిదారీ వ్యవస్థ అధర్మమైనది.

25. మనం మన మతంలో, ధర్మశాస్త్రాలలో చెప్పబడినవన్నీ పూర్తిగా నమ్మాలి.

26. ఎవ్వరైనా ఆత్మహత్య చేసుకోవాలంటే, సంఘం అడ్డుపెట్టకూడదు.

27. స్త్రీపురుషులమధ్య స్వేచ్ఛాప్రణయం ఉండడం శరీరానికి, మనస్సుకుకూడా మంచిది.

28. శాంతిసమయంలో కూడా సైనికశిక్షణ ఉండితీరాలి.

29 స్త్రీలను బలాత్కరించటం మొదలైన నేరాలను చేసేవారిని జైల్లో పెట్టినంతమాత్రాన చాలదు. వారిని నిర్దాక్షిణ్యంగా



# ...కు తెలుసా?

# ఇలాంటి ప్రశ్నావళి

...ఏ పార్టీకైనా
...కాని మీ పార్టీ
...తాభిప్రాయాలకు
...గా లేదా లంచ
...టానికి ఈ క్రింది
.
...పట్ల వివిధ వర్గాల
...ప్ర అభిప్రాయాల
... అంచెన్ విశ్వ
...ప్రొఫెసరుగా
...ప్రాసిన ఒక
...రంగా ఈ పట్టిక
...మంది కొన్ని అభి
...వికి, కొన్నిటితో
...ఉంటేటట్లు ఈ

చదివి దానిమీద
...క్తిగతాభిప్రాయం
...అవలంబించాలి.

++ ఆ అభిప్రాయంతో దృఢంగా ఏకీభవించినప్పుడు.

\+ కొంతంమీద ఏకీభవిస్తే.

O ఎటూ తేల్చుకోలేకపోతేనో, లేక ప్రశ్న వేసిన పద్ధతి మీరు సమాధానం ఇవ్వటానికి వీలుగా లేకపోతేనో.

— కొంతంమీద ఆ అభిప్రాయానికి మీరు వ్యతిరేకిస్తే.

—— దృఢంగా వ్యతిరేకిస్తే.

నిర్మొహమాటంగా మీ జవాబు లివ్వండి. ఇది మీకు పరీక్ష కాదు. ఇందులో రైటు జవాబులు, తప్పు జవాబులూ ఉండవు. మీ వ్యక్తిగత అభిప్రాయమే సరైన సమాధానం. ఏ ఒక్క ప్రశ్ననూ వదిలిపెట్టక అన్నీ పూర్తి చేయండి. ఎవర్నీ అడక్కుండా మీ అంతట మీరే పూర్తిచేయండి. అన్నీ చేసినతరవాత 48వ పేజీ చూడండి. అంతవరకూ ఆ పేజీ చూడవద్దు.

శిక్షించాలి.

30. మంచికోసం అబద్ధం చెప్పినా తప్పులేదు.

31. భగవంతుడు అనేభావం మనుష్యుని మనస్సు కల్పించినదే.

32. పురుషులకు, స్త్రీలకు సమానమైన కామస్వాతంత్ర్యం ఉండటం న్యాయం.

33. దేశంలోని మతసంస్థలు, దేశవ్యవహారాలపై తమ అధికారం అభివృద్ధి పఱచుకొనటానికి యత్నించాలి.

34. తమ అంతరాత్మకు విరుద్ధమైనదనే కారణంతోనే ఆక్షేపించేవారు దేశద్రోహులు.

35. పాకిస్తాన్‌నుంచి వచ్చిన కాందిశీకులు తమదారి తాము చూసుకోవాలి. అలాగే ఇతరప్రాంతాల కాందిశీకులునూ.

36. మర్క్సు మతాన్ని ఆశ్రయించడమే నాగరికతకు శ్రీరామరక్ష.

37. తనదేశంకన్నా మరొకదేశంపైన అభిమానంకలిగి ఆ దేశానికి సహాయపడినందుకు ఎవ్వరినీ శిక్షించకూడదు.

38 జీవితంలో నెగ్గలేనివారు నశించిపోవడం సహజం. ఇందులో మనం విచారించవలసిం దేమీ లేదు.

39. అంతర్జాతీయ కార్యక్రమాలలో పాల్గొన్నప్పుడు ఈ దేశం తన స్వాతంత్ర్యానికి లోటురాకుండా చూచుకోవాలి.

40. నిష్పాపరు లందరూ మోసగాళ్ళు.

41. ఈ రోజులలో ప్రతివాడూ తన కవసరమైన పనులలో సౌఖ్యం కలుగచేసుకుంటున్నాడు.

42. భార్యాభర్తలమధ్య తప్ప ఇతరత్రా శరీరసంబంధం ఉండకూడదు.

43. కులమత భేదాలకు సంబంధించిన దురాచారాలను చట్టరీత్యా నిషేధించి కఠినమైన శిక్ష విధించాలి.

44. గర్భస్రావాన్ని నిషేధించే చట్టాలను రద్దుచేయాలి.

45. పాఠశాలలలో మత సంబంధమైన విద్యాభ్యాసం ఉండి తీరాలి.

46. అన్ని వర్ణాలవారు, కులాలవారు సమానమైనవారే, సంఘానికి అవసరమైనవారే.

47. మనం నేరస్థులను మరీ కఠినంగా శిక్షిస్తున్నాం. వారిని బాగుచేయడానికి ప్రయత్నించాలిగాని శిక్షించకూడదు.

48. ఆధునిక సంఘవ్యవస్థలోని దుర్గుణాలను దైవభక్తి మాత్రమే అరికట్టగలదు.

49. ఎవ్వరూ పట్టుకోకపోతే అడపాతడపా టికెట్ లేకుండా ప్రయాణం చేయటంలో తప్పేమీ లేదు.

50. జపానువాళ్ళు సహజంగా క్రూరమైనవాళ్ళు.

51. ఈ జీవితం క్షణభంగురం కనుక మనం వీలైనన్ని సుఖాలను అనుభవించడానికి ప్రయత్నించడంలో తప్పులేదు.

52. యుద్ధంచేసే కన్న విదేశాక్రమణకు లొంగిపోవడమే మంచిది.

53. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు వీరు మనుష్యులు దైవస్వరూపులు. సామాన్యులు కారు.

54. తక్కువ కులాలనబడే వాటికి చెందిన వారిని ఎక్కువ కులాలనబడే వాటికి చెందినవారితో కలిసి మెలిసి తిరగనీయటం మంచిదికాదు. వారి పాఠశాలలు, నివాసస్థలాలు వేరేగా ఉండాలి.

55. చిన్నపిల్లలదగ్గిఱ అసభ్యంగా మాట్లాడటం మంచిదికాదు

56. ఈ జగత్తు దైవసృష్టి.

57. కోడి పందాలు, పొట్టేలు పందాలు, వేట మొదలైనవి క్రూరమైనవి. వాటిని నిషేధించాలి.

58. దేశంలో ప్రతివారికీ పూర్తి స్వాతంత్ర్యంకంటె ఆదేశం శాంతి భద్రతలస్థాపన చాలా ముఖ్యం.

59. ప్రతి ఒక్కరూ మానవాతీతమైన ఒకశక్తిని నమ్మి దానిప్రకారం నడుచుకోవాలి.

60. శాస్త్రంకంటె వ్యవహారశక్తి సంఘానికి ఎక్కువ ఉపయోగకరమైనది.








# అన్ని వేళలా
# బ్రూక్ బాండ్
# టీనే
## త్రాగి ఆనందించండి

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్



BB 274K

# ఆరుద్ర గళ్ళనుడికట్టు 8

## ఆధారాలు

### అడ్డం

1. శోకమూర్తిచేత వానరసేన.
3. పడమర తోటవల్ల గాలివీస్తుంది.
5. నిలిపి వ్రాతను సంపాదించవచ్చు.
6 వీడు వీడు రాపిడివల్ల బూడిదరాలుతుంది.
7. వారి జాలపాలలో మొదటే అనవాయితీ అడ్డదిడ్డంగా చిక్కుకుంది.
10 చిత్తుకాని లోహం.
11 తండ్రిమాటవల్ల రాముడు అరణ్యంలో చేసిన పాలన.
12 శాంపిల్, తునకలు ముందు కలపవచ్చు.
14. ఒక తరహా కరము.
16. ఎనిమిదిఫర్లాంగుల కొకమారు ముఖ్యమైన ఘట్టాలు నిశ్చలంగా ఉంటాయి.
17. కురచ నగరమంగు రాసినది.
18. మిషన్ లేకపోతే పాలడబ్బాల మీద యాదవకాంత
19. దీనివల్ల పాలాలకు దిష్టిదోషం ఉండదా?

### నిలువు

2. శ్రీమంతులు కళ్ళకలకవచ్చినవారు కాబోలు!
3. చేప నిద్రలో వ్యాపకం కనబడుతుంది.
4. నరభక్షకుల ముక్కు తెగితేగ.
6. లాలి
8. అందితే పట్టుకోవచ్చు.
9. పారము లేనిదిగాని అయినదని ఆశ్చర్యం తోస్తుంది
11. కాకిపిల్ల కాకికి ఎలాగో పిచ్చుకకు అలా ముద్దు కలిగించేది.
12. పదిహేడు నిలువు తిరగేస్తే మిషన్.
13. మీరు పరిష్కరిస్తున్న దీనిలో ఉండేవి.
17. పన్నెండు నిలువు తిరగేస్తే లక్ష్మి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | ■ | 3 | | 4 | |
| ■ | ■ | ■ | 5 | | | ■ | | ■ |
| 6 | | | | ■ | ■ | 7 | 8 | |
| | ■ | ■ | | ■ | 9 | ■ | 10 | |
| ■ | 11 | | | | | | | ■ |
| 12 | | ■ | | ■ | | ■ | ■ | 13 |
| 14 | 15 | | ■ | ■ | 16 | | | |
| ■ | | ■ | 17 | | | ■ | ■ | ■ |
| 18 | | | | ■ | 19 | | | |

### 7-వ నుడిగటుకు జవాబులు




# ★ అన్వేషణ ★

(27-వ పేజీ తరువాయి)

శివరాంనుచూసి కొత్త నిర్ఘాంతపోయింది. శివరాం తన్ను పరిచయం చేసుకున్నాడు. సత్తెమ్మకు అప్పటికీ అతని బంధుత్వం అర్థం కాలేదు.

"కూర్చోండి! ఆయన బజారుకు వెళ్ళారు యిప్పుడే వస్తారు!"

ఆ డాబాలో ఒకవారగా కూర్చోబోయాడు శివరాం.

"అబ్బెబ్బె!...గదిలో కూర్చోండి!... సత్తెమ్మ శివరాంను మందలించి, గదిలోని పట్టెమంచం చూపించింది. మాసిపోయిన దుప్పటి చెల్లాచెదరైన దూదితో ఉన్న పరుపు...దానిమీద నూనెతో అట్టకట్టిన తలగడ...ఆ మంచం స్వరూపం చూసి కొంచెం శంకించాడు, శివరాం కూర్చోడానికి.

"ఇంటినిండా పిల్లలుకదండీ...ఇట్లా శేధించుకుతింటారు...ఎక్కడి వస్తువు అక్కడ ఉండనీయరు!" చలాకీగా నవ్వింది సత్తెమ్మ..."నీకు పెళ్ళయిందా నాయనా?" ఓరగా చూసి సత్తెమ్మ ప్రశ్నించింది సరదాగా.

"లేదండి" సిగ్గుపడ్డాడు శివరాం.

సత్తెమ్మ వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

శివరాం ఏమితోచక గది పరీక్ష చెయ్యడం మొదలుపెట్టాడు. గదిగోడ మేకుకు సగం చిరిగిన ఒక సినీతార కేలండరు వేలాడుతోంది. గదిగూట్లో పలకపుల్లలు సుద్దలు చిన్న పెన్సిలు ముక్కలు, పాతశ్లేట్లు... దొంతరలుగా పడిఉన్నాయి ఎదురుగా కేలమీద రెండు ట్రంకు పెట్టెలు......ఆ ప్రక్కనే బియ్యపు సంచీ, ఎండు మిరప కాయలు, కూరలు, పప్పులు వరుసగా చెల్లాచెదురుగా పళ్ళాల్లో కనబడ్డాయి. గదిగుమ్మానికి కిటికీకి కట్టిన తాడుమీద మాసిన బట్టలు, చీరలు తోరణాల్లా వేలాడుతున్నాయి. ఒక మూక్కాలి పీటమీద పేక, గవ్వలబుట్ట కనిపించాయి. చాలీచాలని ఆదాయంతో, బీదరికాన్ని కప్పుకుంటూ, పైకి హుందాగా బ్రతకడం నేర్చిన మధ్య తరగతి కుటుంబమని నిశ్చయించుకున్నాడు శివరాం.

ముగ్గురు పిల్లలు అల్లరి చేసుకుంటూ గదిలో చొరబడ్డారు. శివరాంను చూసి ఒక్క నిమిషం భయంతో ఆగారు. అపరిశుభ్రంగా మాసిపోయిన బట్టల్లో మలినంగా ఉన్న ఆ కుర్రవాళ్ళు అసహ్యంగా ఉన్నా బంధువులను సంతోషపెట్టడానికి, ఆపిల్లల్ని అనునయంగా పిలిచాడు శివరాం దగ్గరకు:

పిలవడమే తడవుగా మట్టి కాళ్ళతో ఒక్క గెంతు గుంచంమీదకు గెంతి శివరాం మెడ చుట్టి పెట్టారు "మామా!" అంటూ అరుస్తూ. (ఇంకావుంది)

# నక్షత్రఫలితాలు

| 8-7-59 మొదలు 14-7-59 వరకు |

గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | | శ |
| | తే 8 దీని శుక్రుడు సింహములో ప్రవేశించును. కర్కాటక, సింహ, కన్యా రాశులలో చంద్రుడు. | | బు<br>శు |
| | | | కు |
| శ | గు | | రా |

* అశ్విని [చూ, చే, చో, లా] *

మీరు ధైర్యముతో వృత్తి ఉద్యోగాలలో ముందంజవేసి, హోదా ఆదాయము పెంచుకుంటారు. క్రొత్త అనుకూలతలు ఏర్పడుతవి. మీ బుద్ధికుశలతవల్ల ఉపద్రవాలు సాధించుతారు. మీరు వేసుకున్న పథకము ప్రకారము అన్నివిధాలా సబ్బు చేతికి అందుతుంది. మనుష్యసహాయము కూడా కలుగుతుంది. మాట పలుకుబడితో పరిస్థితులలో అనుకూలమైన మార్పులు తెచ్చుకొనగలుగుతారు. ఈశాన్య దిక్కునుండి బంధువుల కుశలవార్త తెలుస్తుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము.

* భరణి [లి, లూ, లే, లో] *

ఈ వారము మీకు యోగప్రదము, అవకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము సుముఖమవుతాయి. అధికారముతో పాటు ధనాదాయముకూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, సన్మానమువంటి శుభయోగములు కలవు పండితగోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగుతవి. పిల్లల మేలుకొరకు మీరు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము, న్యాయవాదులకు, న్యాయస్థానఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుకాలము.

* కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము లౌకిక వ్యవహారరంగములో మీకు చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువ అవుతుంది. నీటిమీద ప్రయాణము చేయువలసి వుంటుంది. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలసి శుభకార్యములలో పాల్గొని మృష్టాన్నభోజనము చేస్తారు. బియ్యము, వెండి, నూలు, బట్టలు, వ్యాపారస్థులకు లాభము కవులు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా శుభయోగములతో కూడివున్నా మానసిక ఆందోళన కలుగుతూవుంటుంది.

* రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు ఇష్టకార్యసిద్ధి, ధనధాన్యవృద్ధి, వివాహాదిశుభకార్యములలో పాల్గొనుట యత్నకార్యానుకూలత పరోపకారమువల్ల కీర్తి వాహనయోగములు కల్గుతాయి. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఇంట్లోవారికి అలంకార ప్రాప్తి.

బి. నరసింగరావు

* మృగశిర [వే, వో, కా, కి] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ రాబడి తక్కువ. గృహావసరములు తీరక కలతలు, అకాల భోజనమువల్ల ఆరోగ్యము చెడనున్న సూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందినమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్థులకు కొత్తసమస్యలు వర్తకులకు ఆందోళన రాజకీయవాదులకు అశాంతి త్రిప్పట 11న పితృవర్గ సహాయము ధనలాభము ప్రయాణము 13 అనారోగ్య సూచనలు.

* ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో మీకు నిరాశగా ఉన్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్థులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు బాగా సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళనకలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తువుల సంపాదనవంటి మంచి యోగములు కూడా వుంటాయి.

* పునర్వసు [కే, కో, హా, హి] *

ఈ వారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని పొందుతారు. ధనాభావముకూడా ఎక్కువ. ఇంట్లో వారి ఆరోగ్యము సరిగా వుండనందున చింత కలుగుతుంది. అయినా ఆధ్యాత్మిక భావము కలవారగుటచేత దైవముపై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్థులకు ఒత్తిడి, వర్తకులకు నిరాశ, విద్యార్థులకు మంచి రోజులు కావు పుణ్యక్షేత్ర సంచారము దేవతాదర్శనము విచిత్రములను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగును. వారమంతా అవయోగశుభయోగమిశ్రమముగా వుంటుంది

* పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ప్రయత్నించిన కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. ఇతరులకు చేయదలచుకున్న సహాయము చేయలేక పోవుటచేతను నిందలుపొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ, తోటివారి సహాకారము కలుగుతాయి వర్తకులకు వారమంతా నిరాశగావున్నా వారాంతమున మేలుపొందుతారు విద్యార్థులకు చదువు బాగా సాగదు. 12న భార్యకు అనారోగ్యము కలుగుటచే ఆందోళన.

* ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టువిడవకుండా ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. అనుకున్న సొమ్ము సమయానికి రాక అప్పు చేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహ ఖనిజ వ్యాపారస్థులకు కష్టముతో కూడిన లాభము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 9న ప్రమాద సూచన.

* మఖ [మా, మీ, మూ, మే.]

గత రెండువారములనుండి కలుగుచుండిన కష్టములు గడిచి అధికారుల సహాయముచేతను మీ స్ఫూర్తి తనముచేతను కార్యసిద్ధి పొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. వారమంతా యోగప్రదముగా వుంటుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ బంధుసహాయము కలుగుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. డాక్టర్లకు, గణిత శాస్త్రజ్ఞులకు కవులకు చిత్రకారులకు శిల్పులకు, నటనటులకు యోగకాలము. 9న

## ఈ వారపు ధరలు:

నూలు, వస్త్రములు - నిలకడగా వుండును
నూనెగింజలు - మార్పు లేదు
ఆహారధాన్యములు - నిలకడగా వుండును
బెల్లము, పంచదార, చింతపండు - సమస్థాయిలో వుండును
పప్పుదినుసులు - మందముగా వుండును
వెండి, బంగారము - స్వల్ప భేదాలలో వుండును.
సస్యానుకూలముగా వర్షించును మేఘావృతమై యుండును

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణ అను పేరునకు మృగశిరానక్షత్రమును, హృష్ణ అను పేరునకు స్వాతియును, శ్రీధరు అను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడు అను పేరునకు హస్తయును, భీమును, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది

అధిక ఖర్చులు.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈ వారము అన్ని ఇబ్బందులు తీరుతవని అనుకున్న సౌమ్యత చేకూరుతుంది. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతవి. పిల్లల మేలుకొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు నూతన కార్యారంభము చేస్తారు ప్రభుత్వ సన్మానము కలుగుతుంది పండితులతో శాస్త్రగోష్ఠి జరిపి జ్ఞానము వృద్ధిచేసుకుంటారు విద్యార్థులు శ్రద్ధతో కొత్తవిషయాలు నేర్చుకుంటారు వారమంతా యోగదాయకము 10 న ఆందోళన కలుగుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగస్తులకు మేలుకాలము

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పి)

ఈ వారము మీకు యోగదాయకమైనను, మానసికాందోళన కలుగుతుంది నీటిమీద ప్రయాణము చేస్తారు బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో పాల్గొంటారు దూరముండున్న ఆప్తుల క్షేమవార్త తెలిసి సంతోషం పొందుతారు నూలు, బట్టలు, బియ్యము, వెండి వ్యాపారస్తులకు వారమంతా లాభదాయకముగా వుంటుంది విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది శుభకార్యాలలో పాల్గొంటారు

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

గతవారము పూర్తికాకుండా ఉండిపోయిన పనులు ఈ వారము లాభకరముగా చేయగలుగుతారు ధనయోగము అనుకున్నదానికన్నా ఎక్కువగా కలుగుతుంది పుణ్యకార్యాచరణలో పాల్గొంటారు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారము పెరుగుతుంది స్త్రీలతోనూ, బంధువులతోనూ కలిసి విందువినోదములతో ఆనందిస్తారు కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము

### * చిత్త [పే, పో, రా, రీ] *

ఈ వారం యత్నకార్యములకు ఆటంకములు కార్యభారము ఎక్కువ తీరుబడిలేని కార్యక్రమములవల్ల అకాల భోజనము చేయుటచే ఉష్ణాధిక్యము, కడుపునొప్పివంటి అనారోగ్యసూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందుట మేలు వర్తకులకు శ్రమ ఎక్కువ ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడిచే సెలవు పెట్టవలసివస్తుంది రాజకీయవాదులకు మేలుగా వుంటుంది పిత్రార్జితమునుండి సహాయముచే ధనలోపము కొంత తీరుతుంది

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము నిరాశగావుంటుంది గాని మిత్రసహాయంవల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు రహస్యములను కనిపెట్టుటకు ప్రభుత్వముచే నియోగింపబడుతారు స్థానలోపమువల్ల ఆందోళన, ఉద్యోగస్తులకు బదిలీఅయే యోగము ఉన్నది వర్తకులకు మాంద్యము విద్యార్థులకు శ్రద్ధతక్కువ ప్రయాణము, విదేశీయులతో పరిచయము, వింతవస్తువుల సంపాదన, కార్యసిద్ధి కలుగుతాయి ఇంట్లోవున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము మీరు అనుకున్నట్లు పనులు జరుగవు. ధనాభావముచే ఇబ్బంది ఎక్కువ. వ్యక్తి సహాయమువల్ల పనులు చేయదలుచుకున్నారో అతడే ఆటంకములను కలుగజేస్తాడు. ఆధ్యాత్మిక చింతకలవారగుటచే ఈశ్వరకృపవల్ల కష్టములనుగడచి కార్యసిద్ధి పొందుతారు ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగించుతుంది ఉద్యోగస్థులకు ఒత్తిడి వ్యాపారస్థులకు నిరాశ కలిగినా నష్ట ద్రవ్యలాభము కలిగిస్తుంది సాధుసజ్జన సాంగత్యముచే ఆత్మవికాసము కలుగుతుంది.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈవారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ రావలసిన డబ్బు చేతికందక అశాంతి బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువ కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. పనులకు చేయదలిచే సహాయము చేసేందుకు అవకాశములేక మాటపడతారు, ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల



జూలై 4వ తేదీ అమెరికన్ స్వాతంత్ర్య దినం 183 ఏళ్ళ క్రితం జరిగిన స్వాతంత్ర్య ప్రకటనకు చిహ్నంగా, నాటి చరిత్రాత్మక సంఘటనలను జ్ఞప్తికి తెచ్చేవిధంగా ఉత్సవాలు జరుగుతాయి ఫోటోలోని శకటం 1776 నాటి ముఖ్య ప్రయాణ సాధనం

#  నక్షత్ర ఫలితాలు 

కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు. 12 న భార్య అనారోగ్యమువల్ల మనోవ్యథ విద్యార్థులకు బద్ధకముచే చదువుబాగా సాగదు.

*** జ్యేష్ఠ [నో,యా,యీ,యూ,] ***

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు కలిగే ఆటంకములకు నిరుత్సాహపడకుండా పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసిద్ధి పొందుతారు. పనుయానికి సౌమ్యులందరికి అప్పు చేయవలసి వస్తుంది. కాని వారాంతమునకు తీరుస్తారు. 10 న యంత్రములవల్లగాని, అగ్నివల్లగాని ఎత్తయిన స్థలములనుండి పడుటవల్లగాని కలిగే గాయాలు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహపు సామానులు, రంగుల వ్యాపారస్థులకు, గనుల యజమానులకు కష్టముతో కూడినయోగము. ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు యంత్రములు నడుపు నిపుణులకు యోగకాలము.

*** మూల [యే, యో, బా, బి] ***

ఈవారము మీకు ధనయోగము. వ్యవహారాలలో జయము. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము. విద్యాప్రాప్తి, నూతన కార్యలాభము. ఈశాన్యదిక్కునుండి శుభవార్తలో ఉత్తరములు వచ్చుట, జ్ఞానమార్గప్రసంగములు, యుక్తిగా ప్రసంగించుట, గణిత జ్యోతిష శాస్త్ర చర్చలు; సుఖభోజనము వంటి మంచిఫలితాలే కలుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వ్యాపారస్థులకు లాభము. కవులకు, చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు మేలు కాలము. విద్యార్థులకు చదువు సరిగా సాగుతుంది.

***పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢా] ***

ఈవారము శుభకార్యములలో పాల్గొనుట, పుత్రప్రాప్తిసూచనలు, ధనలాభము, భాగ్యవృద్ధి, బిరుదులుపొందుట, ప్రభుత్వ సన్మానము, ఘనకార్యాచరణ, పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగములవంటి మంచియోగములు కలుగును. విద్యార్థులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మంచికాలము.



***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] ***

ఈవారము మీరు వినోదాలలో పాల్గొంటారు. బంధుమిత్రులతో కలిసి వెండిపాత్రలలో దధి, క్షీర మధురపదార్థయుక్త సుఖభోజనముచేస్తారు. నీటిమీద ప్రయాణము, తలపెటిన కార్యములలో జయము, తెల్లని వస్తువులు కొనుటవంటి మంచియోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, ద్రవపదార్థముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. ఈవారము నూతన కాంట్రాక్టులు అలంకారప్రాప్తి, వింగు వినోదము కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కాలము. విద్యార్థులు బాగా చదువుకుంటారు.

*** శ్రవణము [జూ,జే,జో, ఖా] ***

ఈవారము ధనధాన్యవృద్ధి, పశువృద్ధి కలుగును. కష్టము ఫలించును. వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభం పరోపకారమువల్ల కీర్తి మొదలగు రాజకీయ యోగములు కలుగును. విద్యార్థులు వినోదాల్లో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. వర్తకులకు బంగారము నవరత్నములు వంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం.

*** ధనిష్ఠ [గా, గి, గూ, గే] ***

ఈవారము మీకు కార్యభారముఎక్కువ. ఆరోగ్యము సరిగా లేని సూచనలు కనపడగానే గ్రహాదైన రవికి శాంతిచేయుటవల్ల మేలు కలిగించును. ఔషధ చికిత్సకూడా పొందుట మంచిది. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు సరిగా చదువుసాగదు పితృవర్గమునుండి సహాయము, ప్రయాణము కార్యభారము కలుగును. 10 న ఆరోగ్యభంగము. రాజకీయ వాదులకు ఆందోళన, అధికఖర్చులు.

***శతభిషం [గో, సా, సి, సూ] ***

ఈవారము అనుకున్న సొమ్ము సకాలములో చేతికిరాదు. కార్యాచరణకు సాధ్యపడని అనిశ్చితస్థితిలో వుంటారు. చేదామనుకున్న పనులకు ఆటంకములు కలిగినా వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అయ్యే సూచనలున్నవి. ప్రయాణము విదేశీయుల పరిచయము విచిత్రవస్తుసంపాదన, మిత్రసహాయము కలుగును. 8 న పెద్దల ఆరోగ్యముగురించి చింత విద్యార్థులకు చదువు బాగా సాగదు.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరుగవు. కోరిన సహాయము సకాలమునకు లభించదు అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారంవేసి కార్య సాధనకు ప్రయత్నించి ఫలము పొందుతారు. వర్తకులకు చాలా కాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి వ్యర్థప్రసంగమువల్ల ఉద్యోగస్థులు అధికారుల ఆగ్రహమునకు లోనౌతారు. పుణ్యపురుషుల సాంగత్యము ఆత్మనికొరకు శాంతి పుణ్యక్షేత్ర సంచారము, శివదర్శనము నష్టద్రవ్యలాభము కలుగును. 9న ఇంట్లో వారి అనారోగ్యముచే చింత.

*** ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థ] ***

మీ ఆలోచనప్రకారము కార్యక్రమాలు నెరవేరడానికి కొంచెము అడ్డుపడుంటారు. కొన్ని సందర్భములలో అశాంతి, బంధు విరోధము వచ్చును కోరుదావాలు అనుకూలముగా తీర్పుఅయినా మరికొన్ని కొత్త చిక్కులు కలుగుతవి. కొర్రలు, రాగులవంటి అపరదినుసులు మినుములు, ఉప్పు నువ్వులు, నూనె సంబంధమగు వస్తువులు వర్తకులకు లాభము. అన్యజాతివారివల్ల గౌరవము కలుగుతుంది 9 న భార్యకు అనారోగ్యము, అధిక ఖర్చులు.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈవారము ఎంత ప్రయత్నించినా అనేక ఆటంకములు కలుగుతవి సాహసము పట్టుదల కలవారగుటచే నిరాశ చెందక ప్రయత్నించి కలిగిన చిక్కులను విప్పుకొని మేలు పొందుతారు. సోదర సహాయమువల్ల చికాకులు సర్దుకుంటారు. జాగ్రత్తగా వుండకపోవడంవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. గనుల యజమానులకు భూగర్భశాస్త్రజ్ఞులకు లాభం, ఖనిజ వ్యాపారస్థులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు కష్టముతోకూడిన యోగము.



బాల సాహితి

# కలలో కైలాసం

ఒకానొకప్పుడు ఒక పల్లెపడుచు, ప్రక్క గ్రామానికి పోతూ, మధ్యలో దాహం తీర్చుకోడానికి ఒక చెట్టుకిందను ఆగింది; ఆగి తనతో కూడా తెచ్చుకున్న చిన్న తట్టను ఆ చెట్టు కొమ్మకు తగిలించి వెళ్ళిపోయింది. ఆ తట్టలో ఒక చద్ది అన్నం మూట, కొన్ని రొట్టెలు, పండ్లు కూడా వున్నయ్.

ఆ పల్లెపడుచు వెళ్ళగానే ఇద్దరు మనుష్యులు ఈ చెట్టువైపే వస్తూండడంలో ఈ తట్ట కాస్తా వాళ్ళకంట బడింది. ఆ యిద్దరిలో ఒకడు రైతు; రెండవాడు గొడ్లకాపరి. మొదట రైతు "ఒరే అబ్బీ, ఈ తట్టను మొదట చూచింది నేను. కాబట్టి ఇవి నాది. ఇందులోవన్ని నాకే", అన్నాడు. వెంటనే గొడ్లకాపరి "చాల్లేవయ్యా సామీ, నీ కంటె ముందుగా నేనే అల్లంత దూరాన్నించి చూశాను. గనుక ఇది నాదే గాని నీది కాదు" అన్నాడు.

ఇంతలో రైతు ఒక చక్కని ఆలోచన చేశాడు. "సరే. అయితే ఒక షరతు. ఏమిటంటే మనిద్దరం నిద్రపోదాం. ఎవరికయితే చక్కని అద్భుతమైన కలవస్తుందో వారికి చెందుతుందీ తట్టా, తట్టలోని పదార్థాలు. కలగని లేవగానే నీ కల నీవు, నా కల నేను ఒకరికొకరం చెప్పుకొందాము. ఎవరి కల విచిత్రంగా వుండి గొప్పగా వుంటుందో, వారు తీసుకుందాము, పేచీలేకుండా. ఏమంటావు అన్నాడు రైతు. సరేనన్నాడు గొడ్లకాపరి.

ఇద్దరు చెరొక ప్రక్క పడుకున్నారు నిద్రపోవడానికి. పాపం, రైతు అదివరకే అలిసి వున్నాడేమో, నడుం వాల్చాడో లేదో, నిద్ర ముంచుకొచ్చింది. గురకలు పెడుతూ నిద్రపోయాడు. ఈ అవకాశం కోసమే చూస్తున్న గొడ్లకాపరి, ఇదే సందనుకొని, మెల్లగా లేచి కొమ్మకు తగిలించిన తట్టను క్రిందికి దింపి, మెల్లమెల్లగా అందులో వున్న అన్నం, రొట్టెలు, పండ్లు తినేశాడు. కాని వాడికి ఆకలి తగ్గలేదు. మధ్యమధ్య రైతును ఒక కంట కనిపెడుతూనే వున్నాడు. ఒక వేళ నిద్ర మెలుకువవచ్చిందేమో

రెంటాల కాంతాదేవి

నని. కాని ఆ నిర్భాగ్యుడు తియ్యటి కలలతో మైమరచి నిద్రపోతూనే వున్నాడు. రైతు తలవైపుగా, రైతు తెచ్చుకున్న అన్నం మూటను చూచాడు గొడ్లకాపరి. వెంటనే మరో ఆలోచనలేకుండా చప్పుడు కాకుండా ఆ మూటను తీసిదానిలో వున్నదంతా స్వాహా చేసేశాడు. దీనితో వాడి ఆకలి ఆమడ దూరానికి పోయింది. ఇక తాపీగా నిద్రపోవచ్చునని పడుకొని భుక్తాయాసంతో దొర్లుతున్నాడు.

ఇంతలో రైతు మేల్కొని గొడ్లకాపరిని లేపాడు. వాడు అదిరిపడి లేచినట్లు లేచాడు. "నీకేం కల వచ్చిందో చెప్పు. తరువాత నా కలను గురించి చెప్తాను" అన్నాడు రైతు. "అబ్బా, ఏందో నయ్యా మర్చిపోయాను. ముందు నీకల చెప్పు. తరువాత మెల్లిగా నా కల గుర్తుతెచ్చుకొని చెప్తాలే," అన్నాడు.

"సరే విను." కళ్ళు మూసీ మూయంగానే ఒక మంచి గుఱ్ఱం కనబడింది. దాన్ని చూడగానే ఎక్కి స్వారీ చేయాలనిపించింది. వెళ్ళి పట్టుకుందామని దాని వెనకాలే బయలుదేరాను. ఆ గుఱ్ఱం నన్ను అలా కొంతదూరం లాక్కెళ్ళి ఒక చోట ఆగింది. అక్కడ నాకొక చిన్న నిచ్చెన కనబడింది. దాని ఆధారంతో గుఱ్ఱంమీద ఎక్కి కూచున్నాను. అంతే ఇక చూసుకో దాని పరుగు. అదేం గుఱ్ఱమో, అదేం పరుగో గాని అసలు నేల మీద నడుస్తేనా! ఆకాశమార్గాన పోయి, పోయి సరిగ్గా కైలాసానికే తీసికెళ్ళింది; తీసికెళ్ళి పార్వతీపరమేశ్వరుల ముందు దించింది. అప్పుడు నాకు భలే భయం వేసింది. వెయ్యదూమరి, అంతమంది గొప్పవాళ్ళు అంటే ఋషులు, దేవతలు వున్నచోటంటే మాటలా సరే, మన కెందుకని, అలా భయంభయంగానే గజగజ వణుకుతూ వెనక్కు వెనక్కు వెడుతున్నాడు. ఇంతలో పరమశివుడు నన్ను దగ్గరకు పిల్చి "ఒరే, ఎందుకలా భయపడి పోతున్నావు. భయంలేదులే. రా కూర్చో. నీకేం

# ★ కలలో కైలాసం ★

కావాలి? ఎందుకొచ్చావు? ఇక్కడికి ఎలాగూ రానేవచ్చావు, కాబట్టి ఇవాళ నాతో భోజనం చేద్దువుగాని. పార్వతీ అమ్మవారు స్వయంగా మన యిద్దరకు వడ్డిస్తుంది", అన్నాడు. వద్దంటే ఏం శాపం పెడతాడోనని భయంవేసి ఆయనతో కూడ భోంచేశాను, సుష్టుగా. ఇక ఆ వంటకాలు, ఆ రుచులు, ఆ మధురపదార్థాలు, అబ్బబ్బా యిక వాటి సంగతి నీకేమని చెప్పను......ఇలా చెప్తూ నిజంగా యింకా తింటున్నట్లే తన్మయమైపోయాడు. ఆ తన్మయత్వంలో నుండి తేరుకొన్నాక గొడ్లకాపరిని వాడి కల సంగతి చెప్పమన్నాడు రైతు.

మొదలు పెట్టాడు గొడ్లకాపరి: "నాకూ ఓ గుఱ్ఱం కనబడింది. గబుక్కున దానిమీదకు ఎక్కి కూర్చున్నాను. కొంత దూరం పోయాక చూస్తే గుఱ్ఱ మల్లా గాడిదగా మారింది. పోనిలే ఏదైతే నేమని సరిపెట్టుకున్నాను మనస్సును. పోయి పోయి తిన్నగా మా యింటి దగ్గరకు తీసికెళ్ళి దించింది. అనుకోకుండా జరిగిందేమో నాకు చాలా ఆశ్చర్యం వేసింది. గాడిద మీద సవారి చేస్తు వచ్చిన నన్ను చూచి,




"ఇదిగో, ఏం చేస్తావంటే, ఏదో కొంపమునిగిపోయినట్టు హడావుడిగా తిరుగుతూ వుండు."

నా పెళ్ళాం కోపంతో, చీపురుతో, లంకిణి మాస్వరుగా నామీది మీదికి వస్తోంది కొట్టడానికి. రావడమేమిటి, వచ్చి నాల్గు వడ్డించింది కూడను...బాబూ ఆ బాధ, ఆ దెబ్బలు ... నన్ను అడగవద్దు. ఇప్పటికి కూడా వళ్ళంతా నెప్పులుగా వున్నట్లే వుంది దెబ్బలతో". అని ఏడుపు ముఖం పెట్టి కొంచెం ఆగి మళ్ళీ మొదలెట్టాడు, "ఇంతలో మీరు వచ్చి అడ్డుపడి నన్ను విడదీసి లాక్కొచ్చారు యివతలికి. అసలే ఆకలి. అందులో పెళ్ళాం చేతిలో దెబ్బలు. ఇవన్ని కలసి నన్ను బాగా ఏడిపించాయి. అమాంతం మీ కాళ్ళను కావిలించుకొని ఏడ్చాను. అప్పుడు మీరు నన్ను లేవదీస్తు అన్నారూ "ఎందుకేడుస్తావు? ఫలానా చెట్టుకొమ్మమీద తట్ట వున్నది. ఆ తట్టలో వున్న అన్నం, రొట్టెలు పండ్లు నీవు తీసుకో. ఇంకా ఆకలి తీరకపోతే అక్కడే నా మూట కూడా వున్నది. అది కూడా తీసుకొని తినేసెయ్యి. అన్నారు. "అయితే మీరు తినరా" అన్నాను నేను. ఏలేదు నేను తినను. నేను యిప్పుడే కైలాసంలో పరమశివుని ఆతిథ్యం తీసుకొని వస్తున్నాను. నాకక్కరలేదు" అన్నారు. వెంటనే నేను తమ ఆజ్ఞ ప్రకారం అన్నీ తినేశాను." ఇలా చెప్పి గొడ్లకాపరి తనకలను ముగించాడు.

రైతు ఇదంతా విని అనుమానంతో పైన చెట్టుకొమ్మవైపు ఓసారి, తన మూటకేసి ఓసారి పరికించి చూచాడు. రెండూ ఖాళీ రైతుకు కోపం ముంచుకొచ్చింది. రాదూ మరి. ఒక ప్రక్క ఆకలి

(42-వ పేజీ చూడండి)

# విమానం కథ

పి. దక్షిణామూర్తి

(గతవారం తరువాయి)

ఈ సుమ్మటాలు పైకిఎగరడం అయితే ఎగిరేవి. కాని తీరా అక్కడికివెళ్ళాక యజమాని చెప్పినట్టు వినేవికావు. గాలి ఎటుపొమ్మంటే అటుపోయేవి. ఇంకోవేపు తిప్పడానికి వీలుఅయేదికాదు. ఇక్కడో బొమ్మ వుంది చూడు. ఒకపెద్ద బెలూనుకి చుట్టూరా తాళ్ళుపోసి వాటికి ఒక పెదబుట్ట వేలాడదీశారు. అందులో మనుషులు కూర్చున్నారు. బెలూన్‌తోపాటు ఈ బుట్టా అందులో మనుషులూ ఆకాశంలోకి వెళ్ళేవారు. పైన గాలి ఎటుతోస్తే అటుపోయేవారు. దిగడంమాత్రం వీళ్ళకి చేతనయేదనుకో. దానికి రెండుమూడు ఉపాయాలుండేవి. బెలూన్ నిండా హైడ్రోజన్ ఎక్కిస్తారుగదా. మరి అది అందులోంచి పోకుండా బెలూన్‌మూతి బిరడాతో బిగిస్తారుగదా. వీళ్ళు బెలూన్ చేసేటప్పుడే, దానికి రెండు మూడు చోట్ల చిన్న బిరడాలు అమర్చి ఉంచేవారు. వీళ్ళు ఇంక దిగిపోదాం అనుకున్నప్పుడు వాటిలో ఒకటో రెండో బిరడాలు కొంచెం తెరిచి హైడ్రోజన్‌ను కొంతబయటికి పోనిచ్చేవారు. అది తగ్గిపోయేసరికి, ఆ బెలూన్, ఈ బుట్టనీ మనుషుల్నీ మొయ్యలేక ఉసూరుమంటూ మెల్లిగా కిందకిదిగేది.

ఇంక పోతూ పోతున్న ఈగాలి ఓడకి బ్రేక్ వేసి ఆపడం ఎలాగో తెలుసా? సరిగ్గా పడవకి లంగరువేసే విధంగానే కాకినాడలో పైకి ఎగిరిన బెలూను సామర్లకోటవేపు రాకుండా సముద్రంమీదకి పోతోందనుకో, మరి అందులో ఉన్నవాళ్ళకి ప్రమాదం కాదూ?

అలాంటప్పుడు, వాళ్ళు బెలూన్‌లో హైడ్రోజన్ గబగబా వదలి వేసేసేవారుట. అప్పుడు బెలూన్ నీరసపడి, వీళ్ళ బరువుని మొయ్యలేక ముందుకు పోతూఉన్నా అంతకన్న గబగబా కిందకి దిగిపోయేది. నేల్లో చెట్లూ చేమలూ ఉంటాయిగా. బెలూన్ బుట్టలో మనుషులు అవి చూసుకుని ఓ పెద్దతాడుకి లంగరులాటి కొక్కాలుకట్టి దాన్ని కిందకి వదిలేవారు. అది ఏ చెట్టుకొమ్మకో తగులుకుని, కళ్ళెంలాగ గట్టిగా బెలూనును ఆపేసేది. తరవాత అందులో మనుషులు దబుకూ దబుకూ దూకేసేవారు. లేదా మెల్లిగా తాడు లాగి బెలూన్‌ని కిందకు దింపుమని దిగేవారు. ఇలాటిస్థితిలోనే, ఇద్దరు బ్రిటిష్‌వాళ్ళు డా॥ జెఫ్రీస్, బ్లాంకర్ అని వారిపేర్లు — ఒకరోజున గాలి వీలుచూసుకుని డోవర్ దగ్గర పైకెగిరి ఇంగ్లీషు ఛానెల్ దాటి ఫ్రాన్సులో దిగారు. ఇంగ్లీషు ఛానెల్ బ్రిటన్‌కీ ఫ్రాంసుకీ మధ్యన ఉన్న సముద్రమంత నది. దీనివెడల్పు 22 మైళ్ళు. కేవలం గాలివాలు మీద ఆధారపడి ఇంతదూరం ఎగిరి వెళ్ళడం ఆరోజుల్లో అద్భుతం. ఎవరూ కలలో కూడా అనుకోలేరు. మొట్టమొదటిసారిగా ఇది చేసింది వీళ్ళే. 1785 జనవరిలో



ఇది విన్నవారూ కన్నవారూ కూడా దీనిగురించి ఆరోజుల్లో ఎంతో విడ్డూరంగా కథలు కథలుగా చెప్పుకునేవారు.

విమానాలు తయారైన తరవాత మొట్టమొదటిసారి ఈ ఛానెల్‌ను దాటినవాడు లూయీ లెరాయ్ అనే ఫ్రెంచి ఆయన. 1909 జూన్ 25వ తేదీన ఈయన ఇది సాధించాడు.

మధ్యలో ఆగకుండా రెండుసార్లు ఛానెల్ దాటిన కీర్తి సి. ఎస్. రోల్స్ అనే బ్రిటిష్ పెద్దమనిషికి దక్కింది. ఇతన్నే కంగారొపట్టాలి కాబోలని కంగారుపడకు, ఏంకే? ఈ రోల్సుగారు, ఆర్విల్ రైటు, విల్బర్ రైటు కట్టిన విమానంలోనే ఇది దాటాడు. ఇది 1910 లో జరిగింది.

విమానాలమీదకన్న బెలూన్‌మీద ఎగరడమే ఒకవిధంగా గొప్పకదా. ఇందులో ఎక్కువ ప్రమాదంఉంది. అది మనిషి ఎక్కడికి తీసుకెళ్తుందో చెప్పలేం. ఎప్పుడు పేలిపోతుందో, ఎప్పుడు నిప్పంటుకు భగ్గుమంటుందో (అంటుందిలే) చెప్పలేము. అలాటిది జరిగితే కథకంచికెళ్ళిపోతుంది. శత్రుసైన్యం ఎంతుందో చూసి వక్కాణిద్దామని ఈ బెలూన్ ఎక్కి వెళ్ళారనుకో. సరిగ్గా ఆ సైన్యం నెత్తిమీద, ఎత్తుగాఉన్న బెలూన్ గబుక్కున పేలిపోతే, గోవిందా అని ఇంగ్లీషు భాషలో అరుస్తూ ఇతగాడు సరాసరి శత్రువుల వళ్ళో పడతాడుగదా. ఆతరవాత వాళ్ళు ఇతన్ని మళ్ళీ గోవిందకొట్టించేస్తారు.

ఒకసారి గాషియార్, కాక్స్‌వెల్ అనే ఇద్దరు ధైర్యశాలులు ఇలాగే బెలూన్‌తో ఎగిరారు. గాలి అటూ ఇటూ తొయ్యనందువల్ల అది సరాసరి పైకివెళ్ళిపోయింది ఇంతా అంతా కాదు 37 వేల అడుగులు. అంటే సుమారు 7 మైళ్ళ ఎత్తుకి వాళ్ళని ఎత్తుకుపోయింది. మనం బాగా పైకివెళ్ళినకొద్దీ గాలి తక్కువైపోతుందిలే. వాళ్ళకి పాపం ఊపిరిపీల్చడానికి సరిపడేటంత గాలికూడా అక్కడలేదు. అంతపల్చగా తక్కువగా ఉందన్నమాట. ఊపిరాడక ఒకాయన మూర్ఛపోయాడట. రెండో అతను బెలూన్ బిరడాతీసి, దాని మెల్లిగా దింపాడనుకో.

ఇంకోసారి ముగ్గురు జర్మనీవాళ్లు ఉత్తర

# ★ విమానం కథ ★

ధ్రువం చూసివద్దామనుకున్నారు. 1897 జూలై 11 వ బుట్టలో రొట్టెలు, నీళ్ళు గ్రట్టా పెట్టుకుని ఒక పావురాన్ని వెంట పెట్టుకుని బయల్దేరారు. మూడో రోజున (13 వ తేదీ) పావురంద్వారా కబురంపారు. కులాసాగానే ఉన్నామూ, ప్రయాణం నెమ్మదిగా సాగుతోంది అని.

మళ్ళీ అప్పటినించి ఇప్పటిదాకా ఉత్తర ధ్రువంనుంచి ఉత్తరమ్ముక్క కూడా రాయలేదువాళ్లు...

ఇవన్నీ చూసి, ఇలాటి కథలు వినీ, పరిశోధకులు కొందరు కొత్త పద్ధతి రావాలన్నారు. బెలూను మనం చెప్పినట్టు విని తీరాలన్నారు.

కొందరు పైకి ఎగిరి వెళ్ళాక, ఆ బుట్టలో కూర్చునే, కొలనమీద పడవలవాళ్ళకిమల్లె గాలిలోనే తెడ్లువేసి ఊహూ ఆడించేవారు. కర్రతెడ్లు కావనుకో. కర్రతో చట్రంచేసి దానికి గుడ్డ బిగించేవారు. దాన్ని గాలిలో ఆడించేవారు. బెలూనును ముందుకు నడిపడానికి ఇలా చాలాసార్లు తిప్పలుపడ్డాక రెక్కలు నొప్పిపెట్టడం తప్ప ఇంకేమీ లాభంలేదని తేల్చుకున్నారు.

అపుడు బెలూను ఆకారమే మార్చేశారు. దానికి ఇంజను బిగించారు. మొట్టమొదటిసారిగా ఇది చేసినవాడు హెన్రీ జెఫర్డ్. పడవ ఆకారంలో ఈయన బెలూనుకట్టాడు. అదిచూడు. ముందు సన్నగా ఉండి పోను పోను లావుఅయి, మధ్యదాకా వచ్చాక మళ్లీ క్రమంగా సన్నబడిపోతుందిగదా. ఇలా అయితే అది గాలిని చీల్చుకుంటూ చురుకుగా పోవడానికి వీలు. గాలికి కూడా ఇదే పద్ధతి బాగుంటుందని ఆయనకి తట్టింది. అందుకోసం బుట్టబెలూనును మార్చి పడవలాటి—ఇంకా సరిగా చెప్పాలంటే దారచుట్ట ఆకారంలో ఉండేలా బెలూను తయారుచేశాడు. చాలాపెద్దదిలే. ఇక్కడ వేసిన బొమ్మలో, ఈ బెలూను కింద బుట్టనీ, అందులో మనుషుల్నీ చూస్తే, దాన్నిబట్టి ఇదెంత పెద్దదో తెలుస్తుంది. ఇది చేసిన జఫర్డ్ దీనికి ఆవిరియంత్రం ఒకటి బిగించాడు. దాని సహాయంతో తెడ్లు గబగబ, బలంగా ఊపబోయాడు కాని, ఇంజన్ చాలా చిన్నదయిపోయినందువల్ల అనుకున్నట్లు జరగలేదు.

అయినా, దీనివల్ల కొత్త ఊహలు వచ్చాయి. దీనితోటే విమానాలకథ మారిపోయి మంచిదారిలో పడింది. ఓడిపోతున్న కొద్దీ మనిషికి గెలవాలన్న పట్టుదల పెరిగింది. తాతగారు చెయ్యలేని పనిని మనవడు సాధించబోయాడు,

సరే ఈ ఆవిరియంత్రంతో ఇలా కుస్తీలు పడుతూ ఉండగా, పెట్రోలుతో మరలు తిరుగుతాయని ఎవరో కనిపెట్టారు. ఆయింజనుకో ప్రొపెల్లరు బిగించారు. గాలి పడవని ముందుకులాగే సాధనం అన్నమాట. 1897 లో ఇది వచ్చింది. దారచుట్టలాటి ఈ గాలిఓడకి కింద ఈ యింజను అమర్చి, ఓచివర తెరచాప కట్టారు. కప్పిలమీంచి తాళ్ళుపోసి, వాటిసాయంతో, పడవకి చుక్కానిలాగే ఆ తెరచాపని ఉపయోగించి గాలిఓడని కుడికీ ఎడమకీ మళ్లించడం నేర్చుకున్నారు. ఇది కనిపెట్టినాయన జర్మన్. పేరు డా॥ ఊల్ ఫర్ట్. ఆయన దీనిమీద ఎగిరినపుడు, ఒక ప్రమాదంవల్ల పెట్రోలు భగ్గుమనిమండి, అది బెలూన్ దాకావెళ్లి, బెలూను పేలిపోయింది....



దరిమిలాను 1901 లో బ్రెజిల్ దేశానికి చెందిన ఒక కుర్రవాడు ఇలాటిదే ఒకటిచేసి పైకెగిరి, ఫ్రాంసులోని ఈఫిల్ టవర్ చుటూరా తిరిగి మళ్లీ బయల్దేరినచోటుకి చేరుకున్నాడు.

“ఓహో! మనం గాలిని ఓడించాం. ఇంకనించి గాలి మనకింద కూలీ. మనయిష్టం వచ్చినచోటుకి విమానాన్ని తోలుకు పోవచ్చు” అని అందరూ చప్పట్లు కొట్టారు.

ఇంతమందిని సంతోషపెట్టే గొప్పపని చేసిన ఆ బ్రెజిల్ కుర్రవాడిపేరు శాంటాస్ డ్యూమాట్.

యంత్రం నడపడంలో పెట్రోలు తరవాత వచ్చిన గొప్ప సదుపాయం ఏదీ? విద్యుచ్ఛక్తి.

(ఇంకావుంది.)



## రైటుకి దగ్గిర

క్రిష్టప్పకి స్కూల్లో బహుమతిగా మంచి పుస్తకం ఇచ్చారు. అది పుచ్చుకుని ఇంటికి పరిగెత్తుకొచ్చాడు. వాళ్ల నాన్న అడిగాడు సంగతేమిటని.

“భూగోళం మాష్టారు అడిగిన ప్రశ్నకి నేనొక్కణ్ణే రైటు చెప్పాను. అందుకని ఇదిచ్చారు.”

“ఏమిటా ప్రశ్న?”

“ఇంగ్లండు ఎక్కడుందని అడిగారు. లండన్‌లో ఉందని నేను చెప్పాను.”

“నీ మొహం. లండన్‌లో ఉండటమేమిటి?”

“అది కాదునాన్నా. మిగతా వాళ్లంతా అమెరికా అనీ, ఆసియా అనీ, ఆఫ్రికా అనీ చెప్పారు. నేనొక్కణ్ణే కొంచెం దగ్గిర దగ్గిరగా రైటుచెప్పానుట.”

# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

వెల్లంకి వెంకటశేషాచలపతి శర్మ [సుర జాల, గుంటూరు జి॥], అన్నదానం శివ పార్వతి [హైదరాబాదు], చింతా వెంక టేశ్వరరావు [కాకినాడ, తూ. గో. జి॥], వంగాగామ నిర్మలకుమారి [ఆకివీడు, ప. గో. జి॥], పొరగు కృష్ణారావు [విశాఖపట్నం], రాజులదేవు జనార్దన్‌రావు [నిర్మల్, ఆదిలా బాదు జి॥], ఉప్పలూరి శ్రీధరరావు [విజయ వాడ], ఎస్. సత్యనారాయణరావు [తణుకు, ప. గో. జి॥] ముక్కవిల్లి వెంకటసరోజిని [మద్రాసు], మారంపూడి వెంకటేశ్వరరావు [హైదరాబాదు], కొయ్యాని వెంకటేశ్వర రావు [రాజమండ్రి, తూ. గో. జి॥], యస్. వి. లలిత [విశాఖపట్నం], సోమయాజుల వెంకటలక్ష్మి [విశాఖపట్నం], పేరి సుందరి [విజయవాడ], కర్లపాలెం శ్రీనివాసరావు [శృంగవరపుకోట, విశాఖజి॥] యజ్ఞమూర్తి శోభారాణి [గుంతకల్లు, అనంతపురం జి॥], బుద్ధా అప్పలనాయుడు [నాగులాపల్లి, విశాఖ జి॥] బెజవాడ శ్రీనివాసరావు [రాజమండ్రి, తూ. గో. జి॥], దువ్వూరి పద్మావతీదేవి [రాజమండ్రి], కంచర్ల లక్ష్మీచంద్రిమాల [పామర్లకోట, తూ. గో. జి॥]

వై. రాజారావు [విజయనగరం]. వంగూరి హనుమంతరావు [కాకినాడ, తూ. గో. జి॥], తిరుమల బదరినారాయణ [రాజమండ్రి, తూ. గో. జి॥], ఇంజేటి ఉషారాణి [బెంగుళూరు], మల్లాప్రగడ శ్రీకృష్ణారావు [విజయపురి నార్త్, ఆంధ్రప్రదేశ్], కళ్ళేపల్లి వెంకటనరసింహ పట్నాయక్ [భైరిసింగుపురం, శ్రీకాకుళం జి॥]. వజ్రపు జయలక్ష్మి [కాకినాడ, తూ. గో. జి॥], శిలా విశ్వభారతి [వజ్రకరూరు, అనంతపురం జి॥], కొంగముది వాణీనిర్మల [పూనా], కోట బాలసుబ్రహ్మణ్యం [వరం గల్]. యం. వి. అరుణాచలం [హిందూ పురం, అనంతపురం జి॥], వానపల్లి సూర్య కాంతము [సాలూరు, విశాఖజి॥], గుడుము నాగమణి [నాగపూర్], మరిపిల్ల నాగ రాజు [అల్లినగరం, శ్రీకాకుళం జి॥] గాదిరాజు రాజ్యలక్ష్మి [ముంగినాపల్లి, విశాఖ జి॥], అమరవాది చందలూరి మహాలక్ష్మి వత్సల [జగ్గయ్యపేట, కృష్ణా జి॥], కొడవెంకటపద్మావతి [తెనాలి, గుంటూరు జి॥], చిలకమర్రి వెంకటనారాయణాచార్యులు [అనపర్తి, తూ. గో. జి॥], యర్రా భ్రమరాంబ [పాయకరావుపేట, విశాఖజి॥], అల్లు వెంకటరావు [పాలూరు, శ్రీకాకుళం జి॥].

తేజోమూర్తుల సుభద్ర [ఏలేశ్వరం, తూ. గో. జి॥], ఈమని అప్పల నరసింహం [అన కాపల్లి, విశాఖ జి॥], బోయిన విజయలక్ష్మి [మచిలీపట్నం, కృష్ణా జి॥]. మంత్రిప్రగడ సీతారామమూర్తి [బరంపురం, గంజాంజి॥], గంద్రపాటి వీరరాఘవరావు [బొంబాయి], యం. శాంతం అపి [హనుమకొండ, వరంగల్ జి॥], కూరెళ్ళ శేష గిరి [విశాఖపట్నం], ధవళేశ్వరపు కుమారి ఇందిరా [మల్లమ్మపేట, శ్రీకాకుళం జి॥], నాళం నాగేశ్వరరావు (విజయవాడ) పిల్లాడ సీతామహాలక్ష్మి (రాజమండ్రి, తూ. గో. జిల్లా) పాలడుగు కనకలింగేశ్వరరావు (విజయ వాడ) తెంగిరాల శ్రీ వెంకట సుబ్రహ్మణ్య జానకిరామశర్మ (శివశంకరపురం, కృష్ణా జిల్లా) కూరాళ్ళ శారద (గుడివాడ, కృష్ణా జి॥) యల్లంరాజు రేవతిదేవి (వంగోలు, గుంటూరు జి॥) తపశ్రీ మురళీధర్ (రేపల్లె, గుంటూరు జి॥) కిడాంబి సంపత్ కుమార్ (అల్లూరు, నెల్లూరు జి॥) మండలీక సుబ్రహ్మణ్యం (కాకినాడ, తూ. గో. జి॥) గొడ్డంటి ఆంజనేయులు (తెనాలి, గుంటూరు జి॥) సిద్దాబత్తుని సాయిబాబు (గుంటూరు) కొండపాటూరి శ్రీ రంగశాయి (కొండ పాటూరు, గుంటూరు జి॥).

వి. సరోజిని (గండేపల్లె, కృష్ణా జి॥) బులుసు వీరవెంకటరమణమూర్తి (హైదరా బాదు) బాలదారి అలివేలు మంగతాయారు (కొవ్వూరు ప. గో. జి॥) చింతా అశోక్ (కాకినాడ తూ. గో. జి॥) నారు విజయమ్మ (ముత్తుకూరు, నెల్లూరు జి॥) నారద గోటి మురళీ గోపాలకృష్ణమూర్తి (గుడివాడ, గుంటూరు జి॥) ర్యాలి సింహాద్రిరాజు (కాకి నాడ, తూ. గో. జి॥) అయ్యల సోమయా జుల రామం విజయవాడ) (జి. ప్రతాపరెడ్డి (మహబూబాబాద్) యర్రమిల్లి రామకృష్ణా రావు (కాకినాడ, తూ. గో. జి॥) నడు కుదిటి సూర్యనారాయణరావు (విజయవాడ) చిల్కూరు కృష్ణమూర్తి (అయిజ మహ బూబ్‌నగర్ జి॥) ఆత్తలూరి శివాజీ (పార్వతీ పురం, శ్రీకాకుళం జి॥) బసివిరెడ్డి సూరి బాబు (వేగేశ్వరపురం, ప. గో. జి॥) చిత్రపు వరదరాజు (బరంపురం, గంజాం జి॥) కొమాండూరిమణి (పెదపాడు, ప. గో. జి॥) కంగుబూరి సుబ్రహ్మణ్యం (ఉయ్యూరు, కృష్ణా జి॥) యల్లాప్రగడ ఉషారాణి (రేపల్లె, గుంటూరు జి॥) బచ్చోటి శివరామారావు (ఏలూరు, ప. గో. జి॥) దంతులూరి శ్రీ రామచంద్రరాజు (రామ చంద్రపురం, తూ. గో. జి॥).

వాల్మీకి వెంకటప్ప (ఉరవకొండ, అనంత పురం జి॥) సూర్యదేవర అరుణాజ్యోతి (వేములపల్లి, కృష్ణా జి॥) దంతులూరి వెంక టేశ్వరరాజు (రామచంద్రాపురం, తూ. గో. జి॥) కొళ్ళకూరి అలివేలు మంగతా యారు (అమలాపురం, తూ. గో. జి॥) సాలూ కూరి ప్రభావతి (గుడ్లవల్లేరు, కృష్ణా జి॥) మోగంటి సుబ్బరాయుడు (రామచంద్ర పురం, తూ. గో. జి॥) తాడిమేటి రాఘవ రాణి (ఏలూరు, ప. గో. జి॥) నండూరి శ్రీ రామచంద్రమూర్తి (రాజమండ్రి, తూ. గో. జి॥) గోగులపాటి సత్యశ్రీ (కర్నూలు) నీరు కొండ హైమావతిదేవి (కొవ్వూరు ప. గో. జి॥) ఆదిరాజు స్వర్ణకుమారి (గుంటూరు) మోహన్‌దాస్ కూనపరెడ్డిగాంధీ (మచిలీ పట్నం, కృష్ణా జి॥).

కూనపరెడ్డి రాజేంద్రప్రసాదు (మచిలీ పట్నం, కృష్ణాజిల్లా) ఘాలి తిరుమలరాయ శర్మ (ఏలూరు, ప. గో. జిల్లా) బూసా మోగ్యనారాయణమూర్తి (గుంటూరు) కొత్త లక్ష్మీ సామ్రాజ్యము (విజయవాడ) నిట్టల సుబ్బలక్ష్మి (పొదలాడ, తూ. గో. జిల్లా) కొమ్మరాజు మోహనరావు (కొత్తరెడ్డి పాలెం, గుంటూరు జి॥) వసుమర్తి సూర్య ప్రకాశ గాంధి (విజయవాడ) గూడూరు సాంబమూర్తి (ఏలూరు, ప. గో. జి॥)

గూడూరు పార్థసారథి (ఏలూరు, ప. గో. జి॥) యం. విజయకుమారి తిరుత్తణి, చిత్తూరుజిల్లా) గడియారం జయశ్రీ (ప్రొద్దు టూరు, కడపజిల్లా) పులవర్తి వెంకటరామ కృష్ణశాస్త్రి (ఇసకపల్లి నెల్లూరుజిల్లా) దుగ్గిరాల జయభారతలక్ష్మి (ఏలూరు ప. గో. జి॥) కంభంపాటి ఉమానాథ (చీకల పూడి, కృష్ణా జిల్లా) కోట వెంకటలక్ష్మమ్మ (ఒలేటివారిపాలెం, నెల్లూరు జి॥) అడాల సూర్యప్రభాకర్ (కుందుగోలను, ప. గో. జి॥) ముత్తుకుమల్లి విద్యాసాగర్ (తిరుపతి, చిత్తూ రు జిల్లా) ముత్తుకుమల్లి సావిత్రి (తిరుపతి, చిత్తూరుజిల్లా) ధూళిపూడి అమ రవతి (కాకినాడ. తూ. గో. జి॥) గడ్డం ఝాన్సీరాణి (విజయవాడ) దావలి సరోజిని (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) అరవ సత్య నారాయణమూర్తి (రాజమండ్రి, తూ. గో. జి॥) సుభాషిణి (హోళగి, అనంతపురం జిల్లా) ఆముదాలపల్లి స్వరాజ్యం (సత్తెనపల్లి గుంటూరు జి॥) రామానందుల శ్రీనివాస మూర్తి (ధర్మవరం అనంతపురం జి॥) కరణం (వసంతమ్మ) (విరుపాపురం. కర్నూలు. జి. మద్దాళ త్రిగుణసంపన్నశాస్త్రి (విజయవాడ) పల్లపోతు రామకృష్ణ ఆర్య (రేపల్లె గుంటూ రుజిల్లా)

కొల్లావానుమసుబ్బప్పల (తాడికొండ, గుంటూరు జి॥) యస్. విజయ (సికింద్రా బాదు) కొసారాజుబాబు (మునులాలపేట, నెల్లూరు జి॥)



# ★ రెండు పడుులు ★

[24-వ పేజీ తరువాయి]

మీద కూర్చో అబ్బాయ్!" అన్నారు.

మధు కూర్చుంటూ ఆయనడిగిన ప్రశ్నకు సమాధానంగా "నేను ప్లీడరు రామనాథం గారి కొడుకునండి. నన్ను మధు అంటారు" అన్నాడు సవినయంగా. "ఓహో; నువ్వటోయ్! రామనాథం నన్ను బాగా యెరుగును. మనం మనం చుట్టాలంకూడాను...... మా రఘు చెప్తుండేవాడు నిన్ను గురించి. నీ గుణగణాల సమానం యేకరువు పెట్టేవాడంటే నమ్ము. గుణవంతుడొక్కడైనచాలు, గుణహీనులు వేవురున్నా తల్లిదండ్రుల కడుపు చేటే కదటోయ్..... మావాడిప్పుడు రాజమండ్రీలో పనిచేస్తున్నాడు. ప్రయోజకుడని అననుగాని, అప్రయోజకుడు గామాత్రం యెన్నలేను."

మధు నవ్వి "మీమాట బావుంది...ఇంతకీ రఘు మీ అబ్బాయా?" "అవునయ్యా!... ఒసేవ్ లక్ష్మీ! ఎక్కడే?"

లక్ష్మి ఒక్క అదటున వచ్చి "ఏం నాన్నా?" అడిగింది.

"అమ్మాయ్! అక్కకు సహాయపడి కాఫీ పెట్టించి తీసుకురా; మన చుట్టాలే అని చెప్పు."

"అలాగే నాన్నా!" అంటూ వెళ్ళిపోయింది.

కాఫీ త్రాగాక తలవని తలంపుగా తటస్థపడ్డ వీరి బంధుత్వానికి పులకాంకుడై వస్తుంటానని చెప్పి మధు వెళ్ళిపోయాడు!

అంతా అడ్డసుడిగా జరిగినందుకు ఆ రాత్రంతా విచారంతో కమలకి నిద్ర పట్టలేదు. ఇంత అవాంతరం వచ్చిపడుతుందని ఆమె కలలోకూడా ఊహించి ఉండలేదు. కొరివితో తల గోక్కోడం అయింది క్రితం వచ్చినవాడు చుట్టరికాలు తిరగేయించి మరీ చక్కా పోయాడు. గొప్పవాడు కన్న తన తండ్రి గౌరవాన్ని చేపట్టి అంగుళోగలాడు. దీనికితోడు తన అన్నకి హితుడటకూడా! లక్ష్మి యీ సంగతి చెప్పుయెంత ఉత్తేజిత అయిందో! అది వేణుతో తను మాట్లాడితే కళ్ళలో నిప్పులోసుకుంటారు. కేవారికళ్ళు చారెడేసిట! వేణు తప్పుపని చేశాడు; ప్రాయశ్చిత్తంగా ఆ రెండు పదినోట్లూ మధు మొహాన విసిరికొట్టవలసింది! వేణూ, మధూ స్నేహితులు?——ఇదే ప్రశ్న పదే పదే వచ్చి రెండు అయేవరకూ పీక్కుతింది శేషరాత్రి పీడకలలతో గడిచిపోయింది.

రోజులు దొర్లి పోతున్నాయ్ కాలచక్రంలోపడి. వేణు కమలపాలిటికి బ్రహ్మదేవుడై కూర్చున్నాడు. నిరాశ ఎక్కువవుతూంది. వీటితో నిస్తేజ అవుతూంది......

మధు తరుచుగా తమ యింటికి వస్తునే ఉన్నాడు. తండ్రి మన్ననకు పాత్రుడయ్యాడు. అద్వయం యేవో కబుర్లతో వెళ్ళబుచ్చేవారు. వారి భాష తన కర్ణపుటాలను చేరి ఘోష చేస్తోంది. మధు తమ యింటికొక ఆప్తుడంటూ అయ్యాక యింతో అంతో యితోధికంగా తనకు ముట్టుతూనే ఉంది. ఆ సహాయం అనర్థహేతువే అని తన అంతరాత్మ ఘోషిస్తూంది. తన భావన చేసిన ఆ దురాగతాన్ని రూపుమాపలేదు. రూపుమాపే శక్తి ఆమెలో లేదుకూడా. మధు స్థానబలిమి ముందు తనేం గడపోన!

ఇలాగే యెన్నో దినాలు, మాసాలు గడిచిపోయాయి చివరకు వేణు కన్పించి యేడాది దాటిపోయింది. ఇంక రాడు అనుకుంది కమల. తనలో కోరికలను రేకెత్తించాడు. వాటికి బీజాన్ని నాటి పెంపొందింపచేసి ఆ మొక్కను కూకటి వేళ్ళతో పెద్దదవకుండానే పెల్లగించి వేస్తాడనుకోలేదు.

తండ్రికి నాల్గు రోజులనుంచి తీవ్రంగా జ్వరం కాస్తూంది. రఘు వచ్చాడు. మధు వచ్చి యించుమించుగా ఆయనకు వెట్టిచాకిరీ చేశాడు. ఎంతో డబ్బు డాక్టరుకని రఘు చేతిలో పోయటం కమల చూస్తూనే ఉంది. మధు అంత ఆర్ద్రహృదయుడని యీనాటికే తెలుసుకోగలిగింది. మధుని చూస్తుంటే జాలివేస్తూంది.

ఆరోజున రఘు యేవో మందులు తేటానికై వెళ్ళాడు. మధు అప్పటివరకూ కమల తండ్రి ప్రక్కదగ్గర కూర్చుని దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు. కమల ఒకటి రెండు సార్లు గదిలోకి వచ్చి తిరిగి వెళ్ళిపోయింది. అప్పటికే పన్నెండు దాటుతూంది. ఎండ తీవ్రంగా ఉంది. మధు కప్పటికి తన భోజనం మాట జ్ఞప్తికి వచ్చి లక్ష్మిని తండ్రివద్ద కూర్చో నియమించి మెల్లిగా తలవంచుకుని వీధి సావట్లోకి వచ్చాడు. కమల నెదురుగా చూచాడు. కాని ఉత్తరక్షణంలోనే దృష్టిని మరల్చుకుని వీధిగుమ్మంకేసి సాగాడు.

ఆర్ద్ర కంఠంతో "ఆగండి ఒక్క సారి" అంది కమల.

మధు ఆగి వెనక్కి తిరిగి చూశాడు. కమల వచ్చి పాదాలంటబోయింది. ఆమెను వారించి "మీరు చేసేపని నాకేం నచ్చలేదు" అన్నాడు.

"దృష్టాంతరహితంగా మిమ్మల్ని పట్టి మూర్ఖత్వంతో యింతకాలం అసహ్యించుకున్నాను. మీ చేష్టను గర్హించినా సరే మిమ్మల్ని అనవసరంగా బాధపెట్టాను. మీ నిజగుణాన్ని యీనాటివరకూ అర్థం చేసుకోనందుకు నన్ను మీరు మన్నించక పోతే" కంఠం జీరయిచ్చింది; కళ్ళు చెమర్చాయ్.

మధు మనసుపడి ఆమె అమాయకత్వానికి మందలింపుదృష్టితో "ఛ! అలా కన్నీరు కారుస్తే నేను కూడా నీ అవస్థకే రావల్సి వస్తుందని గుర్తుంచుకో కమలా! ఒకరి స్వభావాన్ని మరొకరు పూర్తిగా ఆకళింపులోకి తెచ్చుకుని కలసిపోవాలంటే కనీసం ఆరు నెలలకిగాని జరగదు. నీ తప్పుమాత్రం యేముంది కన్నా. అర్థం చేసుకోటంలో పొరపాటు జరిగిందంతే. ఇప్పటికైనా తెలుసుకోగల్గావు, సంతోషమే" అని ఆమె తప్పిదాన్ని తప్పుకానట్టుగానే వాదించి ఆమె హృదయాన్ని తేలిక చేశాడు.

కమల యీ సారి ఆనందబాష్పాలు రాల్చింది.

మధు ఆపూటకు అక్కడే డిన్నర్ తీసుకోవడం జరిగింది. కమల తేహృదయం తండ్రి పుట్టెడు రోగంలో ఉన్నాసరే ఆ

పూటకు మాత్రం పురులు విప్పుకుని నాట్యం చేయసాగించింది కూడ!

కమల తండ్రి మృత్యుదేవత కబంధ బాహుబంధంనుండి విడిపడటాన్కి వాల్లు రోజుల వరకూ పెనగులాడి పరాజయం పొందారు. ఇల్లు గుల్లయింది! గది తెల్లబోయింది! సంసారం కాళీఅయింది!... ఆ పదిరోజులూ గడిచాక కమల లక్ష్మి ఆ కొంపకు నీళ్ళు వదులుకుని రాజమండ్రీ తరలిపోయారు.

* * *

వేణు కిప్పటికొక ఉద్యోగం అంటూ స్థిరమయింది. ఈ అవకాశం కోసమే అతను యెదురుతెన్నులు చూచాడు. ఒక నెల పనిచేసి ఒకవారం వరకూ సెలవు తీసుకుని ట్రెయిన్ఎక్కాడు. అతనిప్పటికి పూర్తిగా స్వతంత్రవ్యక్తి అయ్యాడు. రెండేళ్లు దాటుతూంది కమలను చూచి. ఎంత మారిపోయి ఉంటుందో! తనలో మాత్రం యేవిధమైన మార్పు రాలేదు. మరి హృదయం కమల కోసం పలవరిస్తూంది... ఆనాడు తను కలుసుకున్న కమల ఆకారం పదేపదే స్మృతికి వస్తూంది. అప్పుడు తను బయటపడాక కమలను తనొక అర్జనపరుడయ్యేదాక చూడకూడదని నిశ్చయించుకున్నాడు. దొంగచాటుగా ఆమెను కల్సుకుని ఆమె తల్లితండ్రుల కళ్లలో దొంగగా కే ద్గొతూ దుండగునిగా యెంచబడటంకన్నా కమలను చూడకుండా ఉండటమే ఉత్తమంగా భావించాడు. తనగురించి చెడుగా కల్లరినోళ్ళ నుండి వింటె తను తపనపడక లెక్కచెయ్యకుండా ఉండాలన్నా సంఘం తన వేయినాల్కలతోటి వెక్కిరించటాన్కి ప్రయత్నిస్తుంది. పరపతిని పోగొట్టుకుంటె తర్వాత కాలం కర్మంగూడి బ్రతుకు తెరువు దుర్భరం కంటకప్రాయంగా రూపొందే అవకాశాలున్నయ్... తన వగకం కమలకు చెప్పి చక్కా రావటసింది. తనరాక కరువయినందుకు కుమిలికుమిలి క్రుళ్ళి క్రుళ్ళి యేడ్చి ఉంటుంది!... తనేంచేస్తాడు? పరిస్థితులలా తన్ను విడదీయాలని కాచి పెట్టుకు కూర్చుంటే!... దీనికి లక్ష సుమాపణలు చెప్పుకున్నా తీరదికాదు. ఆమె యిష్టానుసారంగా తల్లితండ్రుల కోర్కె అయినాసరే పెళ్ళిచేసేసకోవాలి. తన తల్లితండ్రులు మాత్రం తనమాట యెందుకు కాదంటారు, తనొక ప్రయోజకుడైంటూ అయ్యాక?...అందుననూ మునుపటిలా కాక తండ్రి తన్ను ప్రేమగానే చూస్తున్నాడు. ఆయన పంచప్రాణాలూ యిప్పుడు తనమీదకే కేంద్రీకరించబడుతున్నయ్. తను ఆడినదే ఆటగా పాడినదే పాటగా ఉన్నదిప్పుడింట్లోని పరిస్థితి. తన్ను కాదని చేసేవారెవరూ లేరు. కాదని ఒకవేళ అలా చేయటాన్కి విశ్వప్రయత్నంచేసినా విముక్తులు కాలేరు. అజన్మాంతం బాధపడతారు, బాధపెడతారు. ప్రయోజనం సున్న.

వేణు ముఖ్యంగా యిప్పుడు చెయ్యతల్చుకున్న పనులు రెండు. ఒకటి కమలను కలుసుకోటం. రెండవది: ముసలికి అప్పటినుంచీ బాకీపడే ఉన్నాడు. తీసుకున్న డబ్బు తిరిగి యివ్వటంలో ఆలస్యంఅయింది. ఆ యిరవై రూపాయలూ యివ్వటం జరగాలి.

బస్సుదిగాక ఉత్సాహంగా పెద్దపెద్ద అంగలువేసుకుంటూ కమల యింటిదారి పట్టాడు. అప్పటికీ యిప్పటికీ ఆ టౌన్లో తనుచూచే మార్పేమీలేదు. మ్యునిసిపల్ గ్రంధాలయపుటావరణలో మాత్రం గాంధీ స్తంభం ఒకటి కొంతనూతనంగా తయారయి బోడిగా ఉంది. అదేమనుష్యులు! విసురుగా వెళ్ళిపోతున్న వాడల్లా హఠాత్తుగా కమల యింటిని నిశ్చేష్టతతో చూస్తూ నిల్చుండిపోయాడు. ఇంటితలుపుకి తాళం కొట్టవచ్చినట్లు వ్రేలాడుతూ వేణును హేళనచేస్తూందా అనిపిస్తూ కనిపించింది. గుండె ఆగిపోయే పర్యంతం అయి తమాయించుకుని ఆవేశంతో చుట్టుతిరిగి పెరట్లోకి వెళ్ళాడు. వేకను

# ★ రెండు పదులు ★

చేటుకు దుష్ఫలితం వచ్చేసింది. కొమ్మలు కొన్ని యెండిపోయాయి. తులసిమొక్క ఆనవాలుకైనా లేకుండాపోయింది. అదే దారుణులు అస్పష్టంగా అవుపించాయ్ నేలమీద. వడిగా వెళ్ళి అక్కడ కూలబడ్డాడు. ఎంతోసేపు హృదయం పగిలేట్టు విలపించాడు. ఎవరూ అతని యేడుపులో పాలు పంచుకోలేదు! ఒకవేళ పంచుకున్నా ఆ వేదన ఒకటే. దానికి తేలుదు యింకా వేణుబాధ. చిరస్మృతులెన్నో తెరలు తెరలుగా కలిగి చింతపాల్జేస్తున్నయ్... అదే ప్రదేశంలో తనుకూర్చున్నాడు. ఇటిక గొంతు తెచ్చుకుని యెదురుగా ఆమె కూర్చుంది. తను సిగరెట్ వెలిగించుకున్నాడు. తర్వాత రెండు పదినోట్లు యిచ్చాడు. తను పాటపాడమన్నాడు. ఇది సమయంలో వాళ్ళతండ్రి కేక... ఆఖర్న వాళ్ళచెల్లి వచ్చింది... ఇలాగే యెన్నో క్షణాలు అనిమిత్తంగానే గడచిపోయాయి. తన్ను యీ బాధనుండి విముక్తుడిని చెయ్యటానికి కాస్తై ఆ ఆదిశేషుడే అవతారం దాల్చి వచ్చాడా అన్నట్లుగా ప్రక్కగా చప్పుడు చేసుకుంటూ పాము వెళ్ళిపోయింది. ఆ పరిస్థితి పాముంటే కూడ భయంలేకుండా చేసింది. ఒక్కటే దండంపెట్టి కొట్టుకుంటూ వీధిలో పడ్డాడు. భాస్కరుని బలిమి క్షీణించి నీరెండలతో వెలుగొందుతున్నాడు. తన హృదయంకూడా దౌర్బల్యం పొందుతూంది. కమల యెక్కడ ఉందా అన్నదే ప్రశ్న!

రోడ్డుమీద ఒకచోట ఆగిపోయాడు. అదే ప్రదేశం తనకి కమలతో పరిచయం కల్పించింది. అప్రయత్నంగానే ఆచోటు అతడి నుండి రెండు కన్నీటిబొట్లు తీసుకుంది. పూర్తిగా జుట్టు కల్లబొల్లిగా తయారయింది. ముసల్లా అయిపోయాడొక్కసారి! ఎదరకి నడుస్తున్నాడు.

"వేణూ! నువ్వా?"

తిరిగి చూచాడు. మధు!

"అలా ఉన్నావేం? రా; సైకిలెక్కు. ఇంటికి పోదాం."

మరోమాట చెప్పకుండా అతని సైకిలెక్కాడు. ఇద్దరూ పేరుమోసిన ప్లీడరు రామనాథంగారి మేడముందు ఆగారు. మధు గేటు తెరిచి లోపల ప్రవేశించాడు.

వేణు అతడి ననుసరిస్తూ "ఈ యిల్లు మీదా! రామనాథం గారిది కదూ?"

"మాదే. రామనాథంగారు మా నాన్న గారలే."

వేణు కొద్దిగా అబ్బురపడ్డాడు. చటుక్కున స్మృతికి వచ్చింది – కమల విరించి విరచిత శిల్పాన్ని అనేది. పోనీ మధునడిగితేనో ఆమె యెక్కడికి వెళ్ళినది? కాని అడగ బుద్ధిపుట్టలేదు. మంత్రముగ్ధునిలాగ మధు వెంటపడ్డాడు.

వేణు "విధి హాలులో" కూర్చున్నాడు కుర్చీలో. మధు యెందుకో లోపలకు వెళ్ళి తిరిగివచ్చి వేణు కభిముఖంగా యింకో కుర్చీలో కూర్చున్నాడు. చిరకాలానికి కల్సుకున్నారేమో స్నేహితులిద్దరూ తమ్ముతాము మరచి యిష్టాగోష్ఠి జరుపుతున్నారు.

మధుభార్య రెండు కప్పులతో కాఫీ పట్టుకొచ్చి టేబిలుమీద ఉంచి వెనుతిరిగింది.

వేణు మధునిచూస్తూ "నీదగ్గర యెప్పుడో యిరవై రూపాయలు తీసుకున్నాను. ఇవ్వలేకపోయాను. ఇవిగో తీసుకో" అంటూ తీసి అందివ్వబోయాడు.

"ఆగండి!"

వేణు అదిరిపడి అటు చూచాడు. కమల!

అతడి పెదవు లల్లాడాయ్. ఒక్కసారిగా ఉచ్ఛస్వరంతో "నువ్వా కమలా! ...నువ్వు మధుకి—"

"భార్యను ... మీ రీయవలసిన డబ్బు యేనాడో నాకిచ్చేశారు ... ఇక యివ్వనక్కరలేదు" కన్నీళ్లు తిరిగి ఉబికే దుఃఖాన్ని కష్టంమీద అదుపుచేసి చీరకొంగు ముఖానికడ్డం వేసుకుని అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మధు వేణుకేసి వాళ్ళ కమలకేసి అయోమయంగా చూస్తూ కూర్చుండిపోయాడు! ఫాన్ గాలికి వేణు చేతిలోని రెండుపదులూ అతనివళ్ళోపడి తర్వాత కుర్చీ కమ్మి మీదుగా కిందనున్న కొద్దిసేపు గంతులువేసి వేణు కాళ్ళకున్న రెండుబూట్ల మధ్య ఖాళీలో యిరుక్కుపోయాయి! ★

# ★ కలలో కైలాసం ★

(36-వ పేజీ తరువాయి)

దహించుకు పోతుంటే అంతలో తను తెచ్చుకున్న ఆహారం కూడ మాయం చేశాడయ్యో. "నీవు ఒట్టి మోసగాడివి. ఎవరో పెట్టకువెళ్ళిన తిండి తినడమే కాకుండ నేను తెచ్చుకున్నది కూడ మింగేశావు. దౌర్భాగ్యుడా" అన్నాడు ఏడుపుకంఠంతో.

"అది నా తప్పా. నీవు తినమంటే నే తిన్నా నా మరి. అయినా తినే ముందు కొంచెం ఆలోచించాను తినడమా మానడమా అని. కైలాసంలో ఆతిథ్యం అన్నారు. అంత చక్కని భోజనం చేశాక ఈ చద్ది అన్నం, ఎండిపోయిన రొట్టెలు, మాగిపోయిన పండ్లు మీరు ఎలాగూ తినలేరుగదా అని తినేసి మీ ఆజ్ఞ అక్షరాలా నెరవేర్చాను. కోప్పడకండి. ఇక నా దారిన నేను పోతున్నాను," అని చెప్పి వెళ్ళిపోయాడు గొడ్లకాపరి.

తన తెలివి తక్కువతనానికి, తననితానే నిందించుకొంటూ, కలను తలుచుకొని విసుక్కొంటూ ఆకలితో నేతూలుకుంటూ వెళ్ళిపోయాడు రైతు. ★

సంతోషం ఘుమఘుమాయించే సెంటులాంటిది. ఇతర్లమీద చిలికితే నీ మీద కూడా కొన్ని చుక్కలు పడకుండా ఉండవు.

— ఎమర్సన్.

* * *

ఉత్సాహం కోల్పోయినవాడి కంటే బీదవాడు ప్రపంచంలో ఎక్కడా ఉండడు. ఉత్సాహం ఒక్కటే మిగిలి మిగతాదంతా పోయినా, మళ్ళీ అన్నీ సంపాదించుకోగలడు.

హెచ్. డబ్ల్యు. ఆర్నాల్డ్



# వనితా లోకం





## ఆఫీసులూ ఆడవాళ్ళూ :

# "మా ఆఫీసులో పనిచేస్తున్న పిల్ల తెలుసా?"

మా ప్రక్కవాటాలో ఒకరు అద్దెకు వుంటున్నారు. ఆయన రోజూ ఇంటికి రాగానే భార్యతో, తన ఆఫీసులో ఒక అమ్మాయి పనిచేస్తోందని, ఆ అమ్మాయి ఇలా చూస్తుందీ, అలా చూస్తుందీ, చాలా షోకుగా వస్తుంది. ఒకే టెంపరూ అసలు ఆఫీసు పనే తెలీదూ అంటూ అదేపనిగా చెబుతూ వుండేవాడు.

"ఆయినా ఆడవాళ్ళకు వుద్యోగం ఏమిటి ఏదో ఆడవాళ్లుకదా అని యిచ్చారు" అని ఆవిడ అనేది.

ఆయన ఇంటికి రాగానే రోజూ ఒకగంట సేపు ఆ అమ్మాయి మాటలే చెప్తూవుండేవాడు. నేను రోజూ ఆ మాటలు అంత పట్టించుకు వినేదాన్ని కాదు. దానికి కారణం నేనుకూడా ఏదో కాస్తో కూస్తో చదువుకున్నదాన్ని అవటంవలన. ఒకరోజున ఆయన గబగబా వచ్చి "ఏమేవ్ ఆ అమ్మాయికేం, [illegible]కి వుత్తరం వచ్చిందే. తనలోతనే నవ్వుకుంటోంది" అని అంటున్నాడు.

"అవును మరి వుత్తరాలు రావు? ఆడది వుద్యోగం చేస్తుంటే ఎవరైనా రాస్తారు" అందావిడ.

"ఈరోజు మధ్యాహ్నంపూట కాఫీకూడా ఇస్తాడు మేనేజరు! ఇద్దరూ ఒక ప్లాస్కులోకే తెప్పించుకుంటారు" అంటున్నాడాయన. ఆడదానికి ఈడువచ్చాక పెళ్ళి చేయకపోతే ఎన్ని అనర్థాలకైనా దారి తీస్తుంది. తల్లిదండ్రులు డబ్బుకు ఆశించి వుద్యోగం చేయమంటారు. కాని ఆడది డబ్బుదగ్గర పెట్టుకు చేస్తుందా? అయినా [illegible]టక్లోను చదివిన పిల్లకి, మీ వుద్యోగం వంటి వుద్యోగం యిచ్చారా? అవును ఆడది ఆయెను. ఎవరైన ఇస్తారు ఈ రోజుల్లో ఆడది వీధిలోకి వెడితే చాలు" అంటోంది ఆవిడ.

ఆ రోజే నేను సినిమాకి వెడదామని రిక్షా కోసం ఎదురుచూస్తూ వీధిలో నుంచుని వాళ్ళ మాటలు ఆలకించాను. నాకు నిజంగా ఆశ్చర్యం వేసింది. సినిమాలో కూర్చున్నా నన్నమాటే కాని వాళ్ళ మాటలే జ్ఞాపకం వస్తున్నాయి. ఎవరో ఇంతలో నా వీపుమీద చెయ్యివేసి "ఏమే ఇక్కడ వున్నావే" అన్నారు. నేను ఎవరో అని వెనక్కి చూచాను. నా స్నేహితురాలు కమల. చిన్నతనంలో అది నేనూ ఒకచోటే చదువుకున్నాం. మా ఇద్దరిదీ ఒక్కవూరే. మా ఇంటికి వాళ్ళ యింటికి దూరం అవటంచేత క్షేమసమాచారములు తెలిసికొనుటకు దూరమయాం.

పిల్లలమర్రి భ్రమరాంబ
(గోపాలపురం)

"మా అన్నయ్యకి ఈ వూరు ట్రాన్స్‌ఫర్ అయిందిగా......అయితే నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు" అన్నాను.

"అంతా తరువాత చెపుతాగా. మీ ఇంటికి వస్తా. అడ్రసు చెప్పు" అంది. ఇంతలో సినిమా మొదలుపెట్టటంచేత ఆ పైనేవు మాట్లాడుకోలేదు.

* * *

మర్నాడు ఆదివారం మవటంచేత మా యింటికివచ్చింది. తను బి. ఎ. చదివాక టైపు, షార్టుహాండ్ పాసైనానని, ఇక్కడ వాళ్ళ మేనమామ ఆఫీసులో మేనేజరుగా వుంటున్నాడని చెప్పింది. "అనవసరంగా వూరికే ఇంట్లో పెళ్ళి అయేదాకా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోటం ఎందుకని వాళ్ళ మేనమామ పట్టుమీద జాయిన్ అయినా"నని చెప్పింది.

"నీ పెళ్ళి విషయం ఏమైంది? మీ బావ చదువు అయిందా" అన్నాను. "ఇంకా ఒక్క ఏడాది వుంది. అమెరికా వెళ్ళిన తరువాత చాలా బాగా వుండేది. నెలకు రెండు నెలలకు వుత్తరాలు వ్రాస్తూ వుంటాడు. ఈ ఏడాది ఏమైనా సరె పెళ్ళి చేయాలని మా వాళ్ళు చూస్తున్నారు. ఈ నెలలో జవాబు రావటంతోటే అయిపోతుంది" అంది సన్నగా నవ్వుతూ. మా ప్రక్కవాటా ఆవిడకూడా ఈ మాటలన్నీ వింటూనే కూర్చుంది.

"అదృష్టవంతురాలివమ్మా. బి. ఎ. చదివిన పిల్లలెవరూ ఇంత గర్వం లేకుండా వుండరు. మా వారి ఆఫీసులో పనిచేస్తోంది ఒక అమ్మాయి. స్కూలు ఫైనలు ప్యాసు అయిందో లేదో మావారి వుద్యోగంలాంటిదే యిచ్చారుట. ఆఫీసు మేనేజరుతో వికవికలు పకపకలూనట. మావారు రోజూ చెపుతూ వుంటారు. రోజూ ఏదో ఉత్తరం వస్తూనే వుంటుందిట. అదిగో మావారు వస్తున్నారు ఇంక సెలవిక" నంటూ వెళ్ళిపోయింది మా ప్రక్కవాటా ఆవిడ.

ఇంతలో మల్లెపూల కేక విన్పిస్తే పిలుద్దామని మా ఫ్రెండు వీధిలో నుంచుంది. మా

(47-వ పేజీ చూడండి)



# పొరపొచ్చాలు

ఎం. కనకదుర్గ

పెందరాళే భోజనాలు తెమల్చేసుకుని తాంబూలం వేసుకుంటూ, వాళ్ళనీ వీళ్ళనీ వేళాకోళం చేసుకుంటూ కూర్చున్నారు సుబ్బారావూ సీతానూ. కబుర్ల మీద కబుర్లు, కథలమీద కథలు చెప్పుకుని విరగబడి నవ్వుకుంటున్నారు. గంటలు క్షణాలలో పరిగెడుతున్నందువల్ల, గడియారం ఆ వేగంతో పోటీచేయలేక ఆవేశంతో తొమ్మిది గంటలు కొట్టింది ఇహ చాలు అనిధ్వనిస్తూ.

ఓక నిముషం క్రితమే ఒక జోక్కు రెండు నిముషాలపాటు నవ్వి అలిసిపోయిన సీత మంచం పట్టెమీద చేరగిలబడి కళ్ళుమూసుకుంది. సుబ్బారావు మంచంమీద పడుకుని ఇంకో తెలివైన విట్టుకోసం పేపరు కెలుకుతున్నాడు.

సీత, చాపమీద తమలపాకు ఒకటి తీసుకుని శ్రద్ధగా పరిశీలిస్తూ భగవంతుడి శిల్పచాతురికి ఆశ్చర్యపడుతోంది.

"సీతా చూశావా! సిడ్నీ సిల్వెస్టర్ తో పెళ్ళైనా విడాకులు తీసుకున్నాడు చూశావా?" అన్నాడు సుబ్బారావు హఠాత్తుగా ఉలిక్కిపడి లేచి కూర్చుని.

సీత కూడా ఉలికిపడింది.

"అరరె! ఎంత పని జరిగింది! ఎప్పుడుటా?" అంది ఆందోళనతో.

సుబ్బారావు పేపర్లోకి తొంగిచూసి, "జూన్ 12. అంటే నిన్న అన్నమాట" అన్నాడు విచారంగా.

"అయితే ఏమండీ! ఇంతకీ సిడ్నీ సిల్వెస్టరంటే ఎవరాయనా?" అంది సీత కళ్ళు పెద్దవి చేసి, అమాయకత్వానికి అభినయం పడుతూ.

"ఏమో నాకూ తెలీదుస్మీ" అన్నాడు సుబ్బారావు విచారంగా.

ఆ క్షణంలో ఇద్దరూ మళ్ళీ పొట్ట చెక్కలయేలా నవ్వుకున్నారు. పెరట్లో చెట్టుమీద పిట్టలజంటలో, పెంటది, "వాళ్ళని చూసన్నా బుద్ధిదెచ్చుకోరాదూ...ఎప్పుడూ

నీవి(దానువ్వ్యాను... ఓ ముద్దూ ముచ్చటా లేదు" అని సాధించింది.

* * *

సుబ్బారావుకి సీతకీకూడా ఇష్టమైన వాటిలో భమిడిపాటి కామేశ్వరరావు పుస్తకం, వంకాయకూరా, రేలంగి, సిలోన్ రేడియో, బోనసు, మనియార్డర్లు రావడం, పడవమీద ప్రయాణం, పైనచెప్పిన కోవ[illegible] చెప్పుకోవాలి; ఇద్దరికీ ఇష్టంలేని వాటిలో సుబ్బారావు ఆఫీసు మేనేజరూ, కాకరకాయకూరా, పిల్లలూ, కేస్కార్ వగైరాలు.

ఒకరికి నచ్చి రెండోవారికి నచ్చనివాటి జాబితాలో స్త్రీ స్వాతంత్ర్యం, భేదాభిప్రాయాలూ, ఆడది ఉద్యోగం చెయ్యడం, శాస్త్రీయసంగీతం, వార్తాపత్రిక, విడాకులకు సదుపాయాలు సులువుకావడం, ప్రబంధ పఠనం ముఖ్యమైనవి.

సిల్వెస్టర్ దంపతులు చేసిన ఓఘాయిత్యం గురించి నవ్వి నవ్వి అలసిపోయాక, సీత నెమ్మదిగా అడిగింది. "ఎందుకండీ విడాకులూ..." అని.

ఇంకో క్షణం ఆలోచించి 'అతని చొక్కా ఈవిడకి నచ్చలేదా ఏవిటి... అసలు దొరలంతేటగా. పాపిడి వంకర అనో, బొత్తిగా వంకరలేకుండా మరీ వ(త్రి అందంగా తిప్పట్టిందికి వీల్లేకుండా ఉందనో వంక పెట్టి విడాకులు పుచ్చుకుంటారుటగా" అంది.

సుబ్బారావు నవ్వాడు. "మరీ అంత చేటుకాదులే. అలాటివన్నీ సినిమాల్లోనూ నైట్ క్లబ్బుల్లోనూ తిరిగేవాళ్లు చేసేవిలే. అక్కడకూడా సంసారులు స్తిమితంగానే ఉంటారుట. ఇంతకీ సిడ్నీ సిల్వెస్టరు విడాకులకి కారణం అలాటిది కాదు. వాళ్లు పన్నెండేళ్లు నిక్షేపంలా కాపరం చేశారట. నలుగురు పిల్లల్ని కన్నారట. వాళ్లిద్దరి తత్వాలూ పొసగవని ఇపుడు అనిపించి ఆ కారణంమీదనే ఇద్దరూ విడాకులు అడిగారుట" అన్నాడు సుబ్బారావు.

"ఇపుడా! పన్నెండేళ్ళు కాపరం చేశాక వాళ్ళ తత్వాలు పొసగవని తెలిసిందా అతిగాడికి!"

"అతిగాడంటావేం? ఆమెగారికీ కూడా ఈ మాటే అనిపించిందిటగా."

"వాళ్ళ తలకాయలా ఉంది. అతనిపుడు కధిలే నీ అదిష బతుకింగాను. నడివయసులో [illegible]కట్టుకుంటాడూ? అంతా ఈ విడాకుల మూలాన—"

సుబ్బారావు లేచి కూర్చున్నాడు. "పిల్లా అపరాత్రివేళ పోసలీ ప్రాబ్లెంస్‌తో తలబద్దలు కొట్టుకోవడం నాకు హాబీ కాదుగాని విడాకుల సదుపాయాన్ని తిట్టకు. విడాకు లుండబట్టే ఆడది బతికిపోయింది. లేకపోతే ఇంతే. చేశావా దేవుడా అని ఇష్టంలేని కాపరం చేస్తూ బతుకున్నాళ్ళూ ఉండే. [illegible] చేసే అదు దాటు పంచలా

# అల్పసంతోషి

'సాయంత్రం శ్యామల వచ్చింది.'

'ఊ...ఏమిటి విశేషాలు?' కాఫీ తాగుతూ అడిగాడు రామం.

'ఆ...ఏముంటాయి? సరిగాని అది కట్టుకొచ్చిందే ఆ చీర చూశారూ?'

'అదెప్పుడూ!! నేను చూడలేదే!' నవ్వుతూ అన్నాడు రామం.

'అబ్బా! పోదురూ! ఎప్పుడూ వేళాకోళమే' బుంగమూతి పెట్టింది సుబ్బులు.

'ఊ... చెప్పు......ఈసారి చక్కగా వింటానుగా!'

'శ్యామల మొగుడు మొన్న పూనా వెళ్ళినప్పుడు తెచ్చేడట. ఎంత బావుందనుకొన్నారూ! చాలా చాలా బావుంది ఆ చీర. దాని పేరు ఏదో చెప్పింది కూడాను! నోట్లో ఆడుతున్నట్టే ఉంది కానీ మర్చిపోయా.'

'కాంచనమాల చీరా? కామినీకదమ్ చీరా? లేకా...'

'అబ్బా! సినిమాస్టార్ల పేరు ఉండదండీ! అదేదో ఊరిపేరులా ఉంది!'

'కొల్లేగాల్ చీరా? కంచిపట్టా?'

'ఆ...గుర్తొచ్చింది. కొల్లేగాల్ సిల్కటండీ! ఎంత బావుందనుకొన్నారూ? ఎంతో చక్కగా ఉంది. ఆ చీర కట్టుకొంటే శ్యామలకి ఎంత అందం వచ్చిందని. ఖరీదు కూడా అట్టే లేదు. నలభై లోపే!'

'నల్లగా అగ్నిపంజరంలా ఉండి, భూమికి నాల్గడుగుల ఎత్తులో ఉంటే శ్యామలకే అంత అందంగా ఉంటే, తెల్లగా, పొడవుగా మెరుపుతీగలా ఉంటే నీకెంత బావుంటుందో...'

'అందుకనే, నాకు కొని పెడ్తారా?' అమాయకంగా అడిగింది సుబ్బులు.

'తప్పకుండా! నీకేం తక్కువ నా రాణీ...'

సుబ్బులు పొంగిపోయింది. 'మావారెంత మంచివారూ!' అనుకొంది.

* * * *

'ఎప్పుడూ చీరలూ, నగలూ, నీ మాడుముఖానికి అవే తక్కువయినట్టు. ఛా! నేనేం కొనేది లేదు.' చిరాగ్గా అన్నాడు విశ్వం.

'అవునవును, నాది మాడుముఖమే మరి. పెళ్ళాం నోరారా ఒక చీర కొనమని అడిగితే, కొనడానికి మనస్సు రాదు కానీ, కబుర్లు చెప్పమంటే మా బాగా చెప్తారు. ఛీ! ఏం మనుష్యులో.' మండిపోతూ అంది కాంత.

'నేనేం కబుర్లు చెప్పటంలేదు. ఐనా నీ ముఖానికి సిల్కుచీరలెందుకు?'

'మరి మీకు మాత్రం ఊలెన్ సూట్లు దండగ కాదా!'

'నోరు మూసుకో! మరి వాగావంటే, దవడ పగులుతుంది.'

'చేతకానివాళ్లు అంతకన్నా ఏం చేస్తారు!!' ఏడ్పు లంకించుకుంది కాంత.

తమ్ముడూ, తమ్ముడి పెళ్ళాం, ఎక్కడ వినిపోతారో అని భయపడుతూ: 'అబ్బా! ఊరుకోవే, మహమ్మారీ! తప్పకుండా రేపు కొంటానుగా!' బ్రతిమిలాడాడు విశ్వం చేసేదిలేక

వెంటనే ఏడ్పు మానేసి, విజయగర్వంతో నవ్వింది కాంత. రుసరుస లాడుతూ బయటికి పోయాడు విశ్వం!

పెరట్లోకి వెళ్తూ, బావగారి గదిలో గొడవ విని ఒక్కసారే విస్తుపోయింది సుబ్బులు. పాపం! కాంతని కొట్టాడో ఏమిటో!' అనుకొంటూ వెళ్ళిపోయింది.

* * * *

మర్నాడు క్రొత్తచీర కట్టుకొని, తెగమురిసిపోయింది కాంత!

'ఈ చీర కొనమన్నావ నేనా, బావగారు అంత గొడవ చేశారూ? మీమరిది ఏం తెమ్మన్నా, ఎప్పుడూ కొప్పడరు' అమాయకంగా అంది సుబ్బులు.

'ఆ...మా వారికి, మీ ఆయనలా తేనెపలుకులు చేతకావు మరి. ఎంత తిట్టినా, కొట్టినా, అడిగినవల్లా కొని తెస్తారు. మరి మీ ఆయనో! మాటలో కడుపు నింపేస్తాడు చమత్కారి కాబట్టి! పెళ్ళయి దగ్గర దగ్గర నాలుగేళ్ళవుతోందా? ఏం కొన్నాడు నీకు? ముచ్చటగా ఓ జాకెట్టుగుడ్డయినా తెచ్చాడూ? మీ ఆయన గొప్ప నావగ్గరే చెప్తావు' వెక్కిరింపుగా అంది కాంత:

నిజమే! తను ఏదడిగినా, తెస్తాననడమే గాని, ఒక్కటీ తేలేదు. అయితే మాత్రం? ఎంత ప్రేమగా మాట్లాడుతారు. ఒక్కనాడు కూడా తను చూడలేదు, బావగారూ తోటికోడలు సరదాగా మాట్లాడుకోవడం! ఏడ్చి, దెబ్బలు తిని కొని పించుకున్న చీర కట్టుకొంటే ఏం హాయి. 'ప్రేమతో మావారు తెచ్చే మల్లెపూల ముందు, ఈ చీరలూ, నగలూ ఏం పనికొస్తాయి? ఏమైనా మావారు చాలా మంచివారు' మళ్ళీ మనస్సులో అనుకొంది సుబ్బులు గర్వంగా!

సి. ఉత్తర

# పొర పొచ్చాలు

ఒదిగి కాపురం చెయ్యాలి. మనసులు వేరైతే మనుషులూ వేరవాల్సిందే" అన్నాడు.

"బావున్నాయి మాటలు. కథలో రాసుకుందురుగాని దాచిపెట్టుకోండి" అంటూ లేచి, తలుపులు గడియవేసి రాబోయింది సీత.

"అలాగే లే... మన తెలివితేటలు అక్కడితో ఆగిపోయాయి. కొబట్టి అంతే అంటావు" అన్నాడు సుబ్బారావు.

సీత తెల్లబోయింది. ఇంతమాట ఆయన ఎప్పుడూ అనలేదు. మనసు చివుక్కుమంది. అదోలా చూసింది.

సుబ్బారావు తల వంచుకున్నాడు.

ఇలా తగాయిదాలాడుకునే సుబ్బారావులూ, సీతమ్మలూ మర్నాటికల్లా యివి మరచిపోయి మామూలుగా ఉండవచ్చు. కాని, కొన్ని పెద్దవిషయాలు వచ్చేసరికి మనసులో అవి అలా నాటుకుపోతాయి. ఎంత మొగుడూ పెళ్లాలయినా గబుక్కున చెరిగిపోవు.

దాంపత్యంలో పొరపొచ్చాలనేవి కేవలం భేదాభిప్రాయాలవల్లనే వస్తాయనక పోయినా, వాటివల్ల చాలావరకు కలుగుతాయనవచ్చు. ఆ అభిప్రాయాలు బెర్లిన్ భవిష్యత్తుమీద, కేరళలో ప్రజాస్వామ్యం మీదనే కాకపోవచ్చు. కాకరకాయకూర గురించీ. రెండో అమ్మాయిని హైస్కూల్లో చేర్పించడం, మేనరికం చేసుకోవడం వగైరాలమీదకూడా కావచ్చు.

దూకుడుగా అన్నాననుకుంటే అనుకోండి గానీ, మనదేశంలో మొగుడూ పెళ్ళాల మధ్య పొరపొచ్చాలు రావడానికి సాంఘిక సమస్యలూ, సారస్వతాభిరుచులూ మొదలైన వాటిమీద ఏకాభిప్రాయం కుదరకపోవడం కారణం కాదు. మన వాళ్ళు అందాకా పోరు. పోలేరు. చదువుకోరు కనక. చదువంటే కేవలం జాగ్రఫీ, లెక్కలూ అనే కాదు. సుఖంగా బతకడానికి, ఎదటివాళ్ళని అర్థం చేసుకోవడానికీ, మొగుణ్ణి నిజమైన స్నేహితుడుగా గ్రహించడానికీ పనికొచ్చే చదువు. ఆమాటకొస్తే ఈ చదువు మొగాళ్ళకీ ఉండటంలేదు.

అందుకనే కాపరాలలో కలతలు. సీమ దొరలలా మనం కోర్టులకెక్కం కొబట్టి దాఖలాలు అంకెలలో చూపించలేమనుకోండి. అంతమాత్రాన లేవనలేముగదా.

మనలో ఇంకొక విశేషముంది. ఆపాటి ఈపాటి కలతలకు మనం అంత కలతచెందము. ఎక్కడేనా అలాగే జరగాలనుకోండి. బడిలో లతో జతకట్టడం కాదుగదా తగాదాలాడుకున్న పుడెల్లా దూరంగా పోవడానికి.

మాటవరసకి ఇందాకటి కథలో సిల్వెస్టర్ దంపతుల సంగతి చూద్దాం. ఆలుమగలిద్దరికీ తత్వాలు పొసగవని తేల్చుకోడానికి పన్నెండేళ్ళు పట్టిందిగదా. పన్నెండేళ్ళ తరవాత ఇకేంబుద్ధి అనుకున్నా, పన్నెండేళ్ళు సర్దుకుందామని ప్రయత్నించినా సర్దుకోని భేదాలు వచ్చాయనీ వాళ్ళు కాయకష్టులా అవి పోగొట్టడానికి ప్రయత్నించి వుంటారని అనుకోవడం న్యాయం.

ఇకనీ టపిక ఎంతసేపూ ఇంగ్లీషువాళ్ళ గొడవతో విసిడిస్తాందని మీరుకూడా అనకండి.

మా వారు, మా అన్నయ్యా అలాగే అన్నారు. అసలాడది ఆర్టికిల్స్ రాయడమేమిటనే రకం మా అన్నయ్యా. అదేదో సిగరెట్లు కాల్చడంలాటిదైనట్టు.

తీరా నేను రాసినది ఒకటే అచ్చయి, ఇద్దరు మెచ్చుకునేసరికి "ఆ! ఆడదానివని వేశారు" అనితీసి పారేశారు. తరవాత పంతానికి మొగాడిపేరుతో రాసి పంపించాను అది ప్రింటు వేశారు అనుకోండి.

చెప్పొచ్చేదేమిటంటే, ఆడదీ అనగానే ఇలాతీసిపారేస్తారు కమీజుమీద దుమ్ము దులిపినట్టు.

దీనికి ఈ రోజున ఏవొక్క పురుషుడినీ నేను తప్పట్టం లేదు. ఇది అలవాటై, పరిపాటిఅయి, తరవాత సంప్రదాయమనిపించుకుని ప్రతిష్ఠ గడించి మెల్లగా మననరనరాలా ఎక్కబాగా వంటబట్టేసిపోయింది.

ముఖ్యంగా ఈ దృష్టి దంపతులలో కలతలు రేపడానికి దారి తీస్తోంది. ప్రణయకలహాలన్నిటినీ మూసి దాంపత్యాన్ని భగ్నం చేసే కల్లోలాలుగా పొరబాటుబడి నేనీ మాటలు రాయటంలేదు. నేనెరిగిన ఎందరో గృహిణుల మనసులను తెలుసుకొని. ఈ అభిప్రాయానికి వచ్చాను. ఇది వాళ్ళు ఎవరికీ చెప్పరు. ఆప్తులకు కూడా ఓ పట్టాన తెలియనివ్వరు. కడుపు చించుకుంటే కాళ్ళ మీదపడాను ఎందుకులే అని ఊరుకుని అలాగే సర్దుకుపోతారు.

కాపరంలో పొరపొచ్చాలు రావడానికి అనేక కారణాలు ఒకరిపట్ల ఒకరికి (ఏవొకరికైనా కావచ్చు) గౌరవం లేకపోవడం, దాని మూలంగా సాధింపు, తరవాత కొప్పడతారన్న భయం; భయం కొద్దీ దాపరికం, అబద్ధం, అలాగే అనుమానం. దాన్నిబట్టి అబద్ధం మనసులో చిరాకు,

(58వ పేజీ చూడండి)

# అఫీసులలో ఆడవాళ్లు

(43 వ పేజీ తరువాయి)

ప్రక్కవాటాలో ఆయన "ఏమండోయి యిలా వచ్చారే" అంటున్నాడు.

"మాది వీళ్ళది ఒకవూరే. ఈ అమ్మాయి మా స్నేహితురాలే" అంటోంది మా ఫ్రెండ్. "ఆ పలకరిస్తే భార్యామణితో మన ఆఫీసులో పనిచేసే ఆవిడ వచ్చారే" అంటూ, "రండి, మా యింట్లో కూడా కాఫీ తీసుకుని వెడుదురుగాని" అంటున్నాడు. మా ఫ్రెండ్ "ఫరవాలేదండి. వద్దు. ఈసారి వచ్చినపుడు తీసుకుంటా" అంటోంది. అప్పుడు అనుకున్నా మా ఫ్రెండ్ కూడా ఆయన ఆఫీసులోనే పని చేస్తోందని, రోజూ ఆ చెప్పే మాటలు దీన్ని గురించేననీను...

## నిజం నిల డమీద

ఏమాటా నిజం నిలకడమీదగాని తెలియదంటారు. కొంతమంది మగవాళ్ళు అనూయతో వారియొక్క స్వాభావిక మోతుతో పనిచేసే ఆడవాళ్లను చాలా హీనంగా చూస్తూ ఎదట చక్కగా మాట్లాడుతూ, చాటుగా వెక్కిరిస్తూ వుంటారు. వాళ్ళ భార్యలుకూడా చదువుకున్న వాళ్ళు అయితే అంత తేలికగా ఎదుటి స్త్రీనిగురించి మాట్లాడరు. మా ఫ్రెండ్‌ని చూస్తే ఎవరూ బి. ఎ. చదివిన అమ్మాయి అనుకోరు. నిండుగా హుందాగా కళ్ళకు కాటుక, పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుంటుంది. మోచేతివరకు ముదరరంగు రవిక, నేతచీరలు కట్టుకుంటుంది. అనవసరంగా మాటాడదు కొంటి తోటివాళ్ళ! "అవసరమైనవి" తెలియలేదు. అంచేత వాళ్ళు తెలీనివన్నీ ఊహించుకుని అవే నిజంగా చెప్పుకుంటున్నారు. తరువాత ఈ విషయాలన్నీ తెలుసుకుని మా ప్రక్కయింటి ఆయన చాలా సిగ్గుపడిపోయాడు.

నలుగురు మొగవాళ్ళు కూర్చుంటే ఆడవాళ్ళ మాటలే. అందులో ఆఫీసులో పనిచేసే వాళ్ళు తోటిసహోద్యోగిని మాటలే. సోదర ఆఫీసర్లు తమయొక్క పరువు ప్రతిష్ఠలు పోగొట్టుకోవటమే కాని ఆ మాటలు ఆడవాళ్ళను ఏమీ చేయలేవని ఇకనైనా తెలుసుకోవాలి. వాళ్ళయొక్క భవిష్యత్తు వీళ్ళ చేతిలో వుందనుకుంటారు.

పదికల్లలాడి అయినా ఒక ఇల్లు నిలపమన్నారు. కాని ఈ రోజుల్లో పదికి ఇంకా పది కల్లలాడి సాధ్యమైనంతవరకు ఎన్ని ఇళ్ళయినా పాగొడుతున్నారు కొందరు. అటువంటి విషయాలు మానుకుని స్త్రీ పురోభివృద్ధికి పూనుకున్ననాడే మనదేశం ముందుకుపోతుంది. ఆడవాళ్లు బయటు చేరి దేశాన్ని బాగుచెయ్యలేకపోయినా కొంతకాలమైనా వుద్యోగంచేసి భర్తలకు తోడ్పడగలరు. పిల్లల క్రమశిక్షణ పెరుగగలదు. ఎస్. ఎ. పాసై ఇంట్లో వున్న స్త్రీకీ స్కూలు ఫైనల్ పాసై ఏ కొంతకాలమో వుద్యోగం చేసిన స్త్రీకీ లోకజ్ఞానంలో తేడా వుంటుంది. మన రాజకుమారి అమృతకౌర్ అన్నట్టు కాలేజీ చదువు చదివిన ప్రతి స్త్రీ కనీసం మూడేండ్లు అయినా వుద్యోగం చేయాలి.

కొంతమంది ఆడవాళ్ళు చదువుకుంటే చెడిపోతారు. వుద్యోగాలు చేస్తే చెడిపోతారు అంటారు. చదువుకోని వారిలో మటుకు ఎంతమంది తమభర్తలు సరిగా చూడటం లేదని తనుకన్న బిడ్డలనుకూడా వదిలిపెట్టి పరపురుషులను నమ్మి మోసపోయినవారు లేరు? ఎంతమంది చదువుకున్న యువతులు తల్లిదండ్రులవద్ద పెరిగి 25, 30 ఏళ్ళువచ్చినా పెండ్లికాకుండా చక్కగా వుద్యోగంచేసి మంచిపేరు తెచ్చుకున్నవారు లేరు. అది వారి స్వభావం.

స్త్రీలు అభివృద్ధిలోకి వచ్చేందుకు ప్రతి పురుషుడు సహాయం చేయలేకపోయినా హాని కలుగనివ్వరాదు. కొంతమంది మగవారు ఎదుట స్త్రీ గురించి చులకనగా మాట్లాడుతారు. ఈ రోజు తను ఎదట స్త్రీని అంటే రేపు తన అక్కను భార్యను ఎవరైనా అంటారని గ్రహించుకోవాలి. నెహ్రూజీ దేశభవిష్యత్ స్త్రీపైనే వున్నదన్నారు. స్త్రీ శక్తిని శంకించి హేళనచేసి స్త్రీల అభివృద్ధికి అడ్డుపడేవారు దేశద్రోహులుకూడా వెనుకంజవేయుటం లేదని భావించాలి. అటువంటి వారు స్త్రీ పురోభివృద్ధికి పాటుపడకపోయినా కనీసం అర్థంలేని అపవాదులను ప్రచారంచేసి అడ్డుపడరని ఆశిద్దాం. ★





### మిస్టరీ!

'ఆర్చేవారూ ఓదార్చేవారూ' అనే వ్యాసం రచయిత్రి ఎందుకు వ్రాశారో తెలియటంలేదు... అర్థంలేనివ్యాసాలు కాకుండా స్త్రీలకు ఉపయోగపడే వ్యాసాలు రాయాలని నా మనవి.

గుర్గ (హీరాకుడ్ కాలనీ, ఒరిస్సా.)

### దీటో

వకుళమాలగారు 'ఓదార్పుల' పై వ్యాసం ఎందుకు వ్రాశారో అర్థంకాలేదు.

ఎస్. వరలక్ష్మి, (తుని.)

### ఇది తగవా?

వకుళమాలగారి వ్యాసంపై విమర్శలు చూస్తున్నాను. చాలామంది అవి ఎందుకు వ్రాసినట్లు అని ప్రశ్నించి ఉపయోగం లేనివి వ్రాయకూడదని సలహా చెప్ప, చివరకు వ్యాసాలు ఎలా వ్రాయాలోకూడా బోధించి (!) మరి వదుల్తున్నారు...అయితే అన్నీ ఉపయోగకరమైనవే ఉండాలా? అన్ని సంఘాన్ని ఒకజం ఉద్ధరించేవి, మహిళలను ఓ ఫర్లాంగు ముందుకు లాగేవి అయితేగాని కాలా? వ్యంగ్యధోరణిలో కాలక్షేపానికి వ్రాసేవి పనికిరావా? అసలు ఇలాగే రాయాలి అని శాసించడం తగునా, వనితాలోకంలో కాంపోజిషన్‌లు రాయిస్తున్నారా?

హాయిగా నవ్వించే సంతోషపెట్టేవి! ఎంతమందికుంటుంది? నవ్వు మనస్సు లివ్యాన్ని తొలగించివేస్తుంది. వకుళమాలగారి వ్యాసం మనల్ని పిలిచి కబుర్లు చెప్పి అలా తీసుకువెళ్తూ చివరకు హుషారుగా తనతోపాటు పరుగులెత్తిస్తుందికూడా.

కె. రామారావు, (విశాఖపట్టణం.)

### రెండురంగుల సలహా

బాహ్యాలంకరణే అందానికి ఆకారమని, రంగులే అలంకారానికి మారుపేర్లనీ భ్రమపడే సోదరీమణులకు సుందరిగారి 'అందాల బాటలో తొలిమలుపు' అన్న వ్యాసం కను విప్పు కాగలదు. అయితే శారీరక ఆరోగ్యం ఒక్కటే ప్రధానమని ఆమె ఒకవైపు చెప్తూనే, స్నో, పౌడర్లవల్ల వచ్చే అందం కృత్రిమమని తిట్టుతూనే మరోవైపు నఖగణాల విషయంలో శ్రద్ధవహించాలనడంలో సబబు కనబడటంలేదు. ఈ రెండు సలహాలూ పరస్పర విరుద్ధంగాఉన్నట్టు తోస్తున్నది.

ఎం. హైమవతి, (న్యూఢిల్లీ.) ★

21. డాక్టర్లు అవసరమని చెప్పినపుడు తప్ప సంతాననిరోధ పద్ధతులను నిషేధించాలి. కో +

22. కుదిరని జబ్బులు కలవారికి, కావలిస్తే, బాధారహితంగా మృత్యువును స్వీకరించేహక్కు ఉండాలి. కో —

23. రాహుకాలం, శకునాలు మొదలైనవి పాతకాలపు నమ్మకాలు; వాటిని మనం ఏమాత్రం పాటించకూడదు.

24. కార్మికులను ఉపయోగించుకొనటమే కాని ఉత్పత్తికి తోడ్పడినందుకు తగిన ప్రతిఫలాన్ని ఇవ్వదుగనుక, పెట్టుబడిదారీ వ్యవస్థ అధర్మమైనది. అ +

25. మనం మన మతంలో, ధర్మశాస్త్రాలలో చెప్పబడినవన్నీ పూర్తిగా నమ్మాలి. అ —

26. ఎవ్వరైనా ఆత్మహత్య చేసుకోవాలంటే, సంఘం అడ్డుపెట్టకూడదు. కో —

27. స్త్రీపురుషులమధ్య స్వేచ్ఛాప్రణయం ఉండటం శరీరానికి, మనస్సుకుకూడా మంచిది. అ + కో —

28. శాంతిసమయంలోకూడా సైనికశిక్షణ ఉండితీరాలి. కో —

29 స్త్రీలను బలాత్కరించటం మొదలైన నేరాలను చేసే వారిని జైల్లో పెట్టినంతమాత్రాన చాలదు. వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించాలి. అ —

30. మంచికోసం అబద్ధం చెప్పినా తప్పులేదు. కో —

31. భగవంతుడు అనేభావం మనుష్యుని మనస్సు కల్పించినదే. కో —

32. పురుషులకు, స్త్రీలకు సమానమైన కామస్వాతంత్ర్యం ఉండటం న్యాయం.

33. దేశంలోని మతసంస్థలు, దేశవ్యవహారాలపై తమ అధికారం అభివృద్ధి పరచుకొనటానికి యత్నించాలి. కో +

34. తమ అంతరాత్మకు విరుద్ధమైనదనే కారణంతోనే ఆక్షేపించేవారు దేశద్రోహులు.

35. పాకిస్తాన్‌నుంచి వచ్చిన కాందిశీకులు తమసంగతి తామే చూచుకోవాలి. అలాగే ఇతరప్రాంతాల కాందిశీకులున్నూ. కో —

36. మత్స్యమాంసాన్ని ఆశ్రయించటమే నాగరికతకు శిరోమణి.

37. తనదేశంకన్నా మరొకదేశంపైన అభిమానంకలిగి ఆ దేశానికి సహాయపడినందుకు ఎవ్వరినీ శిక్షించకూడదు. అ +

38 జీవితంలో నెగ్గలేనివారు నశించిపోవటం సహజం. ఇందులో మనం విచారించవలసిందేమీ లేదు. కో —

39. అంతర్జాతీయ కార్యక్రమాలలో పాల్గొన్నప్పుడు ఈ దేశం తన స్వాతంత్ర్యానికి లోటు రాకుండా చూచుకోవాలి. అ —

40. నిష్ఠాపరులందరూ మోసగాళ్లు. కో —

41. ఈ రోజులలో ప్రతివాడూ తన అవసరమైన పనులలో సౌఖ్యం కలుగచేసుకుంటున్నాడు. కో —

42. భార్యాభర్తలమధ్య తప్ప ఇతరత్రా శరీరసంబంధం ఉండకూడదు. అ — కో +

43. కులమత భేదాలకు సంబంధించిన దురాచారాలను చట్టరీత్యా నిషేధించి కఠినమైనశిక్ష విధించాలి.

44. గర్భస్రావాన్ని నిషేధించే చట్టాలను రద్దుచేయాలి.

45. పాఠశాలలలో మతసంబంధమైనవిద్యాభ్యాసం ఉండితీరాలి.

46. అన్నివర్గాలవారూ, కులాలవారు సమానమైనవారే. సంఘానికి అవసరమైనవారే. కో +

47. మనం నేరస్థులను మరీ కఠినంగా శిక్షిస్తున్నాం. వారిని బాగుచేయడానికి ప్రయత్నించాలిగాని శిక్షించకూడదు. అ + కో +

48. ఆధునిక సంఘవ్యవస్థలోని దుర్గుణాలను దైవభక్తి మాత్రమే అరికట్టగలదు. కో +

49. ఎవ్వరూ పట్టుకోకపోతే అప్పుడప్పుడు టికెట్ లేకుండా ప్రయాణం చేయటంలో తప్పేమీ లేదు. కో —

50. జపానువాళ్ళు సహజంగా క్రూరమైనవాళ్ళు.

51. ఈ జీవితం క్షణభంగురం కనుక మనం వీలైనన్ని సుఖాలను అనుభవించడానికి ప్రయత్నించడంలో తప్పులేదు. కో —

52. యుద్ధంచేసే కన్నా విదేశాక్రమణకు లొంగిపోవడమే మంచిది. అ + కో +

53. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు వీరు ముగ్గురు దైవస్వరూపులు. సామాన్యులు కారు. కో +

54. తక్కువ కులాలనబడే వాటికి చెందిన వారిని ఎక్కువ కులాలనబడే వాటికి చెందినవారితో కలిసి మెలిసి తిరగనీయటం మంచిదికాదు. వారి పాఠశాలలు, నివాసస్థలాలు వేరేగా ఉండాలి.

55. చిన్నపిల్లలదగ్గర అసభ్యంగా మాట్లాడటం మంచిదికాదు

56. ఈ జగత్తు దైవసృష్టి. కో +

57. కోడి పందాలు, పొట్టేలు పందాలు, వేట మొదలైనవి క్రూరమైనవి. వాటిని నిషేధించాలి. కో —

58. దేశంలో ప్రతివారికీ పూర్తి స్వాతంత్ర్యంకంటె ఆదేశం శాంతి భద్రతలస్థాపన చాలా ముఖ్యం. కో +

59. ప్రతి ఒక్కరూ మానవాతీతమైన ఒకశక్తిని నమ్మి దానిప్రకారం నడుచుకోవాలి.

60. వేత్తకంటే వ్యవహారవేత్త సంఘానికి ఎక్కువ ఉపయోగపడతాడు. ★

## 22-7-59 తేదీలోగా ఈ కూపన్ పూర్తిచేసి మాకు పంపించండి.

మీ పేరు:

ఊరు:

జిల్లా:

వయస్సు:

| మీ అభిమాన రాజకీయపక్షం ఎదురుగా × గుర్తు పెట్టండి. | |
|---|---|
| కాంగ్రెసు | |
| ప్రజాసోషలిస్టు | |
| సోషలిస్టుపార్టీ | |
| సోషలిస్టు డెమొక్రాటిక్ పార్టీ | |
| ప్రజాపార్టీ | |
| జనసంఘ్ | |
| "స్వతంత్ర" పార్టీ | |
| కమ్యూనిస్టుపార్టీ | |
| ఏపార్టీ లేకపోతే | |

ఈ పేజీలోని వివరణప్రకారం మీరు మార్కులువేసుకోగా—

మొత్తం మార్కులు "అ" — మొత్తం మార్కులు "కో"

## రూ. 75/—బహుమతి గెలుచుకోండి.

"అ" మార్కుల మొత్తానికి ఒకసంఖ్య, "కో" మార్కుల మొత్తానికి ఒకసంఖ్య మా కార్యాలయంలో సీలు కవరులో భద్రపరచబడి ఉన్నాయి. ఈ రెండు సంఖ్యలను సరిగ్గా ఊహించి, ఈక్రింద పూర్తిచేసి పంపినవారికి రూ. 75/—బహుమతి. పైన పూర్తిచేసినదానికి దీనికి సంబంధం లేదు. మీ చిత్తం వచ్చిన సంఖ్యలను ఇక్కడ ఊహించి మాత్రమే వేయాలి.

"అ" — "కో"

# యక్ష ప్రశ్నలు

## సుకుమార్

(గతవారం తరువాయి)

ధర్మన్న గారు ఇట్టివిధంగా చెప్పనారంభించాడు.

"వినండాండీ—ఏమిటంటే అసలు పూర్వ కాలంలో అనగా—అనగా అనగారోజుల్లో—అనగా ఫోక్ లోర్ పీరియడ్ లో నన్నమాట, ఒకానొక రాజు వుండేవాడన్నమాట. ఈ రాజు ఒకానొక రోజున ఏదోవూరు బయలేరాడన్నమాట. లేరి, ఆవూరు చేరేలోగానే మార్గమధ్యంలో మరణించేశాడు. జెంచగానే అందరూ "ఏంచెప్మా వున్నట్టుండి ఇదీ!" అని ముక్కుమీద వేలేసుకుని రియాక్షన్ ఇచ్చారు. దరిమిలానూ ఆరాతీసి చూశారన్నమాట—వినండాండీ—చూడగా రాజుగారు బయలేరేముందు ఏదో అఘాయిత్యం జరిగి వుండాలని తేలింది. అదేమిటంటే—రాజుగారు బయలేరేముందుట—అగ్గిపుల్ల తీసి తను చుట్ట వెలిగించుకుని, ఇద్దరు మహామంత్రులకూ చెరోచుట్టాఇచ్చి అదేఅగ్గిపుల్ల'ను అందించాడుట—వాళ్ళు కాల్చేశారు. అంగువల్ల సిద్ధాంతులు తేల్చిన దేమిటంటే—ఒక అగ్గిపుల్లగీసి ముగ్గురు ముట్టించుకోవటంవల్లనే మహారాజు మరణించాడన్నారు. ఆనాటి నుంచీ అది దుశ్శకునాల లిస్టులో చేరిపోయి. ఈనాటి మనపాలిట 'యాంటీ సెంటిమెంటు'గా అవతరించింది. యాంటీ సెంటిమెంటుగల విషయాలయినాసరే, శుద్ధఫూపులు."

"అదా కథ?" అన్నాడు వచ్చినాయన ఆశ్చర్యపడిపోతూ.

"అదికథ" అన్నాడు ధర్మన్న గారు.

"అవును గాని ధర్మన్నా—అంటే ధర్మం కాదంటావేమోగాని ఫోక్ లోర్ లో చుట్ట కాల్చటం ఏమిటోయ్?" అన్నాడు 'మాట మధ్యంలో' యక్షేశ్వరరావు.

ఇందాక వచ్చినాయనపడ్డ ఆశ్చర్యానికి రెండున్నరరెట్లు పడ్డాడు ధర్మన్న గారు. పడి, లేచి—

"మంచివాళ్ళేనండీ యక్షేశ్వరరావు గారూ! ఫోక్ లోర్ లో చుట్ట కాల్చటం తప్పంటారేమిటండీ! చుట్టేకాదు—ఏ బ్రాండ్ సిగరెట్టైనా కాల్చుకోవచ్చును...మీకు తెలీదేమో—ఆ చిత్రాల్లో కార్లను నడిపించవచ్చును — ఏరోప్లేన్లూ, కింకుర్రాలూ, చాపలూ ఎగరవచ్చును. యక్షిణీ, దేవతా రాక్షసి, వీలైతే రంభా ఇంగ్రిడూ బాల్ రూమ్ డాన్స్ ఆడి రాకెన్ రోల్ స్టైల్ లో అరుస్తూ గెంతవచ్చును. సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ, భూలోకవాసియై సాంఘిక జీవితం గడుపుతున్న ఒక చిన్నదాన్ని చూచి, మూర్ఛిల్లి మోహంలో పడవచ్చును చిత్రం యండింగులో జవహర్ లాల్ నెహ్రూ గాని, శివుడుగాని రావచ్చును. ఈ చిత్రములకు ఒక కాలముండదు. అన్ని కాలాలకూ వర్తించే జోళ్ళలాగ, ఇవీ అన్ని కాలాలకూ వర్తిస్తాయి. అంగువల్ల వీటికి కాలాతీత చిత్రములనియూ, అన్ని రకముల మిశ్రయింపులూ గల 'కోడితోక' చిత్రాలు గనక, ఫోక్ లోర్ చిత్రములనియూ పేర్లు గలవు. వీటినే తెలుగు జనాలు జానపద టాకీలన్నారు టూకీగా!" అన్నాడు ధర్మన్న గారు అలిసిపోయి, నిట్టూరుస్తూ. "అంతేకాదు, నేను మాట్లాడిన దానికి ఎన్నిరెట్లో పొడుగయిన డైలాగులతో సంభాషించవచ్చును కూడా!" అన్నాడు. వచ్చినాయన ధర్మన్న గారికేసి, ఇంకా ఆశ్చర్యంగా చూశాడు—ఈయన కొన్ని విషయాలు తెలుసునో బాబోయ్ అని.

"చూశావా—నాయనా, వచ్చినాయనా! ఇటువంటి కథలన్నీ నీకు తెలిసివుండాలి. ఈ రకమైన వివరాలన్నీ కుణ్ణంగా వొచ్చివుండాలి. లేకపోతే ధర్మన్న గారి నడిగి అవన్నీ రాసుకుని కంఠతాపట్టు!" అన్నాడు యక్షేశ్వరరావు. వచ్చినాయన వెంటనే కాయితం, కలం తీసుకున్నాడు - ధర్మన్న గారి కళ్ళల్లోకి చెప్పండనే భావంతో చూస్తూ ధర్మన్న గారు అదోలా నవ్వాడు. యక్షేశ్వరరావు ఇదోలా నవ్వాడు.

"మీదేవూరండీ?" అన్నాడు వచ్చినాయన.

"ఆంధ్రప్రదేశ్" అన్నాడు ధర్మన్న గారు.

"ఓహో! అయితే, మీరు అక్కడి నుంచే రావటమా?"

"మరేం"

"అయితే మరి, మొన్న రిలీజయిన చిత్రం ఎలాపోతూందండీ?" అన్నాడు ఆత్రుతగా ఆ చిత్రం తన స్వతంత్ర చిత్రం కన్న మిన్నయైనట్టు. ధర్మన్న గారు కేవలం అరక్షణంపాటో. ఆరు క్షణాలపాటో నిశ్శబ్దంలోపడి, "బాగానే పోతోంది నిమిషానికి తొంభైఅడుగుల చొప్పున" అన్నాడు కూల్ గా. వొచ్చినాయనకు అసలు అర్థంకాలేదు. యక్షేశ్వరుని వంక లుక్ ఛేంజ్ చేశాడు.

"ఇది కూడా తెలీదన్నమాట! ఫిల్ము నిమిషానికి తొంభై అడుగులు పరిగెత్తుతుంది ప్రొజెక్టర్లోనూ, ఇక్కడానూ. నీకు ఏమీ తెలీదు బ్రదర్. తెలీకుండా చిత్రాలకు నిర్మాతృత్వం వహించాలనుకుంటున్నావు లాభం లేదు" అన్నాడు యక్షేశ్వరరావు.

"లాభం లేని వ్యాపారం నేను చెయ్యను సుమండోయ్-" అన్నాడు వచ్చినాయన.

"ఐతే చిత్రం వొద్దు గిత్రం వొద్దు వెంటనే ఛత్రం వేసుకొని వెళ్ళిపో!" అన్నాడు యక్షేశ్వరరావు చూపుడువేల్తో ఔట్ ఫీల్డు చూపిస్తూ. వచ్చినాయన తెచ్చుకొన్న గొడుగు తీసుకుని, వెంటనే వెళ్ళినాయనగా మారిపోయాడు!

"వెర్రినాయన! ఏమీ తెలీకుండా ప్రొడ్యూసర్ కావాలని ప్లాను" అన్నాడు యక్షేశ్వరరావు.

"సరే, మరొక కథ చెబుతాను. ఈ కథకు కూడా నువ్వు సరయిన సమాధానం ఇచ్చేశావంటే, అమాంతం నిన్ను ప్రొడ్యూసర్ గా మార్చేస్తాను!"

"నా తమ్ముళ్ళు?"

"నీ తమ్ముళ్ళూ నీవూ అందరూనూ"

"ఐతే ఆ కథ చెప్పండి. వినాలని కుతూహలం కలిగి వున్నాను" అన్నాడు ధర్మన్న గారు సర్దుకుని కూచుని.

(ఆశ్చర్యకరమైన అయిదో వారం)

# వార్తావరణం

శ్రీ సారథి స్టూడియోస్ వారి కొత్త చిత్రం నిర్మాణం పూర్తి అయింది. 'భాగ్యదేవత' అని పేరు పెట్టారు. రాజధానినుండి రాగల రెండవ చిత్రం అవుతుంది ఇది.

జగ్గయ్య, సావిత్రి, రాజసులోచన, కాంతయ్య, రేలంగి, సూర్యకాంతం మొదలగువారంతా ఇందులో పాల్గొన్నారు. దర్శకుడు తాపీ చాణక్య. సంగీత దర్శకుడు వేణు.

*　　*　　*

భరణీవారు '[illegible]' ఆధారంగా తీస్తున్న చిత్రం 'ఎండమావులు' పూర్తికావచ్చింది. భానుమతి, నాగేశ్వరరావు ముఖ్య పాత్రలు ధరించారు. రచన సముద్రాల, సంగీతం వేణు, దర్శకత్వం రామకృష్ణ.

*　　*　　*

చేతనావారి '[illegible] పెళ్లి' సగం పైచిలుకు పూర్తి అయింది. రమణామూర్తి, జానయ్య, కృష్ణకుమారి కుటుంబరావు నటిస్తున్నారు. రచయిత అనిసెట్టి సుబ్బారావు. సంగీత రచయిత రమేష్ నాయుడు. దర్శకుడు ప్రకాశరావు.

*　　*　　*

ప్రకాశరావుగారి 'రేణుకా మాహాత్మ్యం' దాదాపు పూర్తి అయింది. గుమ్మడి, జి. వరలక్ష్మి నటిస్తున్నారు. సంగీతం మల్లేశ్వరరావు.

*　　*　　*

రాజశ్రీవారి మూడో చిత్రం '[illegible] రాము' ఆగస్టులోగా విడుదల కాగలదని తెలుస్తుంది. ఈ చిత్రానికి ఔట్ డోర్ దృశ్యాలు తీయడానికి దర్శకుడు బి. ఎస్. రావు, నటులు రామారావు, రమణమూర్తి మొదలగువారు ఇటీవల హైదరాబాద్ వెళ్ళారు కాని వాతావరణం అనుకూలంగా లేక, కొంతపని మిగిలిపోయింది.

ఇందులో రామారావు, ప్రమీల, మాలిని, రమణమూర్తి, రేలంగి ప్రభృతులు పాల్గొన్నారు. రచయిత సదాశివబ్రహ్మం. సంగీతం ఘంటసాల. నిర్మాతలు అశ్వర్థ నారాయణ, సుందర్ లాల్ నహతా.

*　　*　　*

విఠల్ ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం 'పెళ్లిమీద పెళ్లి' నిర్మాణం మొన్ననే ఆరంభమైంది. రమణమూర్తి, చలం, కృష్ణకుమారి ముఖ్యపాత్రలు నిర్వహిస్తున్నారు. రచన శ్రీ కృష్ణమూర్తి. నిర్మాత, దర్శకుడు విఠలాచార్య.

ప్రసిద్ధ నటుడు గుమ్మడి వెంకటేశ్వరరావు త్యాగరాయనగరం హబిబుల్లా రోడ్లో చక్కని ఇల్లు కట్టించారు. మాంబళంలో ఈ రోడ్డు, సినిమా తారల ఎక్కువ నివాస ప్రాంతం. హబిబుల్లా రోడ్లో రంగారావు, సావిత్రి ఏడాదిక్రితం భవనాలు కట్టుకున్నారు. దాని పక్కన సారంగపాణి వీధిలో నాగేశ్వరరావు, తరవాత భగీరథమ్మాళ్ వీధిలో రమణారెడ్డి, అవతల పేసన్ థియేటర్ వేపు వానక్, రాజసులోచన ఉన్నారు. కొంచెం అవతలగా శ్రీరంజని జూనియర్ ఇల్లు ఉంది.

## గృహప్రవేశం

జూన్ 24 బుధవారం రాత్రి గుమ్మడి వెంకటేశ్వరరావు గారి గృహప్రవేశ మహోత్సవం జరుపుకొన్నారు. ఆ రాత్రి ముంబావు 9 గంటలకు విందు, బాలచందర్ వీణాగానసభ జరిగాయి. ఫిలిం పత్రికలలోని వారికొక, దానితో అంతో ఇంతో సంబంధమున్న వారంతా వచ్చి ఆయనకు శుభాభివందనలు అందజేశారు. నటుడుగా గొంతంతో పాటు వ్యక్తిగా అభిమానాన్ని కూడా సంపాదించుకున్న వారిలో గుమ్మడి ఒకరు. ఈ యింటికి నాగ వేసిన ప్రతి ఇటుకకు ఒక విలువ ఉంది ఫలాని అతిథి ఒకాయన అన్నారు

## వివాహం

విజయా పిక్చర్స్ మానేజింగ్ పార్ట్నర్ శ్రీ సి.హెచ్. పూర్ణచంద్రరావు, తమ రెండవ కుమారుడు చి|| తారక శ్యామాప్రసా

# ★ గొప్పోళ్ళ బతుకులు ★

అన్నారు. నిజంగా ఇప్పుడు వాణ్ని చంపుతా—ఎవడడ్డొస్తాడో చూస్తా—పట్టుబడితే వీళ్లు నన్ను చేసేదేముంది? మళ్లీ జైలుకు పంపుతారు—పంపనీ—ఇంతకన్నా నష్టమేముంది? వాడి రక్తంతో వచ్చిన మంగ సంతోషపడుతుంది.'

పానకాలులో తీవ్రప్రతీకారవాంఛ జైల్లో వున్నప్పుడే మొలకెత్తింది. ఇప్పుడది పెరిగి పెరిగి మహావృక్షంలాగా నిల్చుంది. దాని వేళ్లు గుండెల అట్టడుగున పాతుకున్నాయి. పగ లేపిన పొగలో పానకాలు కళ్ళు ఇంక దేన్నీ చూడలేకపోయాయి. ఇప్పుడతని లక్ష్యం ఒక్కటే-అది నిజంగా ఇప్పుడతడు హంతకుడవ్వటమే! ఆ దృఢ నిశ్చయంతో లేచి నిల్చున్నాడు. రోడ్లో నుంచి సాయంత్రం కమ్మరి వీరాయిదగ్గర నుండి తీసుకున్న కత్తిని బయటికి తీశాడు. ఒకసారి దాని పదును పరీక్షించాడు. "ఒక్క వేటుకు మొండేనికి మొండెం-తలకు తల విడిపోవాలి—" అనుకుని వూళ్లోకి బయలుదేరాడు.

ముదిరిన పానకంలాగా వెన్నెలలు చిక్కబడ్డాయి. పానకాలు దివాణం గేటుముందు నిల్చుని చుట్టూ కలయచూశాడు. నిశ్శబ్దంగా వుంది. ఆ చుట్టుపక్కల ఒక్క పిట్టకూడ మెదలటంలేదు. అప్పుడు గంట ఎంతైందో కూడ తెలియదు. చుక్కల్ని చూచి, అంచనా కట్టుదాంఅని ఆకాశం వంక చూశాడు. ఆనాడు మంగ తొడిగిన నల్ల రవికలాగావుంది నీలి ఆకాశం. సుభద్రమ్మగారు పెట్టిన తెల్లచీరలాగా వెన్నెలలు తెల్లగా, చిక్కగా వున్నాయి. మళ్ళీ మంగ స్వరూపం పానకాలు కళ్ళముందు మెదిలింది. తాగుతున్న బీడీ పారేసి గబగబ లోపలకు నడిచాడు.

ఏడు సంవత్సరాల తర్వాత ఇదే దివాణంలోకి అడుగుపెట్టడం. దివాణంలోకి కరెంటు వేశారు. ఆ ఎలక్ట్రిక్ స్తంభాలను పాతటానికడ్డువచ్చాయి కాబోలు బాదంచెట్లను నరికేశారు. పచ్చటిచెట్లతో కళకళలాడుతుండే ఆ స్థలమంతా అలనాపాలనా లేక బీడుపడి వుంది. పానకాలు ఇంకా ముందుకు నడిచాడు. ఏనుగును కట్టేసేచోట-ఒక పాడుబడ్డ ట్రాక్టరుంది. అయితే, లక్ష్మణస్వామి చచ్చిపోయాడన్నమాట. పానకాలు కళ్ళు చెమ్మగిల్లాయి. లక్ష్మణస్వామిని కట్టే ఇనుప గొలుసులుమాత్రం అక్కడ అలాగే పడి వున్నాయి.

బంగళాముందు వుండే ఖాళీస్థలంలో దొరగారి ఇలవేల్పు వేణుగోపాలస్వామి విగ్రహం వుండేది. పెద్దదొరగారి రోజుల్లో దానికి రోజూ పూలమాలలు వేసి, దీపారాధన చేసేవాళ్లు. ఇప్పుడావిగ్రహం సగం విరిగిపోయి శిథిలంగావుంది. "ఏ స్థితికి వచ్చావు స్వామీ?" అని నమస్కరించి ముందుకు వెళ్ళాడు. పెళ్ళిమంటపం దగ్గర ఒక పెద్దకారు ఆగివుంది. ఏదో దూర ప్రయాణం చేసి వచ్చినట్లుగా దాన్నిండా దుమ్ముకప్పేసివుంది. ఈ పెళ్ళి మంటపంలో చిన్నమ్మాయిగారి పెళ్లి ఎంత వైభవంగా జరిగింది! ముందు కచ్చేరి సావిడి దాటి లోపలకు వచ్చాడు. అక్కడి గోడలన్నీ చవుడుతిని రేపోమాపో చచ్చే రోగిలాగా వున్నాయి. గదుల్లో అక్కడొక్క లైటు, ఇక్కడొక లైటు వెలుగుతున్నాయి. పెద్ద హాలులోకి వచ్చాడు.

అక్కడెవడో పనిచేసేవాడు కాబోలు గుర్రుపెట్టి నిదురపోతున్నాడు. నీరసంగా వెలుగుతున్న దీపం కాంతిలో హాలు దిగాలుమంటోంది. గోడలు పెళ్లలు రాలిపోతున్నాయి. గోడకున్న పటాలు దుమ్ముతో నిండివున్నాయి. ఒక పులితలకాయి గోడన వుంది. కాలంతోపాటు, మనుష్యులతో, పాటు దాని మొగంలోని సహజగంభీరత క్షీణించిపోతుందా అన్నట్లు వుంది. పెద్దాయన హయాంలో ఈహాలు ఎంత కొట్టొచ్చినట్లుండేది! దిక్కులేని దివాణమంటే ఇదే కాబోలు అనుకుంటు పానకాలు ముందుకు పోయాడు.

ఆ భవనమంతా తనకు కొట్టిన పిండే కనుక, తన్ను అడ్డగించటానికి అక్కడెవరూ లేకపోటంవల్ల పానకాలు నేరుగా మేడమీద చిన్నదొర గది దగ్గరకువెళ్ళాడు. ఆ గదిలోనుంచి మాటలు కొద్ది కొద్దిగా వినిస్తున్నాయి. ఉండీ వుండీ వచ్చే కిలకిలనవ్వులు అక్కడావరించిన ప్రశాంతతను, విషాదపు నీడలను తరుమటానికి ప్రయత్నిస్తున్నట్లున్నాయి. అంత పెద్దభవనం మొత్తంమీద ఆ గదిలోనే కొత్త అలికిడి వినిపించింది. పానకాలు రక్తం వేగంగా వురకలేస్తోంది. ఈ గదిలోనే మంగ మానభంగం జరిగింది, ఈ గదిలోనే ఈ వంశజుల కీర్తికి గ్రహణం పట్టింది. ఈ గదిలోనే వాడితల నేల రాలబోతోందనుకున్నాడు పానకాలు. బొడ్డులోంచి కత్తి బయటకు తీశాడు. పానకాలుకు ముచ్చెమటలు పోస్తున్నాయి. సహజంగా సహృదయుడు, సాత్వికుడైన పానకాలు ఆ సమయంలో పగ ప్రతీకార వాంఛతో కుటిలుడుగా, దుర్మార్గుడుగా రూపొందాడు. మెల్లగా ఆ గదితలుపుదగ్గరకువెళ్ళి తట్టబోయాడు. అసలు లోపల ఏం జరుగుతుందో చూద్దామని కిటికీ వద్దకొచ్చాడు. కిటికీ నీడలో నిల్చుని లోపలకు తొంగిచూశాడు.

లోపల నిశ్చలంగా వెలుగుతున్న దీపం తెల్లటి కాంతులతో గదిని నింపుతోంది. ఒక వన్నెల విసనకర్ర నిలువుటద్దంముందు అర్ధనగ్నంగా నిల్చుని, తన ప్రతిబింబాన్ని చూచుకుంటోంది. ఇంతలో బక్కపలచగా, పొడుగ్గా వున్న ఒకపురుషుడు ఒక గ్లాసులో ఏదో పానీయాన్ని తెచ్చి, "ఇది తాగు డార్లింగ్! నీబడలికంతా ఒక్క దెబ్బతో ఎగిరిపోతుంది" అంటూ గ్లాసునందించాడు.

ఆ సుందరి ఆ పానీయాన్ని రెండు గుక్కల్లో గటగటా తాగేసి, బద్ధకంగా వళ్లు విరుచుకుంది. ఆ వళ్లు విరుపులో శరీరపు వంపుల్లోని సొంపు అతిశయించింది. ఆ వయ్యారి అతి నాజూకుగా ఆవులించి, పందిరిమంచంమీద బద్ధకంగా వాలిపోయింది. "అబ్బ! వెధవ జర్నీ-వళ్లంతా నొప్పులుగా వుంది డియర్!" అంటూ పాములాగా పక్కమీద అటు ఇటు మెలికలు తిరిగింది.

ఆ పురుషుడు నాలుగైదు గ్లాసులను ఖాళీచేసి, తూలుతున్న అడుగులలో మంచాన్ని సమీపించాడు. "కాళ్లు పట్టమంటావా డార్లింగ్?" అంటూ ఆమె కాళ్లను తన వడిలో పెట్టుకుని వత్తట మారంభించాడు. ఆ సుందరి కట్టుకున్న భార్యలాగా "ఛీ! అదేం పనండీ?" అంటూ అడ్డు పడలేదు సరికదా—బరువుగా రెప్పలను మూసి, మొగలి పొట్టలో ముడుచుకుని పడున్న తెల్లత్రాచులాగా ఆ తెల్లటి పరుపుమీద గాఢ నిద్రలో మునిగిపోయింది. ఆ మానవుడు కొన్ని నిమిషాల్లో "నీతోపాటే నేనూ—" అన్నట్లుగా నిద్రలో లీనమైపోయాడు.

ఆ పురుషాధముడు చిన్నదొర! ఆ కామిని అతని వుంపుడుకత్తె!

ఆ గది గోడలకు ఆ వంశం మూలపురుషుల చిత్రపటాలు వేలాడుతున్నాయి. ఈ వంశోద్ధారకుడు చేసిన ఘనకార్యాన్ని చూడలేక దుమ్ము అనే తెరమాటున మొగాలను చాటు చేసుకున్నారు.

కిటికీ అవతలనుండి ఈ దృశ్యాన్ని చూచిన పానకాలు తన కళ్లను తానే నమ్మలేక పోయాడు. వీడు చిన్న దొరేనా? సుభద్రమ్మగారి కడుపున పుట్టినవాడేనా? లేక మరొకడా? ఎందుకో తనకే సిగ్గేసింది. ఇంతకూ తను చంపబోయేది—ఈ వెధవనా? అయ్య! ఆడదాని కాళ్లు వత్తటమా? పెద్ద వంశంలో పుట్టి ఈ పాడుపని చేయటానికి సిగ్గులేదా? ఒక బజారు మనిషి కాళ్ళుపట్టే, ఈ చచ్చు మనిషిని చంపి—తన చేతులు రక్తంతో తడుపుకుంటాడా? ఛీ—ఛీ—ఆ వెధవపని తాను చెయ్యలేడు—పానకాలు గిరుక్కున వెనక్కి తిర్గి వచ్చిన దోవనే బయటికొచ్చాడు.

పానకాలు రోడ్డుమీదకొచ్చి దివాణం వైపు చూశాడు. ఆ దిక్కులేని దివాణం వెనుక క్షీణ చంద్రుడు కుంగుతూ మంగచితి నుండి లేచిన ఎఱ్ఱని మంటల్లాంటి, వెలుగుల్ని పైకెగయజిమ్ముతున్నాడు.

"గొప్పోళ్ళ బతుకులు!" అంటూ పానకాలు కాండ్రించి వుమ్మి, స్టేషనువైపు విసురుగా పోయాడు. ★



# పుస్తక సమీక్ష

## సంసార సాగరం

గ్రంథకర్త: శ్రీ రాజమయ్యర్ — తమిళంనుంచి అనువాదకులు: శ్రీ శ్రీవాత్సవ దొరకుచోటు: ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ. పేజీలు: 328. వెల రూ 2-50.

తమిళ భాషలో శ్రీ రాజమయ్యర్ రచించిన కమలాంబాళ్ చరిత్రమునకు తెలుగు అనువాదము. ఈ నవలకు తమిళ సాహిత్యంలో మంచి స్థానమున్నది. ఆ భాషలో చదవవలసిన మంచి పుస్తకాల్లో ఇదొకటి. రచయిత అతని చిన్న వయస్సులోనే ఇది రాశారు. గొప్ప సాంసారిక నవల. పాత్రలన్నీ సహజంగా వున్నవి. కథ వాస్తవంగా జరిగి నట్టువుంది. మామూలుగా సంసారాల్లోని ఆట పాటలను చిత్రించారు. పూర్తిగా చదివిన తరువాత ఇట్టి పాత్రలు సామాన్య జీవితంలో ఉండకుండా వుండవని అనుకోము. ఎవరినిమరిచిపోయినా మరిచిపోకపోయినా పొన్నమ్మాళ్ ను, సుబ్బును మరిచిపోము. పుస్తకం చదివిన తరువాత, నిత్య జీవితంలో తటస్థపడే మనుష్యులను చూచినప్పుడెల్లా కమలాంబాళ్, పొన్నమ్మాళ్ లేక సుబ్బుల్లాగా వున్నారే అనిపిస్తుంది. సరిగా ఆలోచిస్తే ఈ పాత్రలు ప్రతి దేశంలోను, ప్రతి రాష్ట్రంలోను, ప్రతి జిల్లాలోనూ వుంటయ్. కేవలం తమిళ దేశానికేగాదు, అవిభక్త మద్రాసు రాజధాని వారంతా చదివి తీరాలె. చిన్న, పెద్ద, స్త్రీ పురుషులందరూ చదవాలె. చదవటమే కాదు, చదివి వారి వారి మనస్సులను, చేష్టలను తెలుసుకోవాలె. తెలుసుకొని అంతటితో ఊరుకోగూడదు. చెడును దిద్దుకోవాలె. అప్పుడే పుస్తకాన్ని చదివిన ఫలితం వస్తుంది. కేవలం పుస్తకం చదివి, బాగుందని ఆనందించి అవతల పారేస్తే లాభంలేదు.

చిరుకులమ్ అనే గ్రామంలో ముత్తుస్వామి అయ్యర్, అతని భార్య కమలాంబాళ్, కూతురు లక్ష్మి వుంటారు — తమ్ముడు సుబ్రహ్మణ్యానికి అన్న గారంటే గురికొని, అతని భార్య పొన్నమ్మాళ్ గడుసుది — కమలాంబాళ్ అంటే కోపం. అసూయ. పడగు — భర్త అయిన సుబ్రహ్మణ్యాన్ని కూడా ముంగు పెట్టి చంపుకొంటుంది — ఆ గ్రామంలో అమ్మలక్కల మహా సభాధ్యక్షురాలైన సుబ్బు, పొన్నమ్మాళ్ తల్లి శంకరి అందుకు అనేక కుట్రలు పన్నుతారు ముత్తుస్వామి అయ్యర్ కాపరం చెడగొట్టాలెనని. కొంతవరకు పన్నాగాలు నెరవేరుతవి — ముత్తుస్వామి కాశిలో సన్యాసాశ్రమం తీసుకొనటం — చివరకు కాశిలో అందరూ కలిసికొనటం జరుగుతుంది.

పుస్తకంలో అసందర్భమైన అనుభవాలు ఎక్కడా లేవు హెచ్చు తగ్గులు లేకుండా కథ సాగిపోతుంది. పూర్వపు రోజుల్లో వున్న బందిపోటు దొంగల భయము, నరబలి వ్యవహారాలను గూర్చి కూడా రాస్తారు గ్రామ వ్యవహారాలు బాగా తెలుస్తవి. మధ్య తరగతి కుటుంబాలు ఈర్ష్యలు, ఓర్వలేనితనం ఎటువంటివో శక్తిమంతంగా చిత్రించారు. మనస్తత్వ చిత్రణ, వివిధ భావ వివరణ చెప్పుకోతగినవి. కథలోని ప్రతి వ్యక్తి విశిష్ట స్వరూపస్వభావాలు వివరించబడినవి,

పుస్తకం అచ్చు బాగుంది. అనువాదం హాయిగా వుంది. 209 పేజీలో, పైన అధ్యాయం, తప్పుగా అచ్చు వేయబడింది. ఇంకొ రెండుమూడు అచ్చుతప్పులు వున్నవి. తమిళ భాషలో ఈ పుస్తకం ఇంకొ బాగుండొచ్చు. వీలుగావుంటే ఇంకో చౌక ప్రతి కూడా వేసి ఇంటింటికీ అందేటట్లు చూడాలె.

రా: ★

## పొరపొచ్చాలు

(46 వ పేజీ తరువాయి)

మరికొన్ని పెద్ద కారణాలు: అత్తగారూ ఆడపడుచునాను ఏగం చికాకులు, ఇంట్లో ఆడవాళ్లు తగవులాడుకుని, సాయంత్రం అలసి ఇంటికివచ్చిన మొగాడితో ఏకరువు పెట్టడంవల్లనే. అతడు కూడా కొన్నాళ్లు సరి చెబుతాడు. తరవాత ఎవరో ఒకరిని వెనకేసుకొచ్చి రెండోవాళ్ళని మందలిస్తాడు. చివరికి విసుగెత్తి ఇద్దరికీ దూరంగాపోతాడు.

ఇలాటి చెడదలు లేని కాపరాలూ ఉంటాయి. నేనెరిగిన అరడజను సందర్భాలను బట్టి ఒకటి అర్థమైంది.

పెళ్లాం కాపరానికొచ్చిన కొత్తల్లో కొందరు భర్తలు మోజుకొద్దీనూ, ఆవిడ్ని సంతోషపెట్టాలనీ డబ్బంత ఆమెకేయిచ్చి, కాణీ అర్థణా దగ్గర్నించీ కావలసినపుడే అడిగి తీసుకుంటారు. ఆవిడా ఈ పరసంలో స్వాతంత్ర్యం చవిచూచి, సరదాగనే ప్రతి అర్థణాకీ చూరిపించి, అరవై ప్రశ్నలు వేసి మరీ మంజూరు చేస్తుంది. చివరకి కొన్నాళ్ళ తరవాత మొగాడు ఈ పద్ధతికి అలవాటుపడితే పరే సరిగాని — అతడు మళ్ళీ తన స్వతంత్రం తను ఉంచుకోవాలని హఠాత్తుగా అనుకుంటే అది చటుక్కున రాదు. అప్పుడు పెద్దసమస్య వస్తుంది. అతను మాటలంటాడు. ఆవిడ జవాబిస్తుంది. మాటా మాటా పెరగడంలో ఏదో ఓటి తూలుతుంది. ఎవరో ఒకరికి అది గుండెల్లో గాఢంగా గుచ్చుకుంటుంది. అభిమానంకొద్దీ అప్పటికా బాధని అలాగే అణుచుకుంటారు. అది అక్కడే ఉండిపోతుంది. భార్యభర్తల అనురాగంలో చిన్న అపశ్రుతి...

ఇంకోరకం భర్తలు భార్యని బొత్తిగా నమ్మరు. చేతికి కానీ ఇవ్వరు. ఇచ్చినా లెక్క అడుగుతారు. చెప్పినా సాధింపక మానరు. చివరికావిడ మొండికెత్తి గాజులికీ పూసలికీ డబ్బు కావాల్సి వచ్చి పప్పూ ఉప్పూ కొనడంలో అణా బేడా పోగుచేసి దాన్ని పోపుల పెట్లోనో, వత్తుల డబ్బాలోనో జాగ్రత్త చేసుకుంటుంది. అక్కర్లేని సరుకులు కావాలనిచెప్పి డబ్బు తీసుకుంటుంది. ఒకవేళ సరుకే కొనిచ్చినా దాన్ని ఇరుగా మెకు అమ్మి డబ్బు చేసుకునే ఇల్లాళ్ళనుకూడా నేను ఎరుగుదును. అలా భర్తదగ్గర అబద్ధం చెప్పారంటే, ఆ దుస్థితికి వాళ్ళు పూర్తిగా బాధ్యులు కారు.

వివాహం అనేది పవిత్రమైనదని, దాన్ని అపవిత్రం చేసే వారి దగ్గర్నుంచీ అందరికీ తెలుసు. అయినా, భార్యాభర్తల సంబంధమే వాస్తవమైన, పరమమైన స్నేహం అన్న భావాన్ని అనేకులు గుర్తించరు.

ఆయన ఏదో నాలుగురాళ్ళు తెచ్చి పారేసేవాడు అన్నట్టుగా ఆవిడా, ఇంత వండి పారవేసి తిని కూర్చుంటుంది అన్నట్టుఆయనా ప్రవర్తించడం బాధాకరం.

మాంగల్యం ఎంత బలమైనదని మనం నమ్ముతున్నామో అంత సున్నితమైనదని కూడా గ్రహించాలి. దానికి దెబ్బతగిలిన ఉత్తరక్షణాన పుస్తెలతాడు పడవలు లాగే మోకు అయిపోతుంది. ఈమాట భార్యలకన్న ఎక్కువగా భర్తలే గుర్తుంచుకోవాలి.

చిల్లర తగవులు వచ్చినప్పుడెల్లా భయపడి ఒకరికొకరు దాసోహం మనాలనను. అవన్నీ తుపానులై కల్లోలాలు లేవదీస్తాయనీ, భార్యాభర్తలమధ్య దాటరాని అఖాతాలు ఏర్పడతాయనీ నా ఉద్దేశ్యం కాదు. చిల్లరతగవులు, చిన్నవిషయాలలో అభిప్రాయభేదాలూ, సన్నసన్నగా చివాట్లూ, మెల్లిమెల్లిగా సాధింపులూ బయలుదేరినప్పుడు వాటివల్ల ఒకరినొకరు అనుమానించడం, ఒకరి కొకరు భయపడడం, ఒకరితో ఒకరు అబద్ధాలు చెప్పవలసిరావడం, దాపరికాలకు అలవాటుపడడం, ఇలాటివాటికి చోటివ్వకుండా జాగ్రత్తపడాలని. వీటికి చోటిస్తే అవే అరబ్బీ గుడారంలో ఒంటెలా అంతా వ్యాపించి, మనుష్యుల్ని దూరంచేస్తాయనను ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad



"పరిత్యాగం"

చిత్రకారుడు : పెల్లటూరి పూర్ణానందశర్మ.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది!



వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా, ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే, విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్‌లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును.

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.

పిల్ ఫర్-ప్రూఫ్ మూతత్తోను, క్రొత్త ఎఱ్ఱ లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయాబడుచున్నది.



ఇప్పుడు వాడుకలో లేని ఎఱ్ఱ రాపర్

## ఆరోగ్యమునకు హితవైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్